గోడపై నున్నగడియారము మాత్రము తనస్వామి ననుసరించుదానివలె విసుగులేక కాలచక్రపరిణామమును సూచించుచునే యుండెను.

అపు డాకస్మికముగ నాప్రశాంతపయోధిగర్భమునుండి యొక ఘీంకారధ్వని యొకనిమేషమాత్రము వినువారివీనులు బ్రద్దలగునట్లొనర్చెను. సేవకుఁడు మేల్కొనిపడి లేచి గవాక్షముచెంత కేఁగి పరికించెను. కాని యందు గాఢాంధకారముతప్ప నతని కేదియు కనులఁ బొడకట్టలేదు. యజమాని కార్యమున కీభయంకరనినాద మెట్టియంతరాయమును కల్పింపలేదు. సేవకుఁడు మరల తనస్థానము చేరి నిద్రాదేవియాశ్లేషసుఖమున నావికారనినాదసంజనిత తాత్కాలిక భయసంభ్రమముల మఱచెను. కాని యది యతనికి చిరకాల ముండలేదు.

ఆకస్మికముగ నత్యంతసమీపమున శిరీషశయనాగారమునుండి "హత్య, హత్య—రక్షింపుఁడు—రక్షింపుఁ"డను నార్తధ్వని వినవచ్చెను. సేవకయజమానులిరువురు నొక్కుమ్మడిగ శిరీషశయ్యాగారము చెంత చేరి, కవాటముసుద్ఘాటింప యత్నించిరి. కాని నిష్ఫలము. మరల లోనుండి హత్యయనుధ్వనియు నెవ్వరో పెనఁగులాడినసవ్వడియు పిస్తోలు కాల్చినధ్వనియు వినవచ్చెను.

పాపమా వృద్ధులిరువురును తలుపు బ్రద్దలుకొట్టుటకై ప్రయత్నించిరి. కాని నిష్ఫలమయ్యెను. కవాటము సుదృఢమై వారిశక్తిని మీరుచు నిజనందినిదుర్మరణమునుండి రక్షింప కడునాతురతతో నున్న జనకుని దయార్ద్రప్రవాహమునకు దుర్లంఘ్యవిఘ్నమును గొలుపుచుండెను. దైవ మంతట తనివి నందలేదు. వృద్ధజనకునిమనోధైర్యము నిరీక్షింప కాఁబోలు, లోపల మరల పిస్తోలు కాల్చినధ్వనియు, పెనుకలహమునఁ గూలు, లోపల కుర్చీబల్లలు క్రిందఁ బడినధ్వనియు వినవచ్చెను.

కించుచు ముంగురులచే నప్పుడప్పుడు నిజవిశాలఫాలస్థలమును మూయుచు పఱచుచు, హస్తమునం బ్రకాశించుచున్న గడియారము పైపు పరికించుచు కూర్చుండి యుండెను.

జగమంతయు స్వీయనిరంకుశాధికారపరిధి నిముంచి, జగ్రదం గమున సాటిలేక వెలయు ప్రశాంతదేవతాజ్ఞోల్లంఘన మొనర్చ వెఱచిరో యున నాగదియందుసైతము నిశ్శబ్దతయుండెను. ద్రావకము లు గాజుపాత్రలలో పోయుధ్వనియు, గడియారము టిక్ టిక్ మను ధ్వనియు తప్ప నానిశ్శబ్దత కేయంతరాయమును లేదు.

కొన్నినిమేషములట్లు నిశ్శబ్దముగ గడచెను. సాయమాదవ్యాపి చూపులు గడియారమునంగ ప్రసరించుట యుంతరింతి కేన్త్రు డయ్యెను. యువతివిలోకనముల నలరి తనసంతసము తెలుపుటకై కాంబోలు, గడియారము కంగుకంగుమని 11 గంటలుకొట్టెను. అంతట నాతరుణి తనయాసనము వీడి వృద్ధుని సమీపించి పూతసుభుజసీమను స్వీయకోమల కరపల్లవము నలంకరించుచు "జనకా! నేను నిమునింప నేగుదునా" యని మృదుమధురస్వనమున పలికెను. వృద్ధుండు నాకొమ్మపై ప్రేమవిలోకనములం బ్రసరించుచు "శిరీషా! పోయి సుఖముగ పరుం డుము. నీవీరాత్రి సమయమున మేల్కాంచి మిగుల నలసియున్నదానవు" అనియెను. శిరీషయు "నింక నాలుగుదినములే గదా? యుట్లే" యని చిఱునవ్వున పలుకుచు, నాగదియందున్న మొకతలుపు తెఱచెను. అదియే యామె శయ్యామందిరము. పిదప నామె లోనికేగి యాతలుపు గడియవేసి కొనుటయేగాక లోపల తాళముసైతము వేసి కొనియెను.

వృద్ధుండు మరల తనకార్యసాగరమున నిమగ్నుండయ్యెను. ద్రావ కసహితమగుగాజుపాత్ర మొకటి స్టౌపై గ్రాగుచుండెను. అయుదుపదిం చూపులా ద్రావకమునందే విలీనము లగుచుండెను. సగరు సంతయు నిశ్శబ్దముగ నుండెను. సేవకుని కునికిపాటు నిద్రగ మాఱుచుండె

గోడపై నున్న గడియారము మాత్రము తనస్వామి ననుసరించుదానివలె విసుగు లేక కాలచక్రపరిణామమును సూచించుచునే యుండెను.

అపు డాకస్మికముగ నాప్రశాంతపయోధిగర్భమునుండి యొక వికారధ్వని యొకనిమేషమాత్రము వినువారివీనులు బ్రద్దలగునట్లొనర్చెను. సేవకుఁ డులికిపడి లేచి గవాక్షముచెంత కేఁగి పరికించెను. కాని యందు గాఢాంధకారముతప్ప నతని కేదియు కనులఁ బొడకట్టలేదు. యజమానికార్యమున కీభయంకరనినాద మెట్టియంతరాయమును కల్పింపలేదు. సేవకుఁడు మరల తనస్థానము చేరి నిద్రాదేవియాశ్లేషసుఖమున నావికారనినాదసంజనిత తాత్కాలిక భయసంభ్రమముల మఱచెను. కాని యది యతనికి చిరకాల ముండలేదు.

ఆకస్మికముగ నత్యంతసమీపమున శిరీషశయనాగారమునుండి "హత్య. హత్య-రక్షింపుఁడు-రక్షింపుఁ"డను నార్తధ్వని వినవచ్చెను. సేవకయజమానులిరువురు నొక్కుమ్మడిగ శిరీషశయ్యాగారము చెంత చేరి, కవాటమునుద్ఘాటింప యత్నించిరి. కాని నిష్ఫలము. మరల లోనుండి హత్యయనుధ్వనియు నెవ్వరో పెనఁగులాడినసవ్వడియు పిస్తోలు కాల్చినధ్వనియు వినవచ్చెను.

పాపమావృద్ధులిరువురును తలుపు బ్రద్దలుకొట్టుటకై ప్రయత్నించిరి. కాని నిష్ఫలమయ్యెను. కవాటము సుదృఢమై వీరిశక్తిని మీరుచు నిజనందనిదుర్మరణమునుండి రక్షింప కడునాతురతతో నున్న జనకుని యాశాప్రవాహమునకు దుర్లంఘ్యవిఘ్నమును గొలుపుచుండెను. దైన నంతటఁ దనివి నందలేదు. వృద్ధజనకునిమనోధైర్యము నిరీక్షింప కాఁబోలు, లోపల మరల పిస్తోలు కాల్చినధ్వనియు, పెనుకలపా ముఖఁ బోలు, లోపల కుర్చీబల్లలు క్రిందఁ బడినధ్వనియు వినవచ్చెను.

అప్పటియావృద్ధజనకునిహృదయభావముల వర్ణింప నెవనితరము! తనముద్దుతనయ తనసమీపమున వధింపఁబడుచుండ నాతఁడు కెట్టిసాయ మొనర్చుటకును చెంతఁ జేరుటకైనఁజాలక యసమర్థుఁడై యుండెను. ఆతనిసర్వస్వముఁ గైకొనినదైనఁగవాటము తెఱచువారు లేరే, సేవకుఁ డీఘోరము తిలకింపఁజాలక యాగదికి గవాక్షముండుట జ్ఞప్తికిరా శర వేగమున నాయిల్లు వదలి బయటికేతెంచి హత్యాగారగవాక్షముఁ జేరెను. ఆదిన మాతృత్రాణ పరాయణుఁడగు దైవము ఏరి కన్నయును విఘ్నములే కల్పించి యుండెను. ఆకిటికీతలుపులు మూయఁబడి లోపల గడియవేయఁబడి యుండెను. గత్యంతరము లేక సేవకుఁడచ్చోటికి కొంత దూరమున నున్నవనపాలక [illegible] వైపు పరువెత్తెను. అతఁడు విశేషమంతయు వర్ణింపఁగనే వనపాలక దంపతులు, సముచితవస్త్రాలంకారులై వారే సంసిద్ధులైయుండి యితని నను రొక్కనిరి. అందఱును మరల మందిరమున కేతెంచిరి.

అచ్చట వృద్ధుఁడు కవాటభేదనమునకై యావచ్ఛక్తిని వినియోగించెను. లోపల శబ్దమును అంతకంతకు తక్కువదై తుద కంతయు నిశ్శబ్దమయ్యెను. సేవకుఁడువచ్చువేళకు వృద్ధుఁడు పిచ్చివానిచందమున నొక్కపరి శిరమునున్న వెండ్రుకల లాగికొనుచు మఱియొకపరి రక్తము స్రవించుచున్నను మానక కవాటమును గ్రుద్దుచు నుండెను.

ఆగంతుకులసాయమున కవాట ముద్ఘాటింపఁబడియెను. కాని యుండేమున్నది. హంతకుఁడు లేఁడు శిశుకన్యామాత్రము ముఖమంతయు రక్తమయమైయుండ మృతప్రాయమై పడియుండెను. అంతయు బీభత్సము—అంతయు భయానకము.

# ప్రథమ ఖండము

## మొదటి ప్రకరణము

నేను పంచాననబాబుమందిరమున కడునబ్బురముగ జనసామాన్యము నాకర్షించు పరమనిగూఢరహస్యసముద్భూతాపరాధమును వార్తాపత్రికల యందు ప్రచురించుటకన్న నెక్కుడుగ విశదీకరించి జగద్రంగమున నునుప నసమర్థుఁడనై యుంటిని. బహుభావతరంగములు, ననేకకల్పనా వాహినులు, పెక్కుసంభావనాశ్రేణులు, జనమానసప్రకృతినుండివిశృంఖలరీతి నాయపరాధరహస్యతత్త్వమునుగూర్చి వెలువడుచునేయున్నవి. కాని, నిక్కంపుతత్త్వ మియ్యదియని ప్రపంచపటమున ముద్రింపఁబడదయ్యె. నామిత్రవతంసమగు బాబుబలసూదనకుమారుఁడు పేరుమగంటిమి పట్టుదలతో తన శేముషీసర్వస్వమును వెదఁగొల్పి, యారహస్యగభీర పారావారమునునీఁది, తదుదంతప్రకటనమునకిదివఱకు తనయంగీకారమును దృఢతరముగ నొసఁగకుండియుండినందున ప్రకృతిజనవిజ్ఞానవిలోకనములకు తద్రహస్యాపరాధపదార్థ మిట్టిదని గ్రహింప శక్యముగనసమర్థములై యుండెను. ప్రకృత మట్టిరహస్యగోపనమనావశ్యక మైనకతన మామక సఖుని యప్రతిమానశేముషీప్రభను, నిరర్గళవస్తుతత్త్వజ్ఞానమును నిరుపమాన పదార్థపరిశోధనపటిమను లోకదర్పణమును ప్రతిఫలింపఁ

జేయుటకై నా లేఖిని కడుదిట్టరియై ముందంజవేయుటచే నే నీగూఢాపరాధ దుర్గవిభేదనచరిత్రను వ్రాయనుత్సుకుఁడనైతిని.

నేను కవితాకన్యకు కడుదూరుఁడను. గ్రంథసంవిధానచాతురికి బాహిరుఁడను. సాహిత్యపరిణతికి దరిద్రుఁడను. అయినను నాకుఁబ్రియసఖుఁడై, యనన్యసామాన్యప్రతిభావంతుఁడై కడు లేఁబ్రాయమునఁ నే యగణ్యకీర్తిరామామనోభిరాముఁడై యున్న బలసూదనకుమారవిక్రమని యసాధారణపరిశోధన మహానాటకమును ప్రకటింపఁబూనిన నా సాహసమును క్షమించి పాఠకులు నన్ను మన్నింతురుగాత.

18—ఫిబ్రవరి 25 తేదీని ప్రకటింపఁబడిన "బొంబాయిక్రానికల్"
పత్రికయందీవిధముగ ప్రకటనము చదివితిని."
ఘోరతరము—"హత్యోద్యమము" పరమాద్భుతము—

నిన్నటిరేయి 11 గంటలకు సుప్రసిద్ధరసాయనపండితుఁడగు శ్రీయుతపంచాననబాబుభవనమున నతని ప్రియనందనియగుశిరీషకుమారిని దుండగీఁడులెవ్వారో సంహరింప నుద్యోగించిరి. హంతకులెవ్వారో తెలియదు. శిరీష సందేహజీవితయై యున్నది. సంపూర్ణముగ విషయములు తెలియుటలేదు. (తంతిమూలమున)

పంచాననుఁడు రసాయనపారీణతయందు నసాధారణుఁడని విఖ్యాతిని బడసిన విబుధవతంసుఁడు—అతఁడు రసాయనవిద్యాపరిశ్రమ నొనర్చుటకై వీరార్ బొంబయిమార్గముననున్న 'బైండరు' అను గ్రామమునకు రెండుమైళ్లదూరమున నొక్క సముచితమందిరమును నిర్మించుకొనియుండి నియతనివాస మొనర్చుచుండెను. అతనియేక పుత్రిక యగుశిరీష 19 సంవత్సరముల నిండుజవ్వని. బాగా విద్యాపారంగతయై రసాయనపరిశ్రమమున తనజనకునకెంతయు సైదోడుగనుండెను. అయినయింకను నవివాహిత. అజనకకుమారికలు ధనసంపన్నులగుట నానిర్జనప్రదేశమున నున్నయాని కేతనమున సేవకజన

సహాయమున నిశ్చింతగ నివసించుచుండిరి. వారిసత్ప్రవర్తనమును, సదయ భావమును, సమున్నతగౌరవమును, సమస్తజనులకును వారియెడ భక్తివిశ్వాసముల జనింపఁజేయుచుండెను. వారికెవ్వరును శత్రువులు లేరు. అయిన నీహత్యాప్రయత్నమునకు కారణమేమి? ఇంతటితో ప్రకటనకర్త విరామమునొందెను."

అదియేమియోకాని, యీవార్తాలహరి నాహృదయక్షేత్రమున ప్రవహించినదాది నాకును "నిష్కారణగాఢమగు క్రూరహత్యాతంత్ర ప్రాదమును ఛేదించి యందలియథార్థతత్త్వమును వెలిఁదీయుదునా" యనితోఁచి నాసంకల్పతరంగము యథేచ్ఛముగ నటింపసాగెను. నామి త్రుఁడదిన అను తనమేధాశస్త్రమున నపరాధనిర్ఛేద్యప్రయత్న హేతువుల సాధించి యెట్టియమేయయశశ్చంద్రికల నార్జించెనో? నేనును నట్టి యశోధనము నేలగడింపరాదని యుత్కలికాకుతూహల మిక్కుట మన్నా డింప మొదలిడెను. కాని, తోడనే యట్టి యద్భుతాకారముఁ దాల్చిన యీ యపరాధగహనమునందలి విషయతరువుల పరిశీలించి యందుమిడి యున్న యపరాధకమృగమును గ్రహింప సమకట్టితిని. ప్రతివిషయసుమ ములను నేరఁదొడంగితిని. తొలుదొల్త పంచాననుని యశోగౌర వాదుల నాగసిన నవియెల్ల కైతవములు కావనియు, నిస్సందేహము లనియు, సత్ప్రవర్తనములనియుఁ దెలియవచ్చె. అయినయట్టి సుశ్లో కుఁడు, నట్టిసముంచితవైభవోదారుఁడు పురమునవివసింపక నాగరికదృశ్య వైభవముల కాంక్షింపక నిర్జనమై, యనాగరిక జననివాసయోగ్యమగు నట్టి యరణ్యసమానప్రదేశమున నేలనివసించుచుండెనో! యనిసందియ పడుటబ్బురము కాదుగదా! అందును నగరమునకు సుదూరమైన వీరార్ బొంబయిమార్గమున కాపురముండుటచే నిదియు ననుమానమునే కలిగించెను. అంతచాల గౌరవకుటుంబమునకు చేరస్లైన పంచాననుఁడు మిత్రులు, బాంధవులు, కులీనసఖులు, బొంబయియందు కలిగియుండియు

వారిపొందు వాసి యీవిజనక్షేత్రపుతూపాలి గోలయ్యెననియు, కావున నీ యీరసాయనవేత్త కులీనగౌరవసంతతి యుండలేకపోయెననియు, అందుచే తన జననప్రవర్తన నివాసములకొకనైన యొప్పొసాంతిముం దలి ప్రముక్కుడీఁడుల పెనురాయిడి కోర్కెఁజాలక యింకనున్నియుండా ననియు, నూతనాంకూరము లుదయించెను. ఇంతసత్వరముగ మహాసేనాపుల కగమ్యములగు నిహాత్మ్యామార్గమునూర్గము నపరిచితుఁడవగు నేను కనుఁగొనఁ గల్గినందుకు సంతోషాశ్చర్యసంశయములు మూఁప్పిరిగొని నన్ను బాధింపఁజొచ్చెను.

అంతట వానినుండి నేను విముక్తుఁడనగుటకుముందు ఘంటానాదధ్వని వీనులసోఁకెను. వచ్చినవా రెవ్వరో యని నేనాలోచించుచుండఁగనే నా యాలోచనాపదమునుండి దిగ నామిత్రవర్యుఁడగు జలనూదనకుమార బాబు నానయనపథము నలంకరించెను. సంభాషణల సంధానాబల పెట్టియుఘటనములన్నైన తలంచినంతనె సమయస్ఫూర్తి కదనే తారాక్రాణము.

అతనికరరాజీవమున కార్యసముద్యోగమున కలిసి సహాయము మొక్కటియేగాక "బాంబయిక్రానికల్ అండ్ ఇండియా" నామకాల ప్రకటన పత్రికయూడ సంస్ఫురించుచుండెను.

ఆసమయమున నతని యువ్వులు వంగదేశీయయువకునివేషమును సంపూర్ణత నొందించుచుండెను. శుభ్రస పట్టువస్త్రమును, ధవళసీమ కౌశేయోత్తరీయమును, వంగదేశీయత నాపాదించుచుండెను; కట్టినసనము జిలుగువారు ధవళకాంతుల వెదఁజల్లుచుండెను. కరమున వెండి బెత్తమును, పాదముల పులిచర్మంపు నుపానహములును శోభిల్లుచుండెను.

అప్పటికి సాయంకాల మాఱుగంటలై యుండనోపునని శీతల మహోదధితరంగ సంగతిసుఖలగు వాతపోతములచే తెలియుచుండుటచే మాముకనయస్నుని యాకస్మిక సాయంతన సమాయోగము నాకచ్చెరు పాటుఁగలిగించెను. అతఁడమోముఁదమ్మి మౌనముద్రితమై గభీర యోచనానిమగ్నత సూచించుచుండ నను పలుకరించుటకుమాఱు తినచేత నసియాడుచున్న వార్తాపత్రికను నాముందున వైచెను. నే నాపత్రికను సాభిలాషముగ గ్రహించి సాతురభావమున చదివితిని. అందిట్లు విషయువిశేఖన ముండెను.

## "The Affair of the Three Perfumed skulls,.

## మూఁడుతలలబుఱ్ఱ రహస్యము

మేము పంచానన పరమాద్భుత క్రూరరహస్యాపరాధ ప్రకటన మున నెంతయు సగర్వానందమ నొందుచున్నారమని నాయుటకు సంత సించుచున్నారము. ఇట్టిదుగిభగ మాశ్చర్యతరాపరాధములే చిరంతన పరోపకారపారీణుఁడై, యాత్రజనశరణ్యుఁడై, దుష్టాపరాధకహరిణ పుండరీకుఁడై, అవిదితాదృశ్య విషయపరిజ్ఞానవాచస్పతియై భూకాంత కెనలేని యలంకృతి యొనర్చుచు మీపటిచయపథమున నిదివఱకు సంచరించుచుండిన శ్రీయుతబాబూ బలసూదనకుమారుని యప్రతి మాన దీప్రభావ సదయభావ సంస్తుత్యకీర్తుల నిసుమడింపఁజేయు కారణ భూతములు. ప్రస్తుతము దొరతనమువా రెంతయో సన్మానించి, పరి శోధకపదమున నలంకరింపఁజేసిన సుప్రసిద్ధ పరిశోధక శిరోమణియై జగ న్నుతసత్కీర్తినిఁగన్న శ్రీయుత ద్విజేంద్రలాలుగారుసైతము, ప్రవేలిడఁ జాలక నిస్తబ్ధత నొందిన The Affair of the Left foot చౌదరీవారి సృష్టినాశముల విషయమున ధనాగారపు ఘోరచౌర్యాపరాధ పరిశోధన మున నెంతయు నెనలేనికృతార్థత నంది దిగంతకీర్తిసంపన్నతకు దావలమయ్యె.

సుగంధవాసితములగు మనుజులతలబుఱ్ఱలలో నొకటి యందున్నబల్లపైని రెండవది గోడయందును, మూడవది శయ్యయందును, సునుపబడి యుండెను. మిద్దెపైకప్పున పిస్తోలుగుండుదెబ్బచే కలిగినచిహ్నముండెను. హంతకుఁడెట్లు మాయమయ్యెనో, యీకపాలములందిట్లమర్పఁబడియుండుటకు కారణమేమో దురూహ్యము.

ఈవార్తాప్రకటన విశేషవిషయము నావిర్భవించినవెంటనే, "యీయపరాధ దుర్గమునకు, దారి లభించె"నని సకౌతుకమైన నాహృదయదర్పణమున నీదుర్గ మంతకంతకు దుర్గమమై, దురధిగమమై, దుర్భవ లోకమై చూపట్టసాగెను. నిరాశాసూచకదృష్టులచేఁ గాంచు చున్ననను గాంచి నామిత్రుఁడు నిట్లుసమందహాసముగ పలుకరించెను. " వశీకర ! ఏల యిట్లు విస్మితనయనములచే నను చూడసాగితివి ? "

వశీ : నాకీవిషయమున సాధించినకొలఁది సంశయములే మొలకలెత్తుచున్నవి. హంతకుఁడెట్లు మాయమయ్యెనో ! రెండుమారులు పిస్తోలును కాల్చుటకు కారణమేమో ; ఇత్యాది నన్ను వ్యత్యస్తునిఁ జేయుచున్నది.

బల : అపరాధి మాయమగు విషయ మంత చోద్యముకాదు గాని, రెండుమారులు పిస్తోలుకాల్చుటయే పరమాశ్చర్యము.

వశీ : అందేమాశ్చర్యమున్నది ! ప్రథమమున హంతకునిగురి తప్పియుండవచ్చును. అందుపై నతఁడు మరల కాల్చియుండ వచ్చును.

బల : ( మందహాసమున ) మిత్రమా ! న్యాయవాదియగు నీవే యిట్లు పొరపడుచున్న నిఁక రక్షకశాఖవారినన నేల ?

వశీ : ఇందు నేపొరపడితినా !

బల : అవును. ఆపిస్తోలును హంతకుఁ డుపయోగింపనే లేదు.

వశీ : ఏమీ ! హంతకుఁడు పిస్తోలును కాల్పలేదా ? అయిన దాని నెవ్వరు కాల్చిరి ?

బల : శిరీషకుమారియే యాత్మరక్షణార్థమై పిస్తోలును గొని తూటాలు కాల్చెను.

వశీ : ఏమి ! ఏమి ! ఆత్మరక్షణార్థమై శిరీష పిస్తోలును కాల్చెనా ? అయిన దేనిచే నామె వధింపఁబడియెను ? నిదర్శనము తెల్పుము ?

బల : నిదర్శనములా ? నిదర్శనములు—ఆ పడియుండిన పిస్తోలు గుండే—

# రెండవ ప్రకరణము

అప్పటికింకను బొంబయియందలి "కొలాబా" స్టేషనునుండి విరారుకుం బోవు ధూమశకటము "గ్రాంటురోడు" స్టేషనునకు వచ్చియుండలేదు. నామిత్రునకు హత్యాస్థానమైన "బైండరు" చేరుటకై, యెంతయాతురత యున్నను ధూమశకటము వచ్చు నిర్ణీతకాలమువఱకు మేము వేచియుండవలసివచ్చెను. ఆతని యాకారచేష్టాదులు సంపూర్ణముగ మారియుండెను. నిరవధియగు యోచనాపయోధిలో మునింగి బాహ్యప్రపంచ వ్యాపారములందు దృష్టిలేక బలసూదనుడు వ్యస్తచిత్తునింబోలె, గ్రహగ్రస్తునికైవడి నొకమూల కూర్చుండినను మనము నేనొనర్చు ప్రశ్నములకు సదుత్తరమియ్యక మౌనముద్ర వహించియుండెను.

ధూమశకటము వచ్చుసమయము సమీపించెను. అంత, ఏబది వత్సరముల మధ్యవయస్కుడగు వాడొక్కడును, కొంచెమించుమించుగ సంతియవయసు గలవాడు మఱియొక్కడును; సత్వరగమనమున ధూమశకటాలయముం జేరి బైండరునకు టికెట్లు పుచ్చుకొని రెండవ తరగతిబండియం దెక్క సిద్ధముగనుండిరి. ఆ మొదటివాని మోము గాంచినంతనె బలసూదనునకు మనోవికాసము తొలుకాడం దొడంగెను. వెంటనే యాతడు లేచి యా మధ్యవయస్కుని నెదుర్కొని, "అయ్యా! వందనములు. తామును హత్యాస్థలమగు జమీందారమందిరమునకే పోవుచున్నారా?" యని సవినయముగ ప్రశ్నించెను. వాగీశచంద్రుడు తలయూచి "అవునయ్యా! పోవకతప్పునా? దండవిధాయి (మేజస్ట్రీటు) నైనమాకు కృత్యమిదిగదా!" యని మాటలాడుచు, నందు

నాకర్ణించినందున కలుగుశబ్దము వారిని వేగిరింప నింకను "హత్యా. హత్యా. రక్షింపుఁడు. రక్షింపుఁడు." అనుసకరుణ దీనాలాపములు వారిని కమాసాహసమునకు ప్రేరేపించి ద్వారభేదమునకు దృఢీకృతులఁజేసెను. దానికి పైదోఁటుగ నొక్కపిస్తోలు ప్రేల్చిన భయదారావమున వారు విశీర్ణహృదయులైరి. వారు కవాటవిభేదన వ్యాపారము నొనర్చు సమయముననే, మఱియొకమారు పిస్తోలుగాల్చిన పెనురావము నాలించి వారియుద్యానపాలకులగు కౌముదీ కందళులు సత్వరగమనమున నచ్చటికేతెంచిరి. అయిన వారు ఆనడురేయిసైతము రాత్రికాలోచితములగు నుడుపుల ధరింపక విహారోచితములగు పరిధానాదుల ధరించియుండిరి. వనపాలక దంపతులు సైతము లోనజరుగు మహాఘోర విపద్విధానము నాలింపనుమకట్టి సోద్వేగమానసములచే కవాటోద్ఘాటన వ్యాపారమున పంచాన వసంతులకు నెంతయు తోడ్పడిరి. ఎట్టకేలకట్టి ద్వారము గృహాంతరమున ప్రవర్తిల్లిన యాఘోరహత్యను గాంచనోపక విభిన్నములయ్యెనో యనునట్లు వీడియుండలి జాలిఁగొలుపు దీనశోకోద్వేగము మాన్ప తాను నేలగూలి వారికి దారియొసఁగెను. కాని, లోనహంతకుఁడొక్కఁడును కానరాఁడయ్యె. పైనెగసిపోవుటకు వానికి రెక్కలుగాని గృహముపైకప్పునందు రంధ్రముగాని లేదు. ఇఁక భూమిని వగుల్చుకొనిపోవ పాతాళ భవనమును లేదు. గవాక్షములును ద్వారమును దారియొసఁగలేదు. ఇట్లుండ హంతకుఁడేమయ్యెను?.

* మందిరాంతరమునందున్న ఉన్నతాసనములును బల్లలమొదలగు వస్తువులు చిన్నవ్యత్యస్తములై క్రింద పడియుండెను. ఒకయుష్ణీషమును వేరొండు కరవస్త్రమును మఱియొక పిస్తోలును గొట్టకొమ్మను నందు పడియుండెను. గది దక్షిణపుగోడపైని రక్తసిక్తమగు హంతకుని హస్తచిహ్నమొండు గాన్పించెను. పిస్తోలును పరీక్షింప నదివసంతుని నామాక్షరములచే నంకితమై యుండెను. వసంతుఁడా యక్షరములఁ

ఇంతలో మేము జయంత మందిరపు ప్రాకారపరిసరమును జేరితిమి. అప్పటికి 8_15 నిమిషములకు మించియుండలేదు. ఆ ప్రాకారపు గోడకు మూడు ఫర్లాంగుల దూరమున దానికి దక్షిణదిశను భోజన విక్రయశాల ( హోటలు ) యొకటియుండెను. అందు వచ్చి పోవువారి సంఖ్య యపరిమితముగ నుండెను, ఆశాలాధికారి జనములకు పలయు మాంససంస్కార పదార్థముల నొసఁగుచు "ఇఁకముందు నీమృగమాంస మిచటలభించుట కలవగు" ననియెను. మేమాశాలను నతిక్రమించి జయంత మందిర ప్రాకారసమీపమునకువచ్చితిమి.

# మూఁడవ ప్రకరణము

కథానుగమనమునకు ముందు అపరాధనిలయమైన జయంతమందిర పరిచయమును పాఠకులకు కలిగించుట యనవసరవ్యాపారము కాదని భావించెదము.

జయంతమందిరము "బైండరు" గ్రామమునకు రమారమి 2 మైళ్ళ దూరముననున్నది. ఈగృహమునకు తూర్పుదెస ననతిదూరమున "యువనాతిపూర్" అనుచిన్నపల్లె తప్ప దానిచుట్టుపట్ల మఱి వేఱుగ్రామ మేదియు లేదు. అరణ్యము మాత్రము శరణ్యముగ నుండెను. ఆపల్లియను చేరియే యొక రాజమార్గము పోవుచున్నది. యువనాతి-పూర్‌కు మూఁడుపర్లాంగుల దూరమున రాజమార్గమునకు దక్షిణ వైపునఁ గడచిన ప్రకరణమున మేమువివరించిన భోజన ఫలాహారశాల యొకటి ప్రవాసులకు భోజనఫలాహారాదుల సౌకర్యమునకై యెంతయో యుపయోగకారియై యుండెను. ప్రస్తుతము మందిర బహిఃప్రదేశము నింతపరిచయ మొనర్చుట చాలును; నింకలక్ష్యీకరింతము.

మేము సుదూరము వ్యాపించియున్న గృహప్రాకారమును చేరినంతట, అందెవరో గౌరవోచిత వేషధారి యగుఘనమనుజుఁడు వెనుకకును ముందునకును తిరుగుచు పరువెత్తుచు న్నాప్రదేశమును కొలిచి లిఖించుచు అట్టిసమయమున చేతిని మాటమాటికి పరికించుచు తనయుటిచేతిని నప్పుడప్పుడు చూచికొని యేమిరో క్షణకాలము వితర్కించుకొనుచు నొక్కొక్కమారు నేలమీఁద పరుండి తదేక దృష్టిచే దేనినో పరీక్షించుచు నొక్కొక్కపుడు గోడవైపు నాలోకించుచు మంగాళ్ళపై నొక్కచో నుపవేశించుచుండెను.

ఆతని గాంచినవెంటనే బలసూదనుఁడు, "అదె నాహుము. అప్పుడే దొరతనపు పరిశోధకోద్యోగుల కెల్ల మిన్నయై సకలదేశములచే పరిశోధనపాండిత్యని కొనియాడఁబడుచున్న శ్రీయుత ద్విజేంద్రలాలు గారు దొరతనమువారిపరముగ నపరాధపరిశోధన మొనర్చుచున్నవారు సర్కారువారు ఇంతకుముం దొకపరిశోధకవరుని పంపి యీదుర్భేద్యతి మాపరాధతంత్రమును భేదింప నేరకిని సాధ్యముకాదని భావించి ప్రస్తుతము కలకత్తానగరమున నొక్కమహానిగూఢ తంత్రపరిశోధనయందు నియుక్తులైన యీద్విజేంద్రలాలుగారి నీయపరాధవిమర్శకై నియోగించియున్నారు. ఇమ్మహామహుం డతిమేధాశాలి, లోకోత్తరపరిశోధక చక్రవర్తి, నాకీతనియందు సముచితగౌరవమును సమధిక భక్తియు కలదు, ఈయతిలోకోత్తరుని దర్శించి యనేకాంశముల గ్రహింపవలెనని నాకు చిరంతనకాలమునుండి నీపేరాసయుండెను, నేఁడు నాయభిలాషాపరిపూర్తి యొదవుభాగ్యము గంటిని, రమ్ము, ఘోషవదము అల్లదెతాను నిశ్చలదృష్టిచే అటచేతిని విలోకించు నదేదియనుకొంటివి? అది గడియారము, కాలవిజ్ఞానముకై దానిని చూచుచున్నాఁడు, ముంగాళ్ళపై కూర్చుండి పరీక్షించున దేమనుకొనియొదవు? హంతకుని పదచిహ్నాలే యైయుండనోపు, ప్రహరిగోడనుండి పరువెత్తుటకు కారణమేమనియొదవు? ఆగోడనుండి పాదచిహ్నములనటకు నతివేగముగ నడచిన నెంతకాలము పట్టునోయని విమర్శించుచున్నవాఁడు, రమ్ము, మనము భవనము చేరనరుగుదము, మనకీప్రాకార బహిర్భాగమున ప్రస్తుతము నడుగుల గుఱుతించుట కార్యకారిగాదు, మందిరాంతరమునమందు శయనమందిరమును ప్రాకారాంతర్భాగమును తత్పరిసరమును పరీక్షించి ప్రాకారబహిర్భాగమునకు వత్తము. ద్విజేంద్రుఁడు లోనపరీక్షణమును సాంతము గావించుకొని యుండనోపు, కాకున్న బహిఃప్రదేశమున తనశేముషీవివేచనను ఫురికొల్పుఁడు.

మేమిరువురము ప్రహరీకుడ్యమును చేరి యందున్న మహాద్వారముకడ నిలిచితిమి. ముఖద్వారకవాటములు మూయఁబడియుండెను. కాన, నామిత్రుని శేముషీశస్త్రము లోనప్రవేశించెను. కాని, మేము లోనికేఁగుటకు వీలుపడదయ్యె.

ఇంతలో ద్విజేంద్రుఁడు, తనపత్రికను సమాప్తినొందించి కాఁబోలు కవాటముదరి కరుదెంచి తాళమువేసిన యాకవాటద్వారమును తెఱవనుద్యుక్తుఁడగుచు మావంక తన నిశితవీక్షణముల నెలకొల్పి, మేము వచ్చినకార్యమును గూర్చి వినయముగ ప్రశ్నించెను. బలసూదనుఁడించుక ముందంజవేసి సవినయ గౌరవమున "ఆర్యభూషణా! మేము పంచాననబాబుగారి యల్లుఁడగు నంబికాచరణునితో నొక్కింత ముఖ్యమగు విషయమును గూర్చిముచ్చటించుటకై వచ్చితిమని" నుడివెను.

ద్విజేంద్ర : ఐన తామిప్పుడు ప్రవేశింప వీలుకలుగదని వచించుటకెంతయు చింతిల్లుచున్నవాఁడ. ఇందుకు "నూతనాగతుల నెవ్వరిని లోన ప్రవేశపెట్టగూడదని ఆరక్షక (పోలీస్) సర్వాధికారిశాసనమే కారణము. నేనుసైత మీకఠిన శాసనమును నతిక్రమించి మిమ్ము సఫలకార్యులఁ జేయ కడునసమర్థుఁడను,

ఇంతలో లోననుండి మేలిహాయముల పూన్చినరథమొక్కటి ద్వారప్రాంతమున కరుదెంచెను, ఆయరదమునను ప్రవేశించి యొక్క సుందరమనుజుఁడు మాకునేత్రగోచరుఁడయ్యెను. విన్నందనము మోము తాండవ మాడుచున్న యీపురుషపుంగవుని కనుఁగొన్న వెంటనే ద్విజేంద్రుఁడు "అంబికాచరణులుగారూ! తామిప్పుడు బొంబయి నగరమున కరుగుచున్నారా? తమచెంత నీద్వారము తాళముచేయి యున్నదా? లేక నేనియ్యవలయునా?" యని ప్రశ్నించెను.

ద్విజేంద్రుని సంబోధనను బట్టి యా చనుదెంచిన ఘనుఁడంబికాచరణుఁడని తెలిసికొని, నేను "అంబికాచరణా! మహాశయా! తమకు

సంభవించిన మనోవేదన కెంతయు నేను చింతిలుచున్నాడను" అని నుడివితిని ; ఆతఁడు నాకంఠధ్వని నాలించికాఁబోలు, తనవ్యవహార మార్గమున ననేకసలహాల నొసఁగిన వశీకరుఁడనినను గుర్తించి వైళము, యరదముదిగెను. ఇంతలో ద్విజేంద్రుఁడు ముఖద్వారము తెఱచికొని, లోనఁజొచ్చి యుండుటచే నంబికాచరణుని శకటము ద్వారము గుండ బయటికివచ్చెను. అంబికాచరణుఁడు మావద్దకువచ్చెను.

అంబి : వశీకరదత్ ! అభివాదనములు. మహాశయా ! నినుఁ బోలు న్యాయవాది ప్రాతఃకాల కార్యభాగములనైన సరకుఁగొనక నింతదూరము చనుదెంచుటకు కారణమగుట యత్యాచరణము కాదుగదా ?

వశీ : ఆర్యా ! ఇతఁడు నాప్రియమిత్రుఁడు " బాబు బలసూదన కుమారుఁడు. ఇమ్మహాశయుఁడు తమతో నొక్కింత సంభాషింపనభిలషించుచున్నందున తమకొకింత శ్రమ యొసంగవలసివచ్చెను.

ఆతనినుండి ప్రత్యుత్తరము రాకముందే బలసూదనుఁడు " అంబికాచరణమిత్రా ! మేము హత్యాగృహమును వీక్షించుకుతూహలమున ప్రేరితులమై యిందురాసాహసించితిమి. మాయభిలషితము తమచే నీడేరవలసియున్నది " అనియెను.

అంబి : పూజ్యచారిత్రా ! ప్రస్తుతము శిరీమకుమారి సందేహ జీవితయైయున్నది. హత్యాగృహవాటిక రక్షకభట సముదయముచే రక్షింపఁబడుచున్నది. నేనును నత్యావశ్యక కార్యమునకై బొంబయి నగరమున కరుగుచున్నాఁడను. కావున, తమయభిలషితమును నేనిప్పుడు నిర్వహించుట దుర్లభము. నేనివుడ ప్రయాణోన్ముఖుఁడనై చనవలయును గాని నిలువ వీలులేదు. నే చనకున్న కార్యహాని కలుగును.

ఈమాటల నాలించినతోడనే నామిత్రునకు " అంబికాచరణుని సాయముననైన, జయంతమందిరమును దర్శించి, యందలిశయనమంది

రమును పరీక్షించి; హాత్యాపరాధవిషయముల నెఱుంగవచ్చునను నిది వఱకున్న యాశ సైతము విఫలమయ్యెను. తనకాయభిరామాగ ప్రదేశము నంతను పరిశోధింపవలయుననెడి యభిలాషమాత్రము తను వేగిరింప నేమిచేయుటకును తోఁచక అపుడే కొంతదవ్వుగ నరిగినయంబికాచరణుని చెంతకు నేమియో యొకయూహ మెఱుపు మెఱసినభంగి తనమానస మున సంస్ఫురింప, నొక యెగురునఁబోయి. "ప్రార్థనా మందిరమింకను తన సహజరామణీయకమును వీడలేదు. దాని యుద్యానవనము తన సౌందర్యమును బాయలేదు." అను వాక్యమంత్రముల నుచ్చరించెను. అదేమి యైంద్రజాలిక మాయనో గాని యామనుడులయం దెంతశక్తి కలదోకాని ఇంతవఱకు హాత్యాగృహదర్శనమున కిసుమంతయు నంగీక రింపని యంబికాచరణుఁడు తత్క్షణము వెనుదిరిగి, "ఆర్యభూషణులారా! వినరండు. మీ కాశాభంగ మొనర్పఁజాల, మీరభిలషించిన హాత్యా మందిరమును, నీక్షింతురట, నా వెంటరండు." అనినుడువుచు తన బొంబయి ప్రయాణమునకు దత్తాంజలి యొసఁగి, ఆరక్షకభటుల యభ్యంతర పరిపాటిని గంగఁద్రోసి, మమ్ము వెంటనిడుకొని లోని కరిగెను.

జయంతిమందిరము గగనోన్నతతరు ప్రకాండములచే వానినల్లు కొని పెనఁగులాడులతావితానముచే నావరింపఁబడియుండుటచేత నందొక భవన మున్నదని సైత మితరులకు తెలియ నసాధ్యమై చూపట్టుచుం డెను. ఈమహావృక్షవనమునకు కొలఁది గజముల దూరమున వర్షజలము ప్రవహించి పోవుటకై పెద్దయగడ్త యొక్కటి యుండెను. దీనికాను కొనియే ప్రాకారపుగోడయున్నది.

మేము వనప్రదేశముదాటి యొకమందిరమును ప్రవేశించితిమి అప్పుఁడంబికాచరణుఁడు నన్నొకచో నుపవేశింపఁజేసి బలసూదనుని కరగ్రహణ మొనర్చి యాతనినిపిలుచుకొని యొకవిజనమైన గది కరిగెను. కొలఁది సేపటికాయిరువురును నేనుండుతావునకు వచ్చిరి.

ఆ దేమి బలసూదనుఁ డంబికాచరణున కుపదేశించెనో కాని, దైన్యదేవతారంగస్థానమైన యాతని యాననపంకజమున, దైన్యహిమము తొలఁగి యపూర్వవికాసమును నూతన సంతృప్తియు తాండవ మాడుచుండెను.

అంత బలసూదను నుద్దేశించి యంబికాచరణుఁడు. "ఆర్యవతంసమా! నావలన నింకెద్దియైన సాయము మీకు వలయు నేని సిద్ధముగ నున్నాఁడ" నని వాక్రుచ్చెను.

బల : అయ్యో! మనమింక ప్రాణమిత్రులము కదా? అట్టిమిము బోలిన ప్రాణమిత్రుని సంపూర్ణ ప్రేమాకరమగు కరగ్రహణము కంటె మిత్రకోటియభికాంక్ష వేఱెద్దియైయుండునే?

అంబికాచరణుఁడు వెంటనే తన ప్రేళ్లకు దొడిగికొనిన హస్తసంచిక యూడిముడ్వఁబడియున్న తన హస్తతలమును బలసూదనున కందియ్యఁబోయెను. బలసూదనుఁడు; "హస్తసంచిక వదల్చి నాకు కరగ్రహణము నొసఁగుఁ" డని సాదరపూర్వకముగ పల్కెను. అందు కంబికాచరణుఁ "డొక లవకాల మాలోచనాపరాధీనుఁడై తత్తరపాటు తళుక్కొత్త విగతసంచికమైన తనహస్తమును బలసూదనున కందిచ్చెను. తత్కరగ్రహణమున నెంతమైత్రిసుఖము ననుభవించెనో కాని, బలసూదనుఁడు తనసంతృప్తిని శిరఃకంపనమూలమునఁ దెలుపుచు "అనఘవర్తనా! ఇఁక మనము శ్రీమతి శిరీషకుమారి శయనమందిరమున కరుగుదమా?" యని సకౌతుకస్వరమున భాషించెను. అంబికాచరణుఁడందున కియ్యకొనఁగనే మేము మువ్వురము శయనమందిర మార్గము ననుసరించితిమి.

# నాల్గవ ప్రకరణము

నా సఖుఁ డంబికాచరణుని కరగ్రహణమును తానేల యభిలషించి వేచుటకు కారణమేమని నాకధిక సంశయవిస్మయములు మొలకలెత్తసాగెను. అయిన బలసూదనుని యీప్సితమున కిదికారణమై యుండునా యని నాకొక యూహపొడమెను. మేజస్ట్రీటు శయనమందిరమును వివరించి చెప్పుటలో నందొకరక్తసిక్తమగు హస్తము గుఱుతుండెనని యెనుగదా! ఆహస్తచిహ్న మెవ్వరిదోయని పరీక్షించుచు బలసూదనుఁ డంబికాచరణుని కరగ్రహవ్యాజమున నతని హస్తమునందు తనకుఁ గలిగిన యనుమానము నివర్తించుకొనుటకై యీయుక్తిని పన్ని యుండనోపునని తుదకు నిర్ధరించితిని. అంబికాచరణుని హస్తము ననుమానించుట కేదికారణమన గోడపై విశాలముగ హత్యామందిరమున కాన్పించు గుఱుతును చూడ నదియంబికాచరణుని హస్తమును బోలి యుండుటయే యై యుండవచ్చు ననుకొంటిని. పైనున్నహస్తకవచమును దీయించి చూచుటకును నదియే కారణమని నేనూహించితిని. అయిన నంబికాచరణుని యెడ నిట్టియనుమాన భూతమునకు తావు దొరకదు.

అంబికాచరణుఁడు రసాయనశాస్త్రపాండితి నార్జించి రసాయన విమర్శన శాఖవారిలో నధ్యక్షుఁడై సుప్రసిద్ధ రసాయనాచార్యుఁ డగు పంచాననునకు సైతము మెప్పుకలిగించి తనవ్వరుడు లేని పాండితిచే సుగుణ సంపదచే నాతని సంపూర్ణాదర గౌరవములకు పాత్రుఁడై యున్న ఘనుఁడు. అందువలననే, పంచాననుని యనురాగవల్లరికి నాశ్రయుఁ డగుటయేగాక, యతని యేకపుత్రిక యగు శిరీషకుమారికి సైతము హృదయానురాగ నిధానుఁడయ్యెను. రానురాను, నాయనురాగవల్లరి

పల్లవితమై, పుష్పితమై ఫలోన్ముఖమయ్యెను. పంచాననుఁడు దానికి సంతసించి తన యనుంగునందనిని నతనికిచ్చి యుద్వాహ మొనర్ప కొలఁది కాలముననే సుముహూర్త మొక్కటి నిర్ధరించెను. అంబికా చరణునకును పంచానన కుటుంబమునకును, మనః ప్రీతియు సంసార ప్రేమయు, నేకమై యవినాభావమై చెలంగసాగెను. ఇట్టి యంబికా చరణుఁడు సంశయ చారిత్రుఁడెట్లగును? ఎంతైనగాఢానురాగ ప్రేమ గల మనుజుఁడెవ్వండుగాని తావలచి వరించిన కాంతను సంహరింప పాల్పడునే? అట్లువధింప నుద్యోగించుటకు నుద్దేశమేమి? అయిన నామిత్రుని సంపూర్ణ సంశయాపరాధారోపణమునకు, నంబికాచరణుఁ డేల పాత్రుఁడయ్యెను? జనసామాన్య మంతయు నిష్కారణంబికాచరణు నకు కలిగిన మనోవేదనకు వగచుచున్నవారు; అయిననొకటి మాత్రము సంశయమునకు దారిచూపుచున్నది. ఇంతటి మహోదారుని తనవలపు నకు నిధానమగువానిని తన్నె యాఱవ ప్రాణమని భావించు వానిని అంబికాచరణుని నింతవఱకు నుద్వాహమాడ నంగీకరింపలేదఁట. మొన్నటివఱకు తనయనురాగ సర్వస్వమగు నతనిని ప్రేమించుచు, వలపు దెలుపుచు నున్నదేకాని వివాహమున కంగీకరింపదయ్యెను. మొన్నటి దినమున నామె మనోనిర్ధారంనొక యెట్టి సుస్థిరప్రదేశమున నిలిచెనో కాని యంబికాచరణుని పరిణయ మాడ సమ్మతించెనఁట. ఇదివఱకు తాను నుద్వాహమాడకుండుటకు కారణ మామె వచించిన దేదన - తనవివాహము తన జనకుని రసాయనపరిశ్రమకు నంతరాయ మును కలిగించుననియు తనభర్తతోఁగూడి సంసార మొనర్చుచున్న యెడల కమవార్ధకదశయందుండిన తనతండ్రికి సేవఁజేయుట కనువు కలుగదనియు తానభిప్రాయ పడినదఁట. ఇందలిపరమార్థ మేమో?

ఇట్లు నావితర్కము సాంతముకాకమున్నె మేమందఱ మాయుప రాధమందిరముఁజేరితిమి. వృద్ధసేవకుఁడగు వసంతుఁడు డప్పుడే యా గృహ కవాటములు బంధించుచుండుటఁగాంచి అంబికాచరణుఁడు:

“వసంతా! కొంచెమాఁగుము. నా మిత్రులా గదిని విమర్శింప వచ్చియున్నార”నెను. వసంతుఁడును “చిత్త” మని నుడువుచు వారిని లోపల ప్రవేశ పెట్టెను.

## హత్యామందిర చిత్రము




ఇనుపమందసము.
పొగగొట్టము.
వసంతునియుటకపైకి }
బోవుసోపానములు }

1 నడవయందలిమహాద్వారము
2 నడవయనుగది.
3 రసాయనపరిశ్రమాలయము ద్వారము
4 రసాయనపరిశ్రమాలయము
5 శిరీషశయనాగారద్వారము.
6 శిరీషశయనాగాదము.
7 శయనాగారగవాక్షము.
8 అనుపయోగపుగది.
9 అనుపయోగపుగదిద్వారము.
10 నడవయందలిగవాక్షము.
శిరీషపర్యంకము.

మునుముం దా గృహపరిచయము మాపాఠకుల కొనరింపవలసి యున్నది. హత్యామందిరము వివరములఁ దెలుపు పటమొకటి పైని చిత్రింపఁబడి యున్నది.




1. హత్యామందిర ద్వారము
2. నడవ
3. నడవనుండి రసాయనపరిశ్రమాగారమునకు పోవు ...ద్వారము
4. రసాయన పరిశ్రమాగారము.
5. అందుండి శిరీష శయనాగారమునకుబోవుద్వారం
6 శయ్యాగారము
7. శయ్యాగారగవాక్షము.
8. సామానుగది.
9. వసంతుని శయనస్థానమునకు పోవుసోపానములు
10. నడవలోనికి ద్వారము
11. నడవయందలి గవాక్షం

జయంతమందిరము మహాసౌధమున కించుకదూరమున నున్నది అదియే యుద్యానమందిర మని పిలువఁబడు చున్నది. గొప్పసౌధరాజ మొండు ప్రత్యేకముగ నున్నది. ఈజయంతమందిరమే ప్రకృతాపరాధము ప్రవర్తిల్లిన స్థలము. దీనివివరమునే కొలఁదిగ నింక వివరించెదము.

జయంతమందిరమునకు నొక్కటియే మహాద్వారము కలదు. ఆ ద్వారమున ప్రవేశింప జనులు నడచు నడవయనఁదగిన యొక గది యున్నది. ఆనడవగదిలో దక్షిణపువైపుగోడయం దొకగవాక్షమున్నది. దాని కిటికీకట్టలు బొత్తిగ లేవు. ఆనడవయందే రెండు ద్వారములు కలవు. అందొకటి దానినానుకొని యుండు నొకగదికి పోవు ద్వారము. ఈచిన్న గది జనులు ప్రవేశించునదిగాక ఇంటనున్న పనికిమాలిన కట్టెలు మొదలగునవి పడవేయునది. ఇందే శిరీషకుమారి శయనంపు గదిపై నుండు అటకకు పోవునట్టి దారునిర్మితసోపానము లుండునది. ఈఅటకపైనే సేవకుఁడగు వసంతుఁడు కాపుదలకొఱకై శయనించును. ఈయుద్యానమందిరమైన జయంతభవనమున పంచానన శిరీషకుమారిక లున్నంతకాలము వసంతుఁడు పై యటకయందే నియమితముగ శయనించుచుండును. ఇంక నడవగదియందున్న రెండవద్వారము రసాయన

పరిశ్రమకొఱ కేర్పరుపఁబడిన పెద్దగదికి పోవుద్వారమై యున్నది. ఈపెద్దగది యందే పంచాననుఁడును శిరీషయు ననవరతము రసాయన పరిశ్రమ చేయుచుందురు. ఈపెద్దగదియందు రసాయన పరిశ్రమచేయుట కనువగు బల్లలు మేజాలు కుర్చీలు ద్రావకములుంచు గాజుసీసాలు కలవు. ఈ రసాయనశాలయం దొక పొగగొట్టమున్నది. ఆ శాల యందు అఱుగవాక్షము లున్నవి. అవి యినుపకడ్డీలచే సుభద్రములై యితరులా గవాక్షముల మార్గమున ప్రవేశింప దుస్సాధ్యతమములై యున్నవి. ఈ రసాయనశాలనుండియే శిరీషకుమారి శయనాలయమునకుఁ బోవుద్వార మొండు కలదు. ఈ ద్వార మొక్కటే శిరీష శయనమందిరమున కుండునది. శయనమందిరమునకు పోవలయునన్న నీ పరిశ్రమశాలకు పోయి యందున్న ద్వారముగుండ పోవలయునే కాని వేఱు మార్గము లేదు.

ఇంతటితో నుద్యానగృహమగు జయంతమందిర వర్ణనమును విరమించి శిరీష శయననికేతనమున దృష్టి మరల్తము. ఓ శయననికేతనమా! నిన్నిపుడు వర్ణించి నీ స్వరూపమును లోకమునకు దెలుపుట మాని నిన్ను పరిశోధనఁజేయు సమయమున వర్ణించెదము కాన నంతవఱకూర కుండుము.

మేము మువ్వురము పైనవర్ణించినరీతి జయంతమందిర మహాద్వారము దాటి నడవగది ప్రవేశించితిమి. నామిత్రుఁడు బలసూదన కుమారుఁడు మాత్రము సునిశ్చల తీక్ష్ణనయనపాతముల నానడవగది యం దంతటను ప్రసరింపఁజేయుచు నిపుణముగ పరిశోధించుచున ట్లగపడుచు నినుపకడ్డీలు లేని యానడవగదియొక్క గవాక్షమును సమీపించి దానిని చక్కగ విమర్శించుట కుపక్రమించెను. అప్పుడు వసంతుఁడు బలసూదను నుద్దేశించి "మహాశయా! ఈ గవాక్షమార్గముననే హంతకుఁడు నిరాయాసముగ నిరంతరాయముగ లోనఁ బ్రవేశించె" నని మేజస్ట్రీటు మొదలగువారు దృఢాభిప్రాయులై యున్నారు, ఇది నిశ్చయమే

యని తలంచెద లేకున్న హంతకుఁడు లోన బ్రవేశించు దారి యేది! ఇఁక మహాద్వారమే కదా! అది యా దినమున మూయఁబడి దృఢముగ లోన బంధింపఁబడి యుండెను. కావున, హంతకుఁ డదృశ్యుఁడై పోవుటకును లోనఁ బ్రవేశించుటకును నీ గవాక్ష మొక్కటియే మార్గము. ఐన లోనఁ జొచ్చిన హంతకుఁడు ఈ గవాక్షముగుండ నెట్లదృశ్యుఁడై పోవనగును! మా యజమానుఁడును నేనును హత్యాప్రయత్న సమయమైన నా హంతకుఁడును శిరీషయు తచ్ఛయనమందిరమున పెనగులాడుచుండిన ధ్వనిని వినియే యున్నారముగదా! అట్టిహంతకుఁడు మేము లోపల ప్రవేశించుటకు ముందుగాని ప్రవేశించిన పిమ్మటగాని మా సమక్షమున గాక యెట్లు మాయమయ్యెను? ద్వారముగుండా వెడలిపోవుట దుస్సాధ్యము గదా! ఈ రహస్యము నెట్లును భేదించువా రెవ్వరును లేరు!

బల : ఈ గవాక్షద్వారము హత్యోద్యమమున నాటి సాయంత్రము మూయఁబడి యుండెనా?

వస : నేను వాడుకప్రకారము ఈ గదిని శుభ్రపఱచి యా గవాక్షమును మూసి లోన గడియ వేసి బంధించితిని.

బల : ఏమీ! 25 వ తేదీ సాయంతనమున నీ గదిని శుభ్రపఱచితివా?—సరియే ఐన గవాక్షద్వారము మీలో నెవరిచేనైన తెఱవఁబడియెనా?

వస : మాలో తెఱచువా రెవరు? మా యజమానుఁడును శిరీషకుమారియు నాఁటిదినము సాయంతన మైదుగంటలవఱకు రసాయన పరిశ్రమ యొనర్చి తర్వాత విహారార్థమై వెడలిపోయి యుండిరి. ఇఁక నేనన్ననో నాగృహకార్య నిర్వహణమునకై యపుడే పోయితిని. కాని, మేమెవ్వరము నీ గవాక్షమును తెఱువ లేదు.

బలసూదనుఁ డింతటితో వసంతునితో సంభాషణమును చాలించి గవాక్షమును పరీక్షింప నం దేవియు పదచిహ్నములు కాన్పింప

పయ్యెను. దాని సమీప ప్రదేశమందన్ననో పూర్వమే వసంతుఁడు దాని చెత్త యూడ్చి పరిశుభ్రపఱచి యున్నందున నందేమియు హంతకుని పదచిహ్నములు గోచరించుట కవకాశమే లేదుగదా? పిదప మేము మువ్వురము తొలుత నిరూపించిన యాపనికిమాలిన వస్తువు లుంచుగదికి వెడలితిమి. నామిత్రుఁ డట్టి నిరుపయోగకరమైన గదినిసైతము వదలక తన నిపుణ పరిశోధన చేయుచుండ నందొకచోట సచ్ఛిద్రకమగు నాకారముగల గుఱుతొకటి యుండెను. ఆగుఱుతును చూడ నందేదియో యొక వస్తువు సచ్ఛిద్రకముగ నుండునది యుంచఁ బడియుండినట్లు తెలియుచుండెను. మేమంతట నాగదిని వీడి రసాయన పరిశ్రమాలయమును ప్రవేశించితిమి. నామిత్రుఁడు బలసూదనబాబు తన పరిశోధన నొనర్చుచు మేము పూర్వము నిర్దేశించిన పొగగొట్టమును చేరెను. దానియొక్క యడుగుభాగము మాత్రము ఇటుకలతో కట్టబడియుండెను. బలసూదనబాబా పొగగొట్టమును జొచ్చి దాని నుండి పైకిఁబోవ యత్నించెను! గాని దానిమధ్యభాగము ఇనుపశలాకలచేఁ గూర్పఁబడి యున్నందున విఫలమనోరథుఁడై మరల వెలుపలకు వచ్చుచు కరమున నొక కాగితపుతునుకను కొనివచ్చెను. ఏటికో దాని నాకందిచ్చెను.

నేను దాని జదువుకొనగ అందు బలసూదనుఁడు అంబికాచరణుని వాక్యములచే వశఁగతునిగఁ జేసికొని యీమందిరమును ప్రవేశించి విమర్శింప నతనియనుమతిని వేల్మిడి బలాత్కారమున నందెనో యట్టి "ప్రార్థనామందిర మింకను తన సహజరామణీయకమును వీడ లేదు. దానియుద్యానవనము తన సౌందర్యమును బాయలేదు" అను నీ వాక్యములే యుండెను. పిదప నొక్కచోనున్న యినుపమందసమును దానియందే యుండిన తాళపుచేతిని గాంచి యిట్టిముఖ్యమగు మంద సమునకు తాళపుచేతి నందేయుంచినందు కేమియో యోజించుచు

బలసూదనబాబు ఆ విశాలశాల నంతను పరిశోధనైక దృష్టిచే నొక్క రేణువునైనను మానక విమర్శించుచుండెను. యింటి కాచరణుని సంబోధించి "శరీష శయనపుగదికి పోవుదము రమ్మ"ని పిలిచెను. తోడనే మేము మువ్వురము నాశయనగృహముఁ జేరితిమి. అందలి వస్తువులలో కొన్ని హత్యాప్రయత్నాపరాధము ప్రవర్తిల్లిన తర్వాత నెట్లు వ్యత్యస్తముగ పడియుండెనో, యట్లే యుండెను. కాని యథాస్థానములందు సవరించి పెట్టఁబడియుండలేదు. వ్యత్యస్తములు కాక యున్న వస్తువు లుండినట్లే యుండెను.

బలసూదనుఁడు శయనమందిరాంతరము చేరిన వెంటనే వసంతు నుద్దేశించి, "వసంతా! హత్యాప్రయత్నము నాఁటిరాత్రి దీపమెచ్చట నుంచితివి" అనియెను.

వసం : ఆర్యా! దక్షిణపుదిక్కున నున్న బల్లపై నుంచితిని.

బల : ఐన నిపుడు ఈ గదిద్వారమును మూసి గవాక్షములను మూసి నీవు చెప్పినట్లు దీప ముంచెడిబల్లచెంత నీవు నిలిచి ఆ రాత్రి దీపము వెలిఁగించినట్లు మఱల వెలిఁగింపుము చూతము!

బలసూదనుఁ డాజ్ఞాపించినరీతి వసంతుఁడు ద్వారమును గవాక్షమును మూసి, దీపపుబల్లయొద్ద నిలిచి, దీపమును వెలిఁగించి చేత నిడుకొనియుండెను. అమైనపువత్తిదీపపు ప్రకాశమున గదియందలి వస్తువులు చాలినంత స్ఫుటములుగ కనపడుట లేదు. కొన్నినిమిషములైన పిమ్మట బలసూదనుఁడు వసంతునితో "వసంతా! దీపమును శాంతముగఁ జేసి గవాక్షద్వారమును తెఱువుము" అని వక్కాణించెను.

వసంతుఁ డావిధముగ నొనర్ప నా మిత్రుఁడు తొలుదొల్త పర్యంకముక్రింద నుంగాళ్ళచే నిశ్శబ్దముగఁ బ్రాకుచుఁ బోయెను. దానిఁ గాంచి వసంతుఁడు "మహాశయా! హంతకుఁడు నిదేవిధముగ

హాత్య ప్రయత్నానంతరమున మేమెల్లరమును ద్వారము భేదించుకొని యందు ప్రవేశించుటఁ గాంచి, యీమంచముక్రిందనే దాగియుండవల యునని "మేజస్ట్రేటుగాఁ రగువాగీశచంద్రులుగారి. యభిప్రాయము" హాత్యాసమయమున హంతకుఁడట్లు పర్యంకముక్రింద దాగియుండు టే నిక్కమైన మే మామంచముక్రిందను మఱియితర ప్రదేశములను పరీ క్షించి వెదకినపుడెందేగెను ? ఇఁక హాత్యాప్రయత్నము జరుగుటకు ముందే యిందుదాగెనన్న నదియు నసంభవమే. ఏలననాఁటి సాయం కాలమున నాయజమానుఁడును ఆయనకుమారియు వాహ్యాళికై వెడలుచున్నపుడు శిరీషకుమారి తన శయనమందిరమున మఱచి వదలి వచ్చిన తన కరవస్త్రమును తీసికొని వచ్చులాగున నాకాజ్ఞాపింప నే నచ్చటికి వెళ్ళియుండలేదా ? అంతవఱకు నపరాధి యందు ప్రవేశింప కున్న నింకెప్పుడు ప్రవేశించెను ? రసాయన పరిశ్రమ యొనర్చునపు డంతయు నున్న యొక మహాద్వారమును అన్ని గవాక్షములను మూఁయబడు చుండలేదా ?" అనియెను.

ఇప్పటి వసంతుని మాటలవలన నా కొక యూహాంకురము జనించెను. కాన, వసంతుని నిట్లని ప్రశ్నించితిని.

వశి : వసంతా ! శిరీష శరీరమును ఆమె పడియున్నరత్నకంబళ మును గూడ చికిత్సామందిరమునకు గొనిపోఁబడియెఁగదా ? హంతకుఁ డారత్నకంబళమునందే పరుండి దాఁగియుండి యనంతర మేల వెలిచని యుండరాదు ?

వసంతుఁడు ప్రత్యుత్తర మియ్యకముందే బలసూదనకుమారుఁ డందులకు పిన్న నవ్వొలయు మోమున నన్ను పరికించెను.

వసంత : ఆర్యా ! మీ రన్నటుల హంతకుఁడు రత్నకంబళమున దాగియుండినపక్షమున శిరీషను మూపునవహించినమేము ఈ హంతకుని

దేహ భారమును సైతము వహించి గుర్రెటుంగకి యుండుమా ? ఆ యోచనకు సరియైన యాధారము లేదు.

ఇంతలో బలసూదనుఁ డాపర్యంకము క్రిందినుండి నన్నుద్దేశించి, " వశీకర్ నీ చెంతనున్న ద్రాయుని కాగితపు ముక్కయొకటి నా కిమ్ము " అన నేనొక కాగితము నిచ్చితిని. కొంతసేపటి కాతఁడు బయటికి వచ్చెను. అతని నయనముల యం దెన్నియో యంశములు ప్రతిఫలించుచుండెను. వెంటనే యా కాగితమును నా చేతి కిచ్చెను. నేను దానిని పరికింప దాని యందు మనుజుని పాదచిహ్నా ముండెను. అనంతరము కుమారబాబు నొకచోట తలక్రిందుగ పడియుండిన చలువరాతిబల్లను సమీపింప దాని కొకమూల రక్తంపుమరక యొకటి యుండెను. తత్సా . . ఫ నానంతరమున నాసఖుఁడు నా కొక కాగితపు పొట్లము నొసగి దానిని " భద్రముగ నీకడ నుంచుమని " నుడివెను. నేను దాని నందికొని విప్పిచూడ నందొక వెంట్రుక మాత్రముండెను. నే నావిషయమై నామిత్రుని నేమియు ప్రశ్నింపక దానిని అతిసావధానతి జేబికు పదిలముగ కవచమున దాచితిని. దాని ప్రాముఖ్యమేమో ?

అవల నందుపడియున్న గొట్టెకొ మ్మొకదానిని చేతనంది సవిమ ర్శదృష్టి నీక్షించెను. దాని చివరభాగమున పెక్కు రక్తంపుగురు తులు అవిపాణ మింతవఱ కెన్నియో యిట్టిహత్యలఁ జేసియుండె నని సూచించు చుండెను. ఇది యుఁగాక హంతకుని హననవ్యాపార పారీణత కిదియే ముఖ్యాధార మనుటయు సూచిల మగుచుండెను. చెనువనున్న పిస్తోలును పరీక్షించెను. అది వృద్ధసేవకవసంతునిదే యనుట స్పష్టమని వాని నామాక్షరములే తెలుపుచుండెను. అంత తత్సమీపమున నే కుమారబాబు నయనప్రసారభాగ్యమందు వేచియున్న నాలుగంచుల యుందును పచ్చని చారలు గల అందుపడియున్న కరవస్త్ర మొక్క దానిఁ గాంచి యింతవఱకు యోచనా నిశ్చలమానసుఁడై పూన

ముద్రవహించియున్న నామిత్రుండు " ఇదిహంతకుని కరపత్రము " అని యుచ్చైస్స్వరమున లోనుండివచ్చెడు సంతోసము నాపుకొనలేక పలికెను.

అంత వసంతుండేదియో జ్ఞప్తికి తెచ్చుకొన్న వానివలె " ఇచ్చట నొక ఉష్ణీషముకూడ నుండెడిది. దానిని వాగీశచంద్రులు తీసికొని పోయి యున్నారు. అది యిప్పు డిచ్చట నుండియుండిన దాని యాకార రూపములు మీకుం దెలియవచ్చును " అనియెను. అంత బలసూద నుండు " ఆ యుష్ణీషమును గాంచకయే దానిస్వరూపమును వర్ణింప వచ్చును. అది నీ యుష్ణీషమునుం బోలియుండును. " అనియెను.

ఇట్లు పలికినంతనె వసంతుం డొకక్షణకాలము ఆచ్చెవడి, పర మాశ్చర్యమగ్నుం డయ్యెను. బలసూదనబాబును గోడపైం గలరక్త సేచితహస్త చిహ్నమును పరిశోధించెను. పరిశోధనసమయమున నేను నామిత్రునితో " హంతకుండు హత్యాప్రయత్నానంతరమున పోవనుద్యు క్తుండై, ద్వారము సమీపించి యుండ నింతలో పంచాననుండును వసం తుండును ద్వారమును భేదించుటం గాంచి, నిశ్చేష్టితుండై మైమఱచి యున్నందున తన రక్తసిక్తమగు హస్తమును గోడపై నూదికొనిన విమర్శకులు గుఱుతింపంగలరసిద్ధమైన తలంపక భయమున రక్తసేచిత మైన హస్తమును గోడపై నూదికొనియెను. " అని వక్కాణించితిని. అందుపకు బలసూదనుండు ఇట్లుపలికెను.

బల : ఇప్పుడీ హస్తము నంటినశోణితము శిరీషను హత్యచేయ వేధించుటచే యామెశరీరమునుండి స్రవించినదికాదు. మఱేమనిన ; ఆశిరీషయే, యాత్మసంరక్షణార్థమై హంతకునిపై పిస్తోలును పేల్చినందున నది గుఱితప్పి వానిహస్తమునకు గుండుదెబ్బ తగిలెను. దానివలన క్రింద పడంబోవునప్పుడు అట్లుపడకుండ తనహస్తమున గోడను నూదికొనియెను. కావున గుండుదెబ్బవలన స్రవించినరక్తముచే కూడినహంతకుని

హస్తముయొక్క రక్తాంచితచిహ్నమిది యని తలంపుము. ఇది రక్త సిక్తమగుహంతకహస్తచిహ్నమనుటలో మనమిరువురము నేకాభి ప్రాయులమే, కాని, యీరక్తము శిరీషకుమారిని గాయపరచినందున నాగాయమునుండి స్రవించినది కాదు. హంతకునకు తగిలిన గాయము నుండి స్రవించినదనుటయే నీయభిప్రాయమునకు భిన్నమైన నాయభి ప్రాయము. ఇదియుఁగాక గోడయందు దుముపఁబడిన హంతకుని హస్తము నందలి రక్తద్రవము కొంచెము వ్యాపించి పెద్దదియైనందున నాహస్తము పెద్దదనియును, ఒక్కదృఢకాయుని దనియును, నభిప్రాయము కలుగు చున్నది. కాని, అదియంత దృఢకాయుని హస్తతలము కాదు. అంతియ గాక తనచేతిగాయమును తుడుచుకొని యుండుటచే నీకరవస్త్రము నందు రక్తంపుమరకలున్నవి— అప్పుడు వసంతుఁడు.

వసంత : ఆర్యా! మేజస్ట్రీటుగారును ఆరక్షకశాఖవారును ఈకరవస్త్రమునందలి రక్తంపుగుఱుతులఁ గాంచి మీయభిప్రాయ మునకు వ్యతిరేకాభిప్రాయ మిచ్చియున్నారు. కరవస్త్రమధ్యమున రక్తంపు చుక్కలున్నందున నాయభిప్రాయమేమనఁగ పిస్తోలు రెండు పర్యాయములు పేల్చినతఱి హంతకునినాసికకు దెబ్బ తగిలినది. దానిని తన కరవస్త్ర మధ్యభాగముతో తుడుచుకొనినందున నాచేతిరుమాలు నం దక్కడక్కడ రక్తపుచుక్కల గుఱుతు లున్నవని విశదీకరించిరి. వారి యీయభిప్రాయమునకు కారణ మీచేతివస్త్రమధ్యమున రక్తపు మఱక లుండుటయే.

దానికేమియు ప్రత్యుత్తర మొసఁగక నామిత్రుఁడు అగదియందు మఱేమియు వ్యత్యస్తముగ పడియుండక మొదట నుంచినట్లే యథారీతి నుండిన యొక బల్లచెంత కేగెను. అందొక మనుష్యుని తల విగతచర్మా వరణమై దుర్గంధమేమియు లేక సుగంధవాసితమై యుండెను. అది కేవల మస్థిమయమై యున్నది. అట్టి అస్థిశిరస్సును సమీపింపఁగనే

యపూర్వసుగంధము రాఁగల్గెను. ఆసుగంధము మఱిదేనినుండియైన రాక ఆ ఖర్జూరతోట నుంచబడినయొక మోదుగపుష్పమునుండి వచ్చుచుండెను. నేను నతని వెంటఁ బోయియుండుటవలన నా కాదృశ్యమును తిలకించి నప్పటినుండియు పరమాశ్చర్య సంశయములు జనింప మొదలిడెను. సుగంధవిరహిత కుసుమములలో నగ్రగణ్యమైన యీకింశుక కుసుమమునుండి యిట్టి యపూర్వదివ్యపరిమళము వచ్చుట పరమాశ్చర్యముగ నుండెను. మఱియు చిరకాలమునుండి యుండిన యీమనుష్య శిరము దుర్గంధమున కిర వగు నని యెంచి యాదుర్గంధమును బాపుటకై దివ్య సుగంధకస్తూరికాదుల నేమైనపూసియున్నారా యనియు నాకొక యూహ జనించెను. నాయూహ సత్యమని నిరూపించుటకై నామిత్రుఁడా మోదుగపుష్పమును కరమున గొని నాచెంత కరుదెంచి నానాసిక సమీపమున నిడియెను. అపుడు నేనావాసనను చూచి యది యాపుష్పము నందలి సువాసన కాదనియు నాపుష్పమధ్యమున నెవరో చల్లినయొక సుగంధద్రవ్యపరిమళమనియు తెలియఁగల్గితిని. మిగిలిన రెండుబుట్టలను పరీక్షింప నుద్యుక్తుఁడనైతిని. కాని, బలసూదనుఁడు నన్ను వారించి "ఒక్కటిచూచిన చాలును. మిగిలినవానిని చూడ నక్కఱయుండదు" అని చెప్పినను "ముంజేతికంకణమునకద్దమెందుకన్నట్లు" నే నాగోడపైని ఫర్యంకముపైని నున్న మఱిరెండు శిరములను విమర్శించితిని. అందేమి విశేషమున్నది? మొదటిదానివలె నుండెను. ఇట్లగుటకు కడు సిగ్గుజెందితిని. దాని నావల పారద్రోలి సంశయము నామానస మాక్రమించెను. ఇట్టి సుగంధము చల్లిన కింశుక పుష్పములతోఁ గూడిన యీమనుజ కపాలముల నిందుంచుటయందు హంతకునియుద్దేశ మేమి యని మనమున నూహాపోహలు తాండవ మాడఁజొచ్చెను. అంతటఁ నాకీ హత్యాప్రయత్న రహస్యాపరాధమును పరిశోధించి కనుఁగొనుట కంటె నీతలపుఱ్ఱెల మహోద్యమరహస్యమును

భేదించి కనుగొనుట మిక్కిలి దుస్తరమును నభిప్రాయ మొకటి యేర్పడి యెను. ఏయభిప్రాయమైనను నామిత్రుఁడు దీర్ఘ సంసిద్ధముగనుండు ననియుఁ దలఁచి బలసూదనునితో,

వశీ : నాకు చూడ మిత్రవరా! ఈహత్యాప్రయత్న తంత్ర మున ముఖ్యపాత్రధారుఁడు నైకొన్న పితలబుఱ్ఱతే. ఈదుర్భేద్యరహస్య మును బోలినరహస్య మింకొకటి యెందును నుండదని నాయభి ప్రాయము.

బల : దీనికంటె నతిసులభమైన రహస్య మింకొకటి లేదని నా యభిప్రాయము. ఇదంతయు కొంత యంతరార్థమును, చూపరులకు భయమును స్ఫురింపఁజేయుటకై హంతకులు పన్నినకపటవ్యూహము. దీనితో మనము డీకొనపని లేదు. పరిశోధకునకు నెందును తనపరిశోధ నయే ముఖ్యాయుధము. దాని నత్యావశ్యకమగు వస్తువునందే యుప యోగింపవలయును. ఇందు భేదింపఁదగిన మహారహస్యములు రెండు. ఒకటి హంతకుఁ డెట్లు మాయమయ్యె ననుట. రెండవది ఈహంతకుని హత్యాప్రయత్నమున కుద్దేశ మేమి యనుట. ఈరెండును అతినిగూఢ ములై పరిశోధకుల దృష్టుల మోసగించుచున్నవి.

ఇట్లు పలికి కుమారబాబు ఇంతవఱకు నెవరిచేనైనను కదల్పఁ బడక యున్నయొకబల్లపై నెక్కి పైని మిద్దెకప్పునకు తగిలిన పిస్తోలు గుండు గుఱుతును గాంచెను. వెంటనే నామిత్రుఁడు నన్ను సంబోధించి "వశీకర్! ఈ పిస్తోలుగుండు తగిలిన మిద్దెకప్పునందలి గుఱుతొక్కటియే. శిరీషయొక్క స్వార్థరాహిత్యతను ఆయమసిరుపమాన సౌశీల్యధనమును చాటుచున్నది. అంతిమేల, హత్యోద్యమము నాఁటిరాత్రి యాశిరీష కుమారి తనజనకుని యనుమతి వడసి తనగదిఁ జేరి లోన గడియ వైచు కొనుటయేగాక మఱియొక తాళమును సైతము భద్రముగ వైచినది. ఆ బాల యారీతి తనశయనభవనము నింత ఇతరులకగమ్యముగ భద్ర పరచుకొనుటను చూడ నామె దేనినో యొకభయంకర శత్రువస్తువును

దలంచి తద్భయమున నిట్లు జాగ్రత్తవహించు చుండెనని తెల్లమగును కదా ? అట్లుకాకున్న తన గదిచేరువనే తండ్రియు సేవకుఁడును జాగరితులై యున్నారు. ఎవ్వరుగాని లోనఁ బ్రవేశింపకుండునటుల మహాద్వారము బంధింపఁబడియే యున్నది. గవాక్షములన్నియు మూయఁబడియున్నవి. ఇట్టిచో నాయమ యింతభద్రముగ కవాటముల బంధించుకొనుట కభిప్రాయమేమి ? ఎవ్వరినుండియో భయమునా శంకించియున్నదనుట నిర్వివాదాంశము. అటులైన తనతండ్రికైనఁ దెలుపక విశ్వాసనీయుఁడైన తన వృద్ధసేవకునకైన నెఱిఁగింపక తనకు రానున్నయాపదనా శంకించుకొనుచు భయపడుచుండుటకు కారణమేమి ? అయిన దానికి మీ రిట్లు సమాధానము చెప్పవచ్చును. ఆరేయి " దేవర పిల్లి " వికారక్రూరధ్వనిని వినినంతనె యా కుమారి భయపడి ఆ భయమును తనతండ్రి మొదలగు వారికిఁ దెలిపిన పరిహాసమొనర్తు రనియెంచి కాని యారీతిని భద్రపఱచుకొనియె నని తలంతురు కాఁబోలు. అది యసంభవము. ఎందుకన ? ఆయమ తన భయకారణము నితరులకు చెప్పిన హాస్యమొనర్తురని యెంచి యుండిన పక్షమున తాను తనతండ్రి సాన్నిధ్యముననె యుండి తానుశయనించు నపుడు జనకుని చెంతకు బిలుచుటకుమాఱు తానొంటిగ నాగదియందుండ భయనివారణకాదని తెలిసియు అగదియందె యొంటిమై యావికృతారవము విన్నవెంటనే యించుకేని నాలసింపక యంత భద్రముగ నేలపరుండవలయు ? కాన, నది కారణముకాదు. ఇఁక నేదియో యితరుల కెఱింగింపరానిభయ మొక్కటి యాకుమారిని బాధించుచుండెననుట నిస్సంశయము. అయిన నా భయ మేమి ? దానికి కారణమేమి ? దీని కేది యుద్దేశము ? తన నిద్రాగేహమును అంత భద్రపఱచుకొనుట చూడ భయనివారణ మొక్కటియే కారణము కాదనియు, సంభవింపనున్న రహస్యమయమైన యొక మహాపత్కార్యమును నివారించుటకై యొనర్చిన జాగ్రదాత్మ రక్షణోపాయమని తెలియనగును.

అట్లు తనకు సంభవింపనున్న మహోపకార్యమున నిట్లు చేసియుండిన ఆయుపకార్య మెట్టిదో? దానిరహస్య మెయ్యదియో? అది యెవరిచే ప్రవర్తిల్లునో? యివియన్నియు నామెకు తెలిసియేయుండ వలయును. అట్లు తెలిసియుండిన యాయాపదను బట్టియాపదఁ దెప్పు వారిని తనతండ్రికి నివేదించి తగు రక్షణము వహసి నిర్భయముగ తాను నిద్రింపక తనంతతాన యెవ్వరికిని తెలుపక రక్షణోపాయమును వెదకుట కావశ్యకమేమి? కావున, నామెకు సంభవించునాపదయు విప్లవకారులును నిగూఢముగ నుంచబడుటకూడ వానిని తన కిహలోకమున నేకబాంధువై యాప్తుఁడై దిక్కైయున్న తన తండ్రియంతటి వానికిసైతము తెలుపఁ గూడని మహారహస్య మేదియో కలదని యూహింపవచ్చును. తన తండ్రిసైత మెఱుంగనిరహస్య మాతరుణికిని, యాతరుణి నాపత్పరం పరలఁ బడఁద్రోసిన యాహంతకునకు మాత్రము తెలిసియుండవలయు. తన యాపదలకెల్ల కారకుఁడగు నాహంతకుని రక్షించుటకై నిజరహస్య మునేని దాచి తన్మూలమున కలుగ నున్న యాపదలకేని జంకక నిర్భీతిగ నెదుర్కొన నిర్ధరించిన యామెస్వార్థపరిత్యాగమును సౌశీల్యమన స్థైర్యములను ప్రశంసించితిని.”

# ఐదవ ప్రకరణము

"బుద్ధినిబోలిన పదార్థ మొక్కటి జగంబున కానరాదు దానివలన నప్రత్యక్ష విషయములనైన ననలీలగ వచింపవచ్చును. దానివలననే సత్పురుషుఁడన వెలయువచ్చును. అద్దానివలననే పరమహేయువర్తనుఁడను నపయశమందవచ్చును. ప్రకృతము మనబలసూదనకుమారుఁడు శిరీషకుమారి భయకారణ విమర్శనమున కనుపఱచిన యోజనాశక్తి పరమాద్భుతము. మనమాలోచించిన విషయములే మనము కనుఁగొన్న వస్తువులే ఆయనకు నుండెను. కాని, యీ వివేచనాశక్తిగల లేశముపిమాత్రము లేదు." అని నేను నాలో వితర్కించుకొనుచుంటిని. ఇంతలో

ఇట్లు బలసూదనుఁడు సంభాషించి విరమించినపిదప మేము ముప్వురమును నామహాత్యాగృహమును వీడి వెలుపల కరుదెంచితిమి. హంతకునకు మార్గ ముపసంగియుండ వలయునన్న యీనడవయందున్న గవాక్ష ద్వారములలో నొక్కటియే కదా? కాన, నందేమైన హంతకుని పాదచిహ్నము లున్నవా యని బలసూదనుఁడు పరీక్షించెను, ఆ పాదచిహ్నముల పరీక్షించుటకై ప్రాతఃకాలమునుండి రక్షక శాఖాధికారు లెందఱో యందు నడచియుండుటచే నందు హంతకునిపాదచిహ్నముల గుఱుతింప వీలుపడలేదు. ఇదియుఁగాక గవాక్షము వెలుపటి భాగము కొంతవఱకు తూలుపరచి యెఱ్ఱమట్టిచే నాచ్ఛాదింపఁబడి చక్కగ పరిష్కరింపఁబడి యున్నందున నడుగులజాడపడుట దుస్సంభవముగ నుండెను. ఇఁక నా ప్రయత్నమువలన ఫలములేదని

భావించి యచ్చటికి కొన్నిగజముల దూరమున నొక కాలిదారి ననుస
రించితిమి. అచ్చటికి ప్రక్కనున్న నానాలతావితానములచేఁ గూడిన
యొకపొదను గాంచి దానిఁ జేరితిమి.

ఆపొదయందు మనుజుఁడొక్కఁడు కొలఁదికాలము క్రిందట
కూర్చుండి యుండినట్లు కొన్ని నిదర్శనములు కాన్పించెను. ఆ నికుంజ
మునడుమ కొన్నిలతావళులు స్వేచ్ఛగ నల్లుకొనియుండినవి. ప్రస్తుతము
మార్గమును జేసికొనుటకై యాతీఁగెలన్నియు త్రెంపఁబడియుండెను.
ఎవ్వఁడేని యొక మనుష్యుఁడుమాత్ర మెవ్వరికిని కనఁబడకుండునటుల
యందు ప్రవేశించుటకై ఆపొదలోనిభాగము సంస్కరింపఁబడియుం
డెను. అంత బలసూదనుఁడు నను గాంచి "వశీకర్! శాంతికుఁడిచ్చట
దాఁగి సమయనిరీక్షణము నొనర్చియుండవలయును. శిరీషకుమారి
శయనగృహమున కిది చేరువనున్నది గదా? ఇందుండి శాంతికుఁడు
స్వేచ్ఛగ శిరీషశయనపద్మమును నిరాటంకముగ సందర్శింపవచ్చును.
ఇంకను నిచ్చట నెన్నియో నికుంజము లున్నవిగాని అవి రాజమార్గము
నకు కడుచేరువనుండుటచే వానియందు నితరులకు తెలియకుండ ప్రవే
శించుట యరుదు. ఇదిమాత్రము రాజపథమునకు దూరమై జనసంచా
రములేమి నేకాంతనివేశమున కనువైయున్నది. దానిబట్టి శాంతకుని
సన్నిధానసుఖ మనుభవించిన దీపొదయే యని నే నుడివితిని.

అంతట మేమందఱ మాకాలిబాట నేగుచుండ నెడమవైపున
శిరీషగదికెదురుగ నున్న రెండుప్రత్యేక వృక్షముల నామిత్రుఁడు గాంచి
మనమున నేదియో యాలోచించుకొనుచు నాలోచనానిర్ధారణమునకై
తలయూఁచుచు ముందు నడవసాగెను. ఇట్లుచని మేమరుగుచున్న కాలి
దారికి కొన్నిగజముల దూరమునను, రాజమార్గమునకు కొలఁదిదూర
మున నున్న యొకసరోవరమును చేరితిమి. అప్పటికే డ్వాకేంద్రుఁడు దొర
తనమువారు నియోగించిన సుప్రసిద్ధపరిశోధకుఁడు ఆసరోవరతటమందు
ప్రవేశించి తనచేతనున్న యొకపుల్లచే సరోవరపునీటిని పలుమారు

త్రిప్పుచుండెను. ఆతనిప్రక్కనె యొకచేతికఱ్ఱ యుండెను. ఆసరసి కడు మనోహరలీల రాతిచే కట్టఁబడియుండెను గాని యొకచో నొకరాయి మాత్ర మూడ పెరకఁబడిన గుఱుతు కానిపించుచుండెను. ఆశిల యుండినతావు శూన్యమై యుండెను. ఈకొలనుకు చేరువనున్న చిన్నదారి యందు కొన్నిపదముల గుఱుతు లుండెను. బలసూదనుఁడు పెన్నిధి గన్న పేదచందమున వానిపొంతఁ బోయి విమర్శింప మొదలిడెను. మేమును నతని ననుసరించితిమి. ఆయడుగుల చిన్నెలందొకటి కాలి బూటులయొక్క చిహ్నమైయుండెను. అది పెద్దదిగ కాన్పించు చుండెను. దానిచెంతనె మఱియొక పదచిహ్న ముండెను. అది చిన్న కాలిబూటుల గుఱుతని సులభముగ గ్రహింపవచ్చును. అదిమొదటి దానిఁబోలి పెద్దదిగాక సామాన్యమనుజుఁడు ధరించు పాదరక్షగుఱు తనుట విస్పష్టమయ్యెను. నేనిదివఱకు హంతకుఁ డొక్కరుఁడే యీయప రాధకారి యనియెంచియుంటిని. ప్రకృతము హంతకుఁ డొంటిమై యీహత్యోద్యమమునకు సాహసింపలేదనియు నతని కింకెవ్వరో సహాయకుఁ డొకఁడుండెననియు దీనివలన నాయూహను మార్చుకొన వలసివచ్చెను.

ఈసందేహనివర్తికై నామిత్రుని ప్రశ్నింపవలసి వచ్చెను. అందు నకు బలసూదనుఁడు—

బల : ఈయపరాధమున కార్యక్రమము నడపినవాఁడొక్కఁడే; హంతకుని యుద్యమమున నింకొకమనుజుఁడు సహాయకారిగ లేఁడు. కాన, నీరెండుపాదరక్షల గుఱుతులును నొక్కమనుజునివి గావు. ఏమన నీరెండువిధములగు బూటులగుఱుతులలో నొకటి పెద్దదిగను రెండవది దానికన్న కొంచెము చిన్నదిగనునుండుటయే యీహత్యాప్రయత్నమున నిరు వురుండుటను సూచించుచుండ నొక్కరుఁడే హంతకుఁడనుట కాధార మెయ్యది యని మీరు ప్రశ్నింపఁగ వచ్చును. ఇందలివివరమిది. ఆచిన్న

బూటు గుఱుతే హాంతకునిది. పెద్దబూటు గుఱుతేమన, హాంతకుఁడే యితరులను ఆరక్షక శాఖవారిని నిపుణులువిషయవిజ్ఞానులను మోసగించి యిట్టి భ్రాంతి నొందించుటకై మఱియు హత్యామందిరము నందును దాని సమీపమునను తన నిజమైన పాదరక్షగుఱుతు నితరులకుఁ దెలియకుండుటకై పరిశోధకుల కెడమియ్యకుండ తా నింకొక పెద్దబూటును ధరించియుండినందున అదియే యిది.

హాంతకుఁడు హత్యాప్రయత్న సమయమున నీపెద్దపాదరక్షలను ధరించి పోయి కృతకార్యుఁడై యింతవఱకు మరలి వచ్చి వానినిందు నూడఁదీసి తననిజమూలైన పాదరక్షలతో ముందు పయనము సాగింప నెంచెను. అట్లు బూటుల నూడఁదీయుటకై తనబైసికల్ ఫెడల్ (Feddle) మీఁద నొకకాలుంచి యొకకరమున దాని హేండల్ (Handle) పట్టుకొని నేలపైనున్న మఱియొక కాలిపెద్దబూటును రెండవచేతితో నూడబెఱికి బైసికల్ హేండలుకు తగిలించెను. మఱల నావైపునను తన రెండవకాలినున్న పెద్దబూటునుకూడఁ దీసెను. అందునకే యిచ్చట నొక్క పెద్దబూటుగుఱుతును, దాని ప్రక్క నానుకొనియే మఱియొక చిన్నబూటు గుఱుతును నున్నవి. హాంతకుఁడు తన నిజమైన పాదరక్షల ధరించి వానిపైననే మఱియొక పెద్దబూటుల ధరించెనని తెలియుము. ఏదీ! నేను శరీషగదియందు దొరికిన యొక చిహ్నము నొకకాగితమున గురుతువైచి నీచేతి కందిచ్చియుంటినే దాని నిందిమ్ము; ఇదె కనుగొనుము. ఇపుడు మనయెదుట నున్నబూటు గుఱుతును నీకాగితముననున్న బూటు గుఱుతును నొక్కటే. చూచితివా? ఇంతభావమును మనము దీనినుండి యనుసంధానింపవలయు. వశీకర్! చూచితివా హాంతకుని యసాధారణ ప్రతిభాపరిణతి! తాను రెండుపాదములను నేలపై నుంచి పైన తొడిగి కొనిన పెద్దబూటుల నూడఁదీసినపక్షమున రెండు పెద్దబూటుల యొక్క గుఱుతులును, పైనున్న పెద్దబూటుల తొలగించిన తర్వాత లోననున్న నిజమైన తన బూటులయొక్క గుఱుతులు రెండును, వెరసి యున్నియు నాలుగు

బూటుగుఱుతులు నేలపై నంకితములగుననియు, అవి పరిశోధకుల పరిశోధనామార్గమున కెంతయు సహాయకారులై దారిచూపునని యెంచి బైసికల్‌పై నొక పాదముంచి రెండవపాదము బూటును వదలించెనని యెఱుంగుము. హంతకుఁ డితరులకు దుర్నిరీక్ష్యుఁడు. కంటివే, ఇచ్చటినుండి బైసికలు జాడయు, ప్రక్క నచ్చటచ్చట చిన్న బూటుగుఱుతును చూపట్టుచున్నవి! దీనివలన హంతకుఁడు బైసికలును నెక్కక నొక్కచేతితో దాని నడిపించుకొనుచు పోయెనని బోధపడు చున్నది. అదిగో! అందు చూడుము. ఆస్థలమునుండి మఱియేమైన బూటుగుఱుతులు కాన్పించుచున్నవా? లేదు. కేవలము బైసికలు పోయినజాడ యొక్కటియే యున్నది. అతఁడు దాని నెక్కి యచటి నుండి పోయెను. ఆగుఱుతుకూడ భూమిమీఁద కనఁబడుచున్నది. ఇట్లు కేవలము బైసికలు జాడసైతము రాజమార్గమున కానరాకుండినయే తీరవలయు. కావలయున్న ప్రహరి గోడయందలి యుద్యానవనద్వార మును దాఁటి రాజమార్గమునకు పోయి పరీక్షింపుము.

అని నుడువునంతలో "సెబాస్ సెబాస్! మంచిధీశాలివి. ఇచ్చట నేదియైన బైసికలుండియుండిన పక్షమున నీబుద్ధికుశలత యొక్క యూహా, సహేతుకమైనదియో కానిదియో తెలియుట కనుపడి యుండును." అను ప్రశంసావాక్యముల నుచ్చరించుచు ద్విజేంద్రలాలు మమ్ము సమీపించెను. సమీపించి చెంతనున్న యంబికాచరణునిఁ గాంచి "అంబికాచరణులుగారూ! తమద్విచక్రయానము చాలకాలము నుండి యిచ్చటి యీ మందిరముననే యుండవలయుఁగదా! దానిఁ దెప్పించిన నీబలసూదనబాబుగారి యూహ సహేతుకమైనదనుట కనుఁ గొనన నగుపగును." అని వక్కాణించెను.

అందుకు నంబికాచరణుఁడు క్షణకాలము నివ్వెఱపడి యెట్టులో స్థిమితమనస్కుఁడై ద్విజేంద్రునిఁ గాంచి,

అంబి : మహాశయా ! నా సైకిలును హత్యోద్యమము నాఁటికి మూఁడురోజుల క్రిందటనే బొంబయినగరమునందలి నానివాసమునకుఁ దీసికొనిపోయితిని." అనినుడివెను.

అంబికాచరణుని యీప్రత్యుత్తరము నాకు కొంతవిస్మయమును, సందియమును కలుగఁజేసెను. హత్యోద్యమము నాఁటికి మూఁడు దినములుమునుపే యంబికాచరణుఁడు తాను చిరకాలమునుండి నివసించుచుండిన యీజయంతమందిరమునుండి తన సైకిలును బొంబయికి తీసికొనిపోవుటయు హత్య జరుపయత్నించు దినము రాత్రి మాత్ర మతఁడు జయంతమందిరమున నుండకపోవుటయుఁ జూడ హత్యోద్యమాపరాధమును నీతనిపై మోపుటకు కొంతవఱకు కారణముండ వచ్చునని నేననుకొంటిని.

ఇంతలో ద్విజేంద్రలాలుగారు బలసూదను నుద్దేశించి,

ద్విజేం : బలసూదనబాబుగారూ ! హంతకుఁడు మాయమైన విషయమున మీయభిప్రాయ మేమి ?

బల : అతఁడు స్వాభావికమైనమార్గముననే మాయమయ్యెను.

ద్విజేం : ఇపుడు మీరు బుద్ధిశాలులనుట నిస్సందేహము. స్వాభావికమార్గ మగుశిరీషకుమారి గదిద్వారముగుండనే హంతకుఁడు మాయమయ్యెను.

బల : కాదు. అది కాదు. హంతకుఁడు శిరీష గదిద్వారముగుండ మాయము కాలేదు. అతఁడు స్వాభావికరీతిని స్వాభావిక మార్గముననే మాయమయ్యెను.

ద్విజేం : ఏమీ ! హంతకుఁడు శిరీష గదిద్వారముగుండ కాదా మాయమగుట ? ఇందునమాత్రము నీవు పొరపడితివి. ఇంతవఱకు మన యిరువురి పరిశోధనచేసూపి. మార్గములు సమానముగ నేకప్రదేశముననే

పోయియుండినను హంతకుఁడు మాయమైన విషయమున మాత్రము భిన్నములైనవి. దీనికి కారణ మాలోచింప మీరు బుద్ధికుశలతపైననె యాధారపడి దానినే నమ్మి దానినే నిశ్శంకముగ ననుసరించుచుండుటయే యని తెలియవచ్చుచున్నది. ఎప్పుడును పరిశోధకుఁడు తనమేధాశక్తినే విశ్వసించి దానిపైననే యాధారపడఁగూడదు. అది యొకొక్క సమయమున నరుని సరియైనమార్గమునకు కొనిపోవును. వేఱొక్క సమయమున తప్పు మార్గమునకును నాకర్షించుట కలదు. కాన దానిపైన నాధారపడిన మానవుని యాబుద్ధికుశలత సరియైనమార్గమునకు కొనిపోవునని నమ్మకము లేదు. కనుకనే శోధకుఁడు బుద్ధికుశలతపైననే యాధారపడక తాను చూచుచున్న వస్తుసామగ్రియందు సైతము విశ్వాసముంచి శోధనీయమైన విషయమును తెలిసికొనయత్నించి పిదప బుద్ధిపై నాధారపడవలయు.

బల : నాయభిప్రాయ మిట్టిది గాదు. మీరు వచించినబుద్ధికౌశలమొకానొకప్పుడైనను పరిశోధకుని-తనపై నాధారపడియుండువానిని-సరియైనమార్గమునకు కొనిపోవును గాని వ్యర్థపఱుపదు. అట్లుగాక మానవుఁడు తనమానసమున నేదో యొకయభిప్రాయ మూని, దానిపైననే యాధారపడి దానికనువుగ వెలుపలివస్తుసామగ్రిని సమకూర్చ నెంచుట కేవల మవివేకము. ఎందుకన ? అతఁడభిప్రాయపడిన విషయము చాలినంతవఱకు తప్పుమార్గమగుట సంభవించును. అట్టి తప్పభిప్రాయమున, తప్పుమార్గమున చరించుటకు తానే కారణభూతుఁడగును కదా ? బుద్ధిశక్తిని నమ్మినవానివిషయ మిట్టిది కాదు. ఒకవేళ నది తనపై యాధారపడినవానిని దుర్మార్గమునకుఁ దీసికొనిపోయినను చాలమట్టు కదికుమార్గ మనిపించుకొనఁజాలదు. అట్లు సంభవించెనేని, అది బుద్ధిశక్తిని నమ్మినవాని దోషముగ పరిగణింపఁబడదు. కావున నీరెంటియందును మానవుఁడు బుద్ధిశక్తిని నాధారపడుటయే శ్రేయస్కరము.

ఇంతలో భూమిమీఁద నేమియో తదేకదృష్టితో పరికించుచున్న యంబికాచరణునిఁ గాంచి ద్విజేంద్రుఁడు నతనిసంబోధించి “అంబికాచరణమహాశయా! మీ రింత తదేకదృష్టితోఁ జూచుచున్న దేదియో నే నడుగవచ్చునా?” అని ప్రశ్నించెను. అంత నేనును నామిత్రుఁడును అటువైపు తిరిగి మేమిదివఱకు పేర్కొనిన చిన్నబూటుగుఱుతుల నున్నూ తానిప్పుడు బూటుతొడిగికొనిన పాదములతో సంచరించుచో భూమిమీఁదపడిన తనబూటుగుఱుతును నిశ్చలనయనుఁడై చూచుచుండుటను గంటిమి. మేము మువ్వురమును నచ్చటి కేఁగితిమి. ద్విజేంద్రుఁడు మఱల నంబికాచరణునితో,

ద్విజేం: ఓహో, బహుశః నేఁపై తాము తమపాదరక్షల గుఱుతును, హంతకుని పాదరక్షగుఱుతును నొక్కటిగా నుండినట్లు కాన్పించినందున వింతజనింప దానినే చూచుచున్నారు గాఁబోలు” అని నుడివెను.

నామిత్రుఁడును గొంతకాల మాదృశ్యములైన యుభయుల బూటుగుఱుతులను నిపుణముగఁ గాంచి “సరియే; అంబికాచరణలాలుగారూ! మేము చేయఁదగిన పరిశోధనయంతయు ముగిసెను. ఇఁక తమ యానతిఁ గైకొని కొంత విశ్రాంతిఁ గొనుటకును, సమీపమున నున్న ఫలాహారభోజనశాలకు చని ఫలాహారము స్వీకరించుటకును బోవుచున్నాము.”

అనినుడువుచు నన్నుఁ జూచి “వశీకర్! మన మిఁక హోటలునకు వెడలుదమా?” అనియడుగ, నేనియ్యకొంటిని. పిదప మేముభయులమును హోటలుమార్గమునుబట్టి యేఁగితిమి. ద్విజేంద్రలాలుగారు మాత్రము యథారీతిని తనకార్యక్రమమును నడుపుటకై సరోవరతీరమునకుఁ బోయెను. అంబికాచరణుఁడు జయంతిమందిరమార్గము ననుసరించెను.

మేము హోటలునకు పోవు మార్గమధ్యమున నామిత్రుని చూచి, "నీవు చెప్పినవిధమున నారెండువిధములగు పెద్ద చిన్నబూటు గుఱుతులు ఒక్కమనుజునివియే యని నీవు నిర్ధరించినప్పటినుండియు నన్నొకసందియము బాధించుచున్నది. అదేమన ! ఆరెండుపాదచిహ్నములలో నొకటి హంతకుని సహాయకారిదిగ నుండుట యేల సంభవము కాదనుటయే. హంతకుని సహాయకుఁడు హంతకుఁడు నిలిచినస్థానమున నిలిచి ఆతని బైసికిలుయొక్క వెనుకటిభాగమున నుండుచక్రమునకు నెక్కుటకై యుంచిన యినుపమేకుపై నొకకాలును నేలపై నొకకాలును నుంచి హంతకునితో మాటలాడుచున్నందున నాతనిపాదచిహ్న మేల యందుండరాదు ? అది సహాయకుని పాదచిహ్నమని యేల తలంపరాదు ? ఇదియుఁగాక బైసికిలుజాడ వెంబడి యున్న యడుగులు సహాయకునివియే యేల కాకూడదు ? హంతకుఁడు తనదొంగపాదరక్షల విడిచి బైసికిలు నెక్కి పోవుచుండ సహాయకుఁడును దానిప్రక్కనే యతనితోఁగూడి యేల పోయియుండరాదు ? అట్లు పోవునపుడు వానియడుగు లేల నేలపై నుండరాదు ? అక్కడ బైసికలుజాడ మాత్రమే కనుపించినందున హంతకుని సహాయకారియు, కొంతవఱకునడచుచు బైసికిలును ననుసరించి పిదప నాసైకిలు పిఱుంద భాగమున తానును కూర్చుండి యుండినందున ప్రక్కను కాలుగుఱుతులు లేక కేవలము సైకిలుజాడ పడినదని యేల చెప్పరాదు ?" అని ప్రశ్నించితిని.

బల : నీవు చెప్పినరీతి హంతక సహాయకు లిరువురును సైకిలు నెక్కి పోయియుండిన పక్షమున వారిర్వురిభారముచే సైకిలుచక్రములు భూమిలో దిగినందున జాడ లోతుగా నుండవలయుఁగదా ! మనము గాంచిన జాడ అట్లు లోతుగ లేక తేలికగ నొక్కరు కూర్చుండిపోయినంత మాత్రము జాడ కనుపింపలేదా ? సహాయకుఁడు సైకిలు నెక్కినయెడల

ఆతని కాలిముసుగులు కొనవలసియుండవలయుఁగదా! నడుము సాఁగి పోవుటకు కారణమేమి? కాన హంతకునకు సహాయకుఁడుండుట యసంభవమని యెఱుంగుము.

ఇంతలో, మాకు ఫలహారశాల (హోటలు) సమీపించెను. ఇయ్యది మేము వెనుకవివరించిన భోజనఫలాహారశాలయే యని పాఠకులు జ్ఞప్తియందుంచు కొందురుగాక. దానియధిపతి "శూరసింగ్," ద్వారమునందే కనఁబడుటవలన "ఇచ్చట బ్రాహ్మణ ఫలాహారము లేమైన దొరుకునా?" యని బలసూదనబాబు ప్రశ్నించెను.

శూర : లేవయ్యా! ఏవియు లేవు. మొదట శూద్రుల ఫలాహారద్రవ్యము లగుమాంసభక్ష్యాదులే లేనప్పుడు, ఇఁక బ్రాహ్మణ ఫలాహారము లెచ్చటినుండి రావలయు? బ్రాహ్మణఫలాహారములఁట! బాగున్నది. పొండు. వేఱొకతావున కెచ్చటికైనను వెడలిపొండు, ఇక్కడ మాత్రము ఏదనమందుగాని యేవియు దొరకవు.

ఈ శూరసింగు యొక్కవిసుఁగును, కోపమును సూచించు కఠినంపుభాషణముల నాలించి నామిత్రునకు నాగ్రహమును నిరాశయు నేకకాలముననే యుదయించెను. అప్పటికే ప్రొద్దు పదిగంటలను మీఱు చుండెను. ఆఁకలిగొన్న మే మీ హోటలునందు ఫలాహారము దొరకునని పేరాసఁ జెంది దీనిపై నాధారపడి యుంటిమి. జయంతభవనమున మేము పరిశోధనకై యొక్కరిన వేడి అతిప్రయాసమున ప్రవేశించి యుండుటచేతను, అచ్చటివారందఱు నధికశోకార్తులై యున్నందునను, అచ్చట ఫలాహారములొనర్చుట యనుచితమని మేమందు నిలువక దీనిని నమ్మి యిందు వచ్చితిమి, నమ్మివచ్చినవస్తు విట్లు నిష్ఫలమయ్యెను. ఏది యెట్లున్నను, అంబికాచరణుఁడు మాత్రము మాకు

భోజనసదుపాయములఁ జేయుచుండెను గాని, ప్రకృత విమర్శనము వలన తేలినయంశములఁబట్టి యువి తనకు వ్యతిరేక భావమును సూచించుచుండుటచేత నాతనిమానస మాలోచనాపరవశ మైన కారణమున నాతఁ డేమియు నొనర్పఁజాలఁడయ్యె. ఇదియుఁగాక నతఁడీ యీ హోటలునందున ఫలాహారాదుల సిద్ధపఱుప శూరసింగొక బ్రాహ్మణుని నియమించి యున్నాఁడని మాకు తెలిపియుండె. కావుననే మేమిందువచ్చుట కలిగినది. ఇపుడు శూరసింగు మాటలవలన బ్రాహ్మణుఁడెవ్వఁడును ప్రస్తుత మిందు లేనట్టుగఁదోఁచెను. నామిత్రుఁడు తనకు జనించిన యాగ్రహమును కొంతయణఁచికొని శూరసింగును గాంచి, "అయ్యా! పాలుగాని, ఫలములుగాని యున్న దయయుంచి యిమ్మని" యడిగెను. ఈప్రార్థనమునకుసైత మాతఁడు నసమ్మతిని, తనయాగ్రహమును సూచించెను. తోడనే బలసూదనుఁడు తత్కాల మున నొకయూహ ప్రస్ఫురింప తటాలున శూరసింగును సమీపించి "ఇఁకముందు నీమృగమాంసభక్షణ లభించుట కరవగు" ననుమంత్రా క్షరములను నతని చెవిచెంత చెప్పినంతనే, అదియేమి వశీకరణసమ్మోహనాస్త్రమో కాని యుంబికాచరణుఁడు పూర్వము వశంగతుఁడైనరీతి శూరసింగును తత్క్షణమె వశంగతుఁడై పోయెను. దానికితార్కాణముగ నతఁడు మమ్ముల సవినయముగ "ఫలక్షీరాదుల నొసఁగుదును; లోనికి విచ్చేయుఁడు" అనుచు మమ్ము లోనికి కొనిపోయెను. మేమంత నొక బల్లచెంతను ప్రవేశించితిమి. శూరసింగు తత్క్షణమే లోనికరిగి వివిధము లగుఫలములను, నొకభాండమునిండ క్షీరమును గొనితెచ్చి మాముం దున్నబల్లపై నునిచెను. మేమును భుజించుచుండ నచ్చటికి కరువది వత్సరముల వృద్ధాంగన యొకతె చేత దండమును ధరించి యూఁదుకొనుచు వచ్చెను. ఆయమవస్త్రము లతిమలినములై యుండెను. ఆమెవెనుక

నొకశునక ప్రమాణము గల మార్జాల ముండెను. ఆవృద్ధవనిత శూరసింగును జూచి,

వృద్ధ : శూరసింగ్ ! నాపిల్లి కేమైన తిండి నిచ్చితివా ?

శూర : ఓహో ! మాలవిదూ ? ఏమి, యిన్నిదినములు కనుపించనేలేదే ?

వృద్ధ : నే నిచ్చటికి క్రోసుదూరమున నున్న "పుష్కరము" అనునొకగుట్టకు చేరువనుండు గుహలో దైవప్రార్థన సలుపుచుంటిని. కాన నేనీపరిసరమునకు రాజాలకపోయితిని.

శూర : ఇదేమాశ్చర్యము ! అట్లైన మొన్న విశారముగు "దేవరపిల్లియరచు వింటిమే ! అది యీపరిసరమున నెట్లు వినవచ్చెను?

మాల : నా దేవరపిల్లి యరచెనా ? అది యరవనేలేదే ? అది యెల్లప్పుడును నన్నెడఁబాయక నా వెంటనే యుండెను.

శూర : అటులైన శిరీషకుమారి మాతోన్యదమును నాఁటిరేయి యీపిల్లి యరచినట్లు చెప్పుచున్నారే ! అది యబద్ధమా ?

మాల : అదేమియో యీవిషయమే నాకు బోధపడుటలేదు. నామార్జాలము మాత్రము నా చెంతనే యెల్లప్పుడుండెను. కాని యిచ్చటికి రాలేదని దృఢముగ నేను చెప్పుచున్నాను.

అంతట శూరసింగు లోపలికి పోయి యొకరొట్టెముక్కను తెచ్చి దేవరపిల్లి కిచ్చెను. మార్జాల మాముక్కను గ్రహింప, మాలవిదూ మార్జాలమును గొని వెడలిపోయెను. అంత శూరసింగు మాలవి చరిత్రమును మాకీవిధముగ చెప్పెను. ఈయమ "వీరారు" గ్రామ కాపురస్తురాలు. ముప్పదియేండ్లక్రిందట బైండరుగ్రామమునకువచ్చి యిందే యింతకాలము నుండి నివాస మేర్పఱచుకొని యున్నది. ఆయమ యొకచో స్థిరముగ నుండునది కాదు. కొంచెము బుద్ధివైకల్య మున్నది—

కాంబోలు. నావృద్ధవనిత చాలకాలము గుట్టలయందును, గుహాల యందును నివసించుచుండెడిది. కొంద ఱది బుద్ధివైకల్యము కాదనియు, తనవృద్ధాప్యదశయందు దైవప్రార్థనముల నొనర్చుకొనుటకు నిర్జన ప్రదేశములైన కొండలయందును, గుహాలయందును నివసించుచున్న దనియు చెప్పుదురు. మార్జాలమునుసైతము వెంటపిలిచికొనిపోవుట దానిపై మక్కువ చేతనే యని వచించుచుందురు. మొత్తముమీఁద నీప్రాంతవాసులందఱును మాలవిని నాయమ "దేవరపిల్లి" యనఁ బరగినమార్జాలమును కడు భక్తిశ్రద్ధలతోఁ గాంచుచుందురు.

ఇట్లు శూరసింగు వచించునపుడు నాకు దేవరపిల్లిని చూచినప్పటి నుండియు, దానియాకారము భయముఁ గొలుపుచున్నందున దచ్చరిత్ర మును సాదరముగ వినుచుంటిని. అంత శూరసింగునే తదేకదృష్టిచే చూచుచున్న నామిత్రుని గాంచి నేనును నాతని విచిత్రచర్యలనుగూర్చి యుచ్చరువందు చుంటిని. శూరసింగు గవాక్షముగుండ నెవ్వరినో చూచుచు ముఖము చిట్లించుకొనుచు పండ్లు కొఱుకుచు తనముష్టి నాదెస చూపి కదలించుచు తనమనోభావముల ప్రయత్నింపకయే వెల్లడింపుచుండెను. అదేమియోఁ కనుఁగొనవలయునని లేచి చూడ నాగవాక్షముఖమునుండి యొకపురుషుఁడు పోవుచుండుటను గాంచితిని. ఆ పురుషుఁ డతిసుందరుఁడు. ఆకుపచ్చరంగు గల కవచమును, నల్ల రంగుగల షరాయిని, చొక్కాజేబునం దట్టిరంగేకల కరవస్త్రమును, పాదములందు నీలైన పాదరక్షలను, భుజసీమపై పక్షులవేఁటాడునొక తుపాకిని ధరించుకొని సగాంభీర్యముగ వచ్చుచుండెను. ఆమనుజుఁడు కొంచెము గవాక్షము నతిక్రమించిన తోడనే శూరసింగు మావైపు తిరిగి సక్రోధముతో పండ్లుకొఱుకుచు "ఆవన్నెమెకము, ఈవైపునకే వచ్చెను కాంబోలు! వాని నెన్నిమారులు తిట్టి యిచ్చటికి రావలదనినను

వానికి సిగ్గుండినకదా రాకుండును? ఈ సారి రానిమ్ము వానికి చక్కగ బుద్ధిగఱపెదను." అని గట్టిగ నుచ్చరించుచు పచారు చేయుచుండెను.

అంతట నా పచ్చరంగుపురుషుడు నాహోటలున కెదురుగనే పోవుచు నందు తన నిశ్చలనయనముల ప్రసరింపజేయుచు పోయెను. ఇప్పుడు శూరసింగువదనమున నిదివఱకు నటియించుచున్న యసహ్య, క్రోధా సూయలు మారి, ప్రశాంత, ప్రసాద, ప్రమోదములు నృత్య మొనర్ప సాగెను. అంత నతఁడొక పెద్దనిట్టూర్పు విడిచి "మంచిదే! వాఁడిందు రాకుండుట వానికి క్షేమము" అనుకొనుచుండగనే వాని ముందర నా సుందరపురుషుఁడు తిన పచ్చనివస్త్రముతో ప్రత్యక్షమయ్యెను. వెంటనే శూరసింగు ముఖమున నిపుడే పోయియుండిన అసహ్య క్రోధ ములు మరల వేషములఁ గొని నృత్యమాడఁదొడఁగెను. ఆసుందర మనుజుఁడును నొకబల్లచెంత కూర్చుండి "తనకేమైన నాహారపదార్థ మున్న నొసఁగు" మని శూరసింగును నడిగెను. అంత శూరసింగు,

శూర: ఏమీ! ఫలాహారమా? ఇచ్చట నేమియు నీకు దొరకదు, వెడలిపొమ్ము.

సుంద: ఏమియు లేకున్న కొంచెము వేఁడిపాలైన నొసఁగుము. చాలదాహ మగుచున్నది.

శూర: వేఁడిపాలు లేదు- చల్లపాలు లేదు. తుదకిచ్చట మంచి తీర్థమైన లభింపదు. దయచేసి సెలవుఁగైకొనుఁడు. ఇచ్చట నేమియు నమ్మఁబడదని నేను నీకు తొలుతను చెప్పియుండలేదా? పలుమారు వచ్చి మరలమరల నడుగుటవలన ఫలమేమి?

సుంద: ఇంతమాత్రము చెప్పుటకై తామింత యాక్రోశమును జూపుట నాకాశ్చర్యముఁ గొలుపుచున్నది. మంచిదే; అది పోవనిండు! మీభార్య కిపుడైన దేహము కొంచె మారోగ్యముగ నున్నదా? ఎటు లైనను నేనిచటినుండి వెడలి పోవుటయే తమయభిమతము కదా?

ఈ సంభాషణము జరుగుకాలమున నొక స్ఫురద్రూపిణి యైన నిండుజవ్వని యొర్తు మూర్తీభవించిన మోహనదేవతవోలె లోనుండి వచ్చి లోపలిద్వారముచెంత కవాటముల గానుకొని వారిరువురి సంవాదమును నాలించుచుండెను. సుందరపురుషుని మేనిపై నిదివఱకు ప్రసరించుచుండిన శూరసింగురూక్షేక్షణములు తటాలున నట్లువచ్చి ద్వారముకడ నిలిచిన జవ్వనిపై ప్రసరింప "మలయవతీ! ఇచ్చట యేమిపని? పొమ్ము లోపలికి" అని కఠినస్వరమున నుచ్చరించెను. వెంటనే యాపొలతి కినుక గదిరిన నెమ్మనముతో తటాలున నాప్రదేశమువీడి చనియెను. శూరసింగును కొన్నినిమిషములకు లోనికేగెను. అట్లు శూరసింగుచనిన 15 నిమిషములకే లోని పలుకులు మొదట కఠినములై రానురాను కాఠిన్యము ఎక్కువై వాక్కలహమునకు మారుట నాలించి యాసుందర పురుషుడు ఆధ్వని వినవచ్చెడి ద్వారముచెంత కరిగెను. అప్పుడు శూరసింగు పురుషునిగాంచి భీషణస్వరమున "నీకచ్చట నేమిపని? వెడలు" మని నుడివెను. విధిలేక నవీన సుందరపురుషుడు వెనుదిరిగి హొంటలువిడిచి పోవ నుద్యుక్తుడై సగాంభీర్యముగ వెడలుచు మఱొక్కపర్యాయ మాగదిగచూచి వెడలి పోయెను.

అట్లాతడు వెడలిపోవగనే శూరసింగు లోపలినుండివచ్చి "మాతో మీరు శిరీషకుమారి హంత్యోద్యమాపరాధమునందలి హంతకుని బంధింప కుతూహలులై యున్న, యిపుడు వెడలిపోయిన యావన్నెలమెకమే యాహంతకుడు. కావలసియున్న వాని బంధింపు" డనియెను.

బలసూదనుఁ డతనినుద్దేశించి "యాసుందరపురుషుఁ డెవ్వఁడు" అనియెను.

శూర: ఆవన్నెలమెకమా! పంచాననబాబుగారి గృహోద్యానమునకధిపతి. పేరు మదనమోహనుడు. ఇతని కార్యమేమన, నుద్యానమందలి వృక్షములను, నందలిపక్షిజాలమును నెవ్వరును నపహరింపకుండ కను హెచ్చరికతో చూచుచుండుటే—ఈవనమునం దేలోపము

సంభవించినను దానికితఁడే బాధ్యుఁడగును. అయిన నితఁడెట్లు తన యుద్యోగధర్మము నిర్వహించునో నాకు సందియము గొల్పుచున్నది.

బల : (మందహాసముతో) అదియేల? అతఁడెప్పుడును వస్త్రాలంకారభూషితుఁడై వీధుల తిరుగుచుండుటచేతనా?

శూర : అతఁడు స్త్రీలోలుఁడు. సాయంసమయముల నాకుపచ్చరంగుగల వసనముల నెల్లప్పుడును ధరించి కడు నొయ్యారమున సంచరించుచు నీప్రాంతమునఁ గలయింతులనెల్ల వశంగతులఁగఁ జేసికొను చున్నాఁడు.

నామిత్రుఁడంత పీఠమునుండి లేచెను. నేనును నతని ననుసరించితి; శూరసింగుమాటల నాకర్ణించినదాది మదనమోహానుని సచ్చారిత్రమునందించుక యనుమానము కలిగెను. ద్వారమును దాఁటినపిదప నామిత్రుఁడు సమందహాసముగ "మలయవతి సింహుజవ్వని; స్త్రీ సాహస మెంతేని చేయునుగదా" యనిపలికెను.

కొంతనడికి జయంతమందిర ప్రాకారము సమీపించితిమి. వనపాలకులగు కౌముదీకందళుల కేర్పఱుపఁబడిన గృహము చేరినంతనే యందెవ్వరును నుండలేదు. నామిత్రుఁ డంత తెఱచియున్న గవాక్షము నుండి లోనికరిగెను మరల కొన్నినిమేషములకు వెలుపలికివచ్చుచు మందహాసమున "నేనూహించిన చందముననే జరిగిన" దనెను.

నామిత్రుని మాటలకు విస్మయమంది నేను "ఏమిజరిగిన" దని ప్రశ్నించితిని.

బల : ఏమి జరిగినదా? ఏమున్నది? కందళుని గృహమున పక్షులను బట్టుటకువలయు జాలమును, నితర సాధనములును, నొకతుపాకియు నున్నవి.

నేను : ఉన్న నేమాయెను?

బల : ఏమాయెనా? కౌముదీకందళులు శిరీషహత్యాపరాధమున నిర్బంధింపఁబడిరి_కాని,—అది యిప్పుడేల? పిదప చూచుకొందము.

# ఆరవ ప్రకరణము

అప్పుడు 12 గంటలగు చుండెను. ప్రభాకరుఁడు నిజకిరణ సహస్రముల జగమంతయు కలఁచుచు దుర్నిరీక్ష్య ప్రభాభాసురుఁడై యంతట వెలయు చుండెను. ఎండవేఁడిమి సహింపరాకయుండెను. సుకుమారుఁడైనను నామిత్రుఁడు మాత్ర మాతపముధాటికి లక్ష్యమొనర్పకుండెను. కార్యైకదీక్షాపరుల నెట్టియాటంకములును నడ్డగింపఁ జాలవు కదా!

మేము జయంతమందిరము సమీపించినంతనె యొకసంతోష వార్త వింటిమి. అదేమన శిరీషకుమారి కించుక స్వస్థత కలిగినదనియు నందుచే నామె హత్యాదినము రాత్రి జరిగిన విషయమంతయు చెప్పు నున్నదనియు నందుకై యారక్షక సర్వాధికారియు, మేజస్ట్రీటుగారును అపరాధ పరిశోధకాధ్యక్షుఁడును వచ్చియున్నారనుటయే.

ఈవార్త విన్నంతనే బలసూదనుని మోమున సంతోషవికాసము లుదయించెను. రక్షక శాఖాధికారియు మేజిస్ట్రీటుగారును విచ్చేసియుం డుటచే ద్విజేంద్రుఁడు తనపరిశోధనా సారాంశముల వచించియే తీర వలయుఁగదా! అతని పరిశోధనాపథము స్వీయఃపథము ననుసరింపక భిన్నముగునెడ తానే యీకార్యమును సాధించిన జగన్నుత సత్కీర్తి ధన మతని పాలగుటటుండ ద్విజేంద్రునంతటి పరిశోధకాగ్రణికి సైతము పరిశోధనాశేముషీయందు మీరినసంతసముసైతము చేకూరఁగలదు. శిరీషసాక్ష్యము రహస్యదుర్గభేదనమున కెట్టిసాయమును నొనర్పఁజాల దని యాతని దృఢవిశ్వాసము. తనజనకునికిసైతము తెలుపనిరహస్యము శిరీష రక్షకశాఖాధికారులకు తెలుపునా! ఒకవేళ తెలిపినను నయ్యది ద్విజేంద్రబలసూదను లిరువురి శేముషీ ప్రకటనమునకును నంతరాయము కల్పించుఁగదా!

హత్యజరగిన మఱుదినమే శిరీష బహిర్గృహమునుండి భవనము నకు కొనిరాఁబడెను. కావున ప్రస్తుతవిచారణయునందే ప్రవర్తిల్ల వలయు. శిరీష యింకను నపాయస్థితియందుండుటచే రాజకీయోద్యోగు లామెసాక్ష్యము నామె శయనాగారమునందె గ్రైకొనుచుండిరి.

అంబికాచరణుఁడు మాకై భవనద్వారముచెంత వేచియుం డెను. అతఁడే మాకీవిషయములన్నియు వచించెను. పిదప మేము ముఖ్యద్వారము లోన ప్రవేశింప రక్షకభటులు మాయిరువురి ప్రవేశమునకు సమ్మతింపరైరి. అంబికాచరణుని మాత్రము లోనికివచ్చుట కాజ్ఞయైన దనియు విచారణసమయమున తనయనుమతిలేక నెవ్వరిని లోపలికి పోనియ్యకూడదని యధికారులు తమకు కఠినమైన యాజ్ఞనొసంగియున్న వారనియు నందుచే మమ్ము నిరోధించుటకై క్షమింపవలయుననియు వచించిరి.

బలసూదనుఁడును విధిలేక యంబికాచరణునిగాంచి "నీవు మాత్రము లోపలికి పొమ్ము. అయిన నాకొఱకై శ్రమకైనను సహించి విచారణ సమయమున జరుగునదంతయు వ్రాసికొనిరమ్ము. నీకముఖ్య ములని తోఁచిన విషయములు సైతమునాకు ప్రాముఖ్యములే యని మాత్రము మఱవకుము పొమ్ము. అలస్యమొనర్పకు" మని నేఁడెను. అతఁడును వల్లెయని వెడలిపోయెను.

మేమున్నగది గవాక్షమునుండి పరికింప యెదుటనున్నగదిలో విమర్శకోద్యోగుఁ ప్రవేశించియుండుట నూహింపగను. ఒక్కసమునదితా ననమున, ఆరక్షకసర్వాధికారి యుపవేశించి యుండెను. అతని ప్రక్కను మేజస్ట్రీటుగారు కూర్చుండియుండిరి. అతనికి కొంతదూరమున నొకబల్ల ముందతనిలేఖకుఁడు వ్రాయుటకు సంసిద్ధుఁడై కూర్చుండియుండెను. మూర్తీభవించిన శోకదేవతయోయున వెలరారు పంచాననబాబు కట్టె దుటనున్న యున్నతోద్యోగులవంక పిచ్చిపట్టినవానిచందమున తిల కించుచు నుపవేశించియుండెను. వసంతుఁ డతనిచెంత నిలిచియుండెను. అంబికాచరణుఁడు నాతనిప్రక్కనే కూర్చుండి యుండెను.

# ఏడవ ప్రకరణము

అంబికాచరణుఁడు హత్యాపరాధ విచారణ సమయమున విషయము లన్నియు మామిత్రునికిఁ దెలుపవెడలియుండుట పాఠకు లెఱుంగుదురు. అతఁడు తానే యాయంశముల వ్రాయఁజాలక మేజస్ట్రేటుగారి విలేఖరిని ప్రార్థించి యాతఁడు విచారణ సమయమున వ్రాసినకాగితముల నామిత్రుని కొసంగెను. నేనే యావిషయముల వ్రాయుటకన్న యా వ్రాఁతప్రతియే యిందుఁ బొందుపఱచియున్నాను. కాన, నందలి గుణాగుణములు విలేఖరివిగాని నావి కావని పాఠకులు తలంతురుగాక.

"శిరీషకుమారి కింకను సంపూర్ణముగ స్వస్థత యలవడనందున నామెకు విశేషశ్రమ యొసంగుటకు వైద్యుఁడు సమ్మతింపలేదు. కావున వాగీశదత్తు ముఖ్యాంశములమాత్ర మామెను ప్రశ్నించి తెలిసికొనవలసివచ్చెను. ఆప్రశ్నోత్తరము లీక్రింద వ్రాయఁబడియున్నవి:

మేజ : కుమారీ! నీ కింకను సంపూర్ణముగ స్వాస్థ్యము కలుగకున్నను నీరహస్యాపరాధ గభీరసాగరమున నిమగ్నులమై దరిఁగానకున్న మేము నీశ్రమకైన నియ్యకొని నీసాయ మపేక్షించుచున్నారము. కాన, నాప్రశ్నలకు సాధ్యమైనంత సదుత్తరములొసంగుము. హత్యోద్యమదినమున నీతండ్రిని వీడి నీగది ప్రవేశించినపిదప నీవు కవాటమును లోపల బంధించుటయేగాక తాళముసైతము వేయకారణమేమి? నీ వెప్పుడును నట్లే యొనర్చుచుందువా?

శిరీష : నాకు దేవరపిల్లి వికృతనినాదము విన్న మిగుల భీతి జనించెడిది. హత్యోద్యమము నాఁటిరేయిసైతము మా భయంకరశబ్ద

మూలకమందుటచే భీతిల్లి నాజనకునకు వచించిన, నన్నుహాస్యమొనర్తురేమో యని శంకించి కవాటముల జాగ్రత్తగ బంధించికొంటిని. వసంతునికి తెలుపకనే యాతనిపిస్తోలుకూడ గదియందు నాచెంత నుంచుకొనియుంచుటయు నందుకొఱకే.

మేజ : అట్లు కవాటములు బంధింపఁబడిన తరువాత నేమి చేసితిరి ?

శిరీష : నా శయ్యనుఁ జేరి శయనించితిని.

మేజ : అట్లెంతకాలము శయనించితిరి ?

శిరీష : దాదాపు ఒకగంటకాలము శయనించితిని. అంతట నాపర్యంకము క్రిందిభాగమునుండి యేదియో యొక మనుజాకారము వెలువడి యాకస్మికముగ నాపైఁ బడుటచే నాయాకృతి యొకహస్తము నుండి తప్పించుకొనయత్నించి నాయాపచ్ఛక్తిని వినియోగించుచు లేచితిని. ఆచీఁకటియందే యిద్దరము పెనఁగులాడితిమి. ఈమధ్యమున నేను, మేజాడ్రాయరునుండి పిస్తోలును దీసి హంతకునిపై కాల్పయత్నించితిని. అంతట హంతకుఁడు పిస్తోలును ధరించిన నాకరమును తన కరముచే పైకెత్తి యూర్ధ్వభాగమున నిలిపెను. నేను గుఱి తప్పునని శంకింపక పిస్తోలును కాల్చితిని. హంతకుఁడు నా సాహసము గాంచి తన చేతియందున్న యొక నిశితాయుధమున నాకణతపై బలాత్కారముగ పొడిచెను. నేను మూర్ఛ నందితిని. అటుపిమ్మటివిషయము నాకు తెలియదు.

మేజ : హంతకుని యాకార మేమైన కొంచెమైనను పోల్పఁ గలవా ?

శిరీ : అప్పుడంతటను నంధకారముగ నున్నందున హంతకుని యాకార మిట్టిదని పోల్పనలవికాదు. ఇఁక నన్నేమియు ప్రశ్నింపకుఁడు.

అంతట శిరీష వాఙ్మూలము మూగిపోయెను, ఎల్లరిదృష్టులు మిక్కిలి యూశచే రహస్యభేదనమునకు దారిదొరకునని, యే బాలిక వాఙ్మూలముపై ప్రసరించియుండెనో, అట్టివాఙ్మూల మిప్పుడు విగతప్రయోజనమై విరమింపఁబడుటచే జనవర్గములనిరీక్షణ మంతయు విఫలమై వెనుదిరుగ వలసివచ్చెను.

అంతట విచారణ ప్రారంభింపఁబడియెను. అధికారివర్గమంతయు కార్యక్రమము నడుప కడుజాగరూకమైయుండెను. ఇందు మొదటి సాక్షిగ వసంతుఁడు సాక్ష్య మియ్యవలసివచ్చెను. అతఁడీవిధముగఁ దెలిపెను.

హత్యోద్యమము నాఁటిరాత్రి తనయజమానునితోఁ గూడి రసాయన పరిశ్రమాగారమున పనిచేయుచుంటిననియు శిరీషకుమారి యార్తనాదము విని తానును తనయజమానియు నందేఁగితిమనియు తెల్పి మిగిలిన విషయమంతయు మేజస్ట్రీటుగారు బలసూదనబాబుతో తెలిపినరీతి తెలిపెను. దాని మరల నిందు వ్రాయుట యనవసరము గదా! రెండవ సాక్ష్యముగా కౌముదియు కందళుఁడును పిలువఁబడి వారి వాఙ్మూలము గైకొనఁబడియెను.

మేజ : మీ రంత యాలస్యముగ మొదటిమాఱు పిస్తోలు గాల్చఁనధ్వని వినియు రెండవపిస్తోలుధ్వనిని వినెడివఱకు శిరీషగది చేర కుండుటకుఁ గారణమేమి?

కౌ : మేము పిస్తోలుధ్వని వినినతోడనే వచ్చితిమి.

మేజ : మీరు తొలుతపిస్తోలుధ్వనిని విననేలేదా?

కౌ : వింటిమి.

మేజ : అయిన మీరు పిస్తోలు ధ్వని వినినతత్క్షణమే రాక మీకై వచ్చుచున్న సేవకుఁడు వచ్చువఱ కాలసించి దారిలో నతని

నెదుర్కొనుటకు కారణమేమి? రాత్రియందైనను సిట్టియుకాలోచిత వసనముల ధరించుటకును గారణమేమి?

కౌ : వనమృగముల చోరులేమైన నపహరింతురేమోయని వన మంతయు తిరుగుచున్నందున దూరమునయున్న మేము వచ్చుట కాలస్య మయ్యెను. ఇంతలో సేవకులును వచ్చెను. వాని కలిసికొని మే మందు చేరితిమి.

మేజ : రాత్రిపు దుస్తులు లేక మంచియుడుపుల ధరింపఁ గారణ మేమి?

కౌ : మే మింకను వనరక్షణమున దిరుగుట మానకయుండినను ఇంకను శయనింప పోవకున్నందునను రాత్రిదుస్తులు ధరింపలేదు. మొదట ధరించిన వస్త్రములతోడనే యుంటిమి.

మేజ : అయిన మీరు పిస్తోలుధ్వని వింటిరా?

కంద : వింటిమి.

మేజ : నీ వసత్యము వచించుచున్నాఁడవు. మే మంతయు పరీ క్షించితిమి. హత్యాగదిక వాటము లన్నియు మూసి వసంతునిపిస్తోలును కాల్చితిమి. కాని యాశబ్దము మీగృహమున పరీక్షించుటకై నిలిచిన రక్షకభటులకు వినఁబడ లేదు. కాన, మీరు పిస్తోలుధ్వని వినివచ్చుట యసత్యము. మీ రట్టిరాత్రివేళ యందేలయుంటిరి. చెప్పుడు. మీ రేమై నను పరికించితిరా?

కౌముదీకందభటులు తమకేమియు తెలియదనియు తాము వచించి నది సత్యమనియు వచించుటతప్ప నింకేమియు వచింపరైరి.

పిదప పంచాననబాబు సాక్ష్యమునకు పిలువఁబడెను. మేజ స్ట్రేటుగారు పంచాననునితో "ఆర్యా! మీరు తండ్రి కుమారికలు.

సదాకాలము నెడబాటులేక కలసి చరించుచుండుటవలన హత్యాప్రయత్నమునాడును నామెతోడనే కలసి పరిశ్రమాలయమునను, ఇతర కార్యములయందును చరించియుండవలయును కాన నాటివిషయముల నన్నిటిని తెలుపు" డనెను. దానికి పంచాననుడీవిధముగ సాక్ష్యమిచ్చెను.

"ఆ దినము సాయంకాలము 5 గంటలవఱకు రసాయనపరిశ్రమ యొనర్చుచుండి చాలించి కొంచెము విశ్రాంతిఁ గొనుటకై వాహ్యాళి వెడలితిమి. వెళ్ళిన వార మొకగంట పరిమితకాలముననే మరల యింటికి వచ్చితిమి. వెంటనే రసాయనపరిశ్రమ యొనర్ప ప్రారంభించునంతలో నుద్యానకాననపాలకుఁడగు "మదనమోహనసింగు" వచ్చి వనమందలి పక్షిజాలములసంఖ్య దినదినమునకు తక్కువయగుచున్నదనియు దీని రక్షణమున జాగ్రత్త వహింపవలసియున్నదనియుఁ దెల్పుచు కొంత కాలమువఱకు ముచ్చటించుచుండెను. అప్పటికి భోజనసమయము సమీపించుటవలన భోజనపదార్థముల నిక్కడకే తెమ్మని వంటవానికి మదనమోహనునితో చెప్పి పంపితిమనియు నట్లొనర్పబడగనె అందఱమును నాపూటనందే భుజించితిమనియు చెప్పి ప్రవర్తిల్లిన యుదంతమంతయు చెప్పెను. అదియంతయు పాఠకులకు తెలిసిన విషయమే కాన నిందు వ్రాయునక్కఱలేదు.

ఇంతలో నారక్షకభటుఁడొకఁడు లోపలికివచ్చి "ద్విజేంద్రలాలుగారు పరిశోధకాధ్యక్షులు లోనప్రవేశింప ననుమతిని వేఁడుచున్నా" రని విన్నవించెను. మేజస్ట్రీటుగారందులకు సమ్మతించిరి.

అంతట శ్రీయుత ద్విజేంద్రలాలుగారు కరమున రెండుపాదరక్షలను (బూట్సు) తీసికొని లోనికేతెంచెను! మేజస్ట్రీటుగారు "ఆ పాదరక్ష లెవరివని" ప్రశ్నించెను. ద్విజేంద్రుఁడు హంతకునివని ప్రత్యుత్తరమిచ్చెను. ఆ బూట్సు తడిసియుండెను. ఇంకను నీటిబిందువులు క్రింద పడుచు నేయుండెను. వానినిని వసంతునిముందు పాఱవేయుచు "వసంతా!

ఇవి యెవరిపాదరక్షలు? కనుఁగొనుము." అని సమందహాసముగ నుడివెను. అందుకు వసంతుఁడు కొంతకాలము నోటమాటరాక నిశ్చేష్టితుఁడై యుండ ద్విజేంద్రుఁడు "వసంతా! నీవు నిరపరాధివి. భయపడకుము." అనియెను.

అంతట ఆరక్షకశాఖాధ్యక్షుఁడు "ద్విజేంద్రలాలుగారూ! తమ పరిశోధన పరిశ్రమ హంతకుఁడు మాయమగునట్టి రహస్యము నేమైన భేదింపఁగల్గెనా?" అని ప్రశ్నించెను.

ద్విజ: ఆర్యా! హంతకుఁడు మాయమైన విషయము స్వాభావికమైన సామాన్యవిషయము. చిరకాలమునుండి జయంతిమందిరమున వసించుచున్న అంబికాచరణులుగారు 25 వ తేది రాత్రిన్నే అదివఱకు వేఱొకచో నివాసమేర్పఱచుకొని యెచట కేఁగిరో, ఎందుకై యేఁగిరో తెలియదు. ఇదియుఁగాక నీ 25 వ తేదికి మూఁడురోజుల క్రిందట తానెల్లప్పుడు జయంతిమందిరమునను యుంచుచుండిన బైసికిలు నెందుకు తీసికొని పోయెనో సందేహాస్పదముగ నున్నది.

మేజ: అంబికాచరణులుగారూ! 26 వ తేది రాత్రి తా మెందేఁగియుంటిరి?

అంబి: బొంబయికి పోయియుంటిని!

మేజ: ఏ కార్యార్థమై వెళ్లియుంటిరి?

అంబి: అది యొరులకు చెప్పరాదు. నే నొక యత్యావశ్యక కార్యముకొఱకై పోయియుంటిని.

మేజ: ఇతరుల కెవ్వరికిని చెప్పనట్టి కార్యమా యది?

అంబి: అవును. ప్రస్తుత మట్టిదియే యా కార్యము.

మేజ: సరియే. ద్విజేంద్రలాలుగారూ! హంతకుఁ డేవిధముగ శిరీషగదినుండి తప్పించుకొనిపోయె నని మీ యభిప్రాయము?

ద్విజ : స్వాభావికమార్గముననే తప్పించుకొనియెను. ఆ గది కవాటముగుండ వెడలిపోయెను. శిరీష యార్తధ్వనివిని పంచానన వసంతులు ఆ మెగది చెంతకు పోయిరి కదా! అట్లుపోయినతరువాత హాంతకుఁడు నిర్భయముగ తలుపు తెఱచుకొని పంచాననబాబుగారి సమ్మతినే ఆయనకు తెలిసియే వెలుపలకు చనియెను. పంచాననబాబు గారికి హాంతకుఁ డెవ్వఁడైనదియు ఎట్లు మాయమైనదియు తెలిసియుండి యును ఇదివఱ కితరులకు తెలుపకుండుట చూడ హాంతకుఁడీయనకు నాంతరంగిక పరమాప్తుఁడని తెలియవచ్చుచున్నది. మఱియు తనకు తెలిసి తనసమక్షమునని యతని పోవనిచ్చుటయు పై యభిప్రాయమును దృఢీకరించుచున్నది. హాంతకుఁడు పంచానన బాబునకు పరమాప్తుఁడు కాకున్న తనయేకపుత్రికను సంహరింప యత్నించి యామెగదిఁ ప్రవే శించి బాధించి వెలువడి చనుచున్నవాని నూరక వదలిపుచ్చునా ? కాన తనకు తెలిసియుండియు వెలిపెట్టకుండుటకు హాంతకుఁడు పర మాప్తుఁడగుటవలనను నతని పేరు వెలిపెట్టిన నతనికి రాజదండనము లభిం చుటయుండ తనసముంచిత గౌరవకులీనతకు హాని కలుగునని యెంచుట వలనను విషయమునంతను కడు రహస్యముగ మఱుఁగుపఱచెను. అయిన హాంతకుఁడు ఎట్టిసమయమున తనకనుకూల సమయమని యెంచి తప్పించుకొనియె నని మీరు నన్నడుగవచ్చును.

హాంతకుఁడు తప్పించుకొనుటకు సమయములు నాలుగుమాత్ర మనుకూలములై యున్నవి. అందు మొదటిది శిరీషయార్తధ్వని విని పంచానన వసంతులు ఆయమగది చేరినసమయము. రెండవది వసంతుఁడు "గవాక్షద్వారమునుండి గదిలోనఁ బ్రవేశించుట కనువగునా! యని చూచుటకై వెడలియుండెఁగదా ! అదియే పంచాననుఁ డొంటిగనుండినం దున తగినసమయము. మూఁడవది వసంతుఁడు తమకు సహాయమున్నకై

కౌముదీకందళులఁ గొనిరా నేఁగిన సమయము. నాల్గవది పంచాననుఁడును వసంతకౌముదీ కందళులతోఁ గూడి కవాటముల భేదించి లోని కరిగి వారి సహాయమున క్రింద మూర్ఛాక్రాంత యైయున్న శిరీషను పాన్పుపై పరుండఁబెట్టు గండరగోళసమయము.

ఈ నాల్గుసమయములలో మొదటి సమయమున నిరువురే ద్వారముకడ నుండిరి. రెండవసమయమున నొక్కఁడే ద్వారసీమ నుండెను. మూఁడవసమయమున నలుగురు ద్వారమున నిలిచియుండిరి. నాల్గవసమయమునను నలుగురే మనుజు లుండిరి.

వీనిలో నేసమయమున నొక్కఁడుమాత్రమే ద్వారముకడ నుండునో, ఆసమయమే హంతకుఁడు వెలిఁబోవుటకనువైన సమయము. అట్లొక్కఁడుండుసమయ మేది? రెండవసమయమే. అదివసంతుఁడు గవాక్షముగుండ లోనఁ బోవుటకు చూడ నేగినప్పుడు పంచాననుఁడు మాత్ర మొక్కఁడుండు ననుకూలసమయము. ఆసమయముననె హంతకుఁడు పంచాననుఁడొక్కఁడున్నను నతఁడు తన్నుఁజూచినను గుఱుతించినను భయముండదని తలఁచి ద్వారము తెఱచికొని బయటికి వచ్చెను. అతనిమోము చూచి నివ్వెఱపడి మానసమున మిగుల ఖేదపడి చేయునదేమియు లేక స్వగౌరవమును నిలుపుకొనుటకై పంచాననుఁడు నపరాధిని వెలిఁబోనిచ్చెను. హా! ఏకులకు సాధుము నప్పు నట్టివానిచే బాధింపఁబడిన యీవిధమైన జగతి నుండునే! ఎవఁడును తన యేకపుత్త్రికాహింసకుని యుపేక్షసేయువాఁడగునే? అయిన మీరొకటి ప్రశ్నము గనవచ్చును. అట్లు గడిద్వారము తెఱచికొని బాహిరపడిపోయిన హంతకునిఁ గాంచినను సులభముగ తెఱవఁబడిన యీద్వారమునుండి తాను లోనఁ బ్రవేశించి తనకనుమానము రాకుండ వసంత కౌముదీ కందళులతో కలసి కవాటముల నుద్ఘాటనము నొనర్చు కారణ

మేమని, నాకుఁజూడ నిదియంతయు వసంతుఁడాది మనలనందఱిని భిన్నాభిప్రాయులుగఁ జేయనెంచిన కపటతంత్రము కాని వేఱుకాదు.

ఈ వాక్యమును విన్నతోడనే పంచాననుఁడు మోము వెలవెల బార స్తబ్ధుఁడయ్యెను. కొంతకాల మటులుండి పంచాననుఁడు తనకు హంతకుని విషయమేమియును తెలియదనియు, ద్విజేంద్రుఁడారోపించిన నిందకు నసోహమైనదనియు, హంతకుఁడు కవాటముగుండా తనకు తెలిసి తన సమక్షమున నే పోవ లేదనియు నిది సత్యమనియు దృఢముగ గద్గదస్వరమున శోకవివశమానసమున పెదవులదర సర్వాంగములు చలింప కన్నీటిబిందువులు దృష్టినిరోధ మొనర్చుచుండ నుడివెను. అది గాంచిన వారెల్ల రాతని జాలింగొలుపు దుస్థితికై యాతని దుఃఖమున పాలుపంచుకొనిరి.

అయిన పంచాననునిస్థితి మేజస్ట్రేటుగారికిని ఆరక్షకాధికారికిని సైతము జాలిఁగొలిపెను. కాని, హంతకుఁడు మాయమగుటకు వేఱు మార్గమేదియు కానరానందునను ద్విజేంద్రుఁడు వచించినరీతిని కవాటములు తెఱచికొనియే పంచాననునకు తెలిసియే హంతకుఁడు పోయి యుండునని తలంచినందునను నిదివఱకు లోకముచే వేదవాక్యముగ గౌరవింపఁబడు చుండిన పంచాననునివాక్య మప్పుడంతతథ్యము కాదని వారుతలంచిరి. పిదప మేజస్ట్రేటు పంచాననునిఁ జూచి "నీకేమైన కౌముదీకందళులపై ననుమాన మున్నదా?" యని యడిగెను.

పంచా: వారు నాకు మిగుల విశ్వాసపాత్రులు. కాని హత్యాదినమురాత్రి వారు సహజముగ రాత్రికాలోచిత వసనముల ధరించి యుండినందున కొంత యాశ్చర్యమును కొంతయనుమానము కలుగు చున్నది. అయినను సంపూర్ణముగ వారే హంతకులను లేక సహాయకు లని యభిప్రాయమును ననుమానమును లేదు.

మేజ : ఇప్పటికి హంతకుఁ డెట్లు శిరీషశయన నిశాంతమునుండి తప్పించుకొనియెనో మనకు తెలిసెఁగదా? ఇఁక నిట్టిహత్యోద్యమమున కుద్దేశ మేమో కనుఁగొనవలయును. ఈహత్యా ప్రయత్నమునకు చౌర్యము ఉద్దేశము కాదు గదా?

ఈ వాక్యము నింకను మేజస్ట్రీటుగారు ముగించుటకు పూర్వమే రక్షకభటుఁ డొకఁ డరుదెంచి ఆయన కొకచిన్న కాగితము నిచ్చెను. దానిని మేజస్ట్రీటుగారు చదువుకొని,

మేజ : ఇట్టి సాహసమునకుఁ బూనినవాఁ డెవఁడు! బుద్ధిచాలని వానివలె గానిపించుచున్నాఁడు.

ఆ॥శా॥అ : విషయమేమియోఁ దెలుప ప్రార్థించెదను.

మేజ : ఎవరోయొకరు చౌర్యముకూడ హత్యోద్యమమునకు నొకయుద్దేశమని వ్రాసి చీటిపంపియున్నాఁడు. అనినుడివి రక్షకభటుని వైపుచూచి "నీ కెవ రీ చీటి నిచ్చిరి." అనియెను.

ర-భ : ఒకగౌరవయోగ్య మనుజుఁడు. దీనిని తమ కిమ్మని నాచేతి కిచ్చెను.

ఆ-శా-అ : అయిన నతని లోనికి రానిండు అతఁడేమి చెప్పునో? తన వ్రాసిన విషయము నెట్లు నిర్ధారణపఱచునో కనుఁగొందము.

మేజ : మంచిది నీవు అతనిని లోనఁ బ్రవేశపెట్టుము,

అని యాజ్ఞయొసఁగఁగనె భటుఁడు బలసూదనుని కొని విచారణ స్థానమునఁ బ్రవేశపెట్టెను. అతని గాంచినంతనె మేజస్ట్రీటుగారు "మే మీతని నిదివఱకు చూచియున్నాము, మే మిచ్చటికి వచ్చునపుడు బొంబయినుండి బ్రైండరుస్టేషనున కితఁడును వచ్చువాఁడై ధూమశకటమున మే ముపదేశించినబండినే మాయనుమతి వడయకయే సాహస

నెక్కినవాఁడు" అనినుడువుచు బలసూదనుఁ గాంచి యిట్లనెను.

మేజ : ఓహో ! మీరా ? మీరిప్పుడు వ్రాసిపంపిన చౌర్యము హత్యా ప్రయత్నోద్దేశ మనువిషయమును సకారణముగ నిర్ధారణ పఱుపఁగలరా ?

బల : చాలినంత నిదర్శనములచే నిర్ధారణపఱుపఁగలను అని ప్రత్యుత్తర మొసగి "పంచాననునిఁ గాంచి మహాశయా ! 22 వ తేది యందు మీ యినుపపెట్టెయొక్క తాళముచెవిని పోఁగొట్టికొని యుండిరా ?" యని ప్రశ్నించెను.

పంచా : ఆ తాళముచెవి యెప్పుడును నా కుమారి శిరీష యొద్దనే యుండుటవాడుక.

బల : ఇప్పు డా తాళముచెవి యామె చెంతనున్నదేమో విచారింపుడు.

పంచ : ఆయమ దానిని పోఁగొట్టుకొంటి నని చెప్పుచున్నది.

బల : అయిన ! దీని నింత పరికింపుఁడు." అని మేజస్ట్రీటుగారి ముందు అమృతబజారు పత్రిక యందలి ప్రకటనము నునిచెను. దాని యం దీరీతి నుండెను.

ఇరువదిరెండవ తారీఖున నొక ఇత్తడి బీగముచెవి వెండి ముఖముకలది యెచ్చటనో పోయినది. దొరకినవారు దానిని నా విలాసమునకు పంపిన వారికిచక్కని బహుమతి యొకటి యొసఁగఁబడును.

పోస్టుబాక్సు 40 † పోస్టుమాస్టరు. ప.

అని ప్రకటింపఁబడి యుండెను శి—కు—అనంతరము బలసూదనుఁ డీ రీతి చెప్పఁదొడఁగెను.

నేను 22 వ తేది సాయంత్రి మీ ప్రకటనమును చదివినంతనె దీనివిషయమై నాకు పరమాశ్చర్యము కలిగెను. ఇత్తడితాళముచెవి కొంచెము మాత్రము ముఖమున వెండిని పొదిగియుండినంతనె దాని

విషయమై పోఁగొట్టుకొనినవా రంత ప్రయాసపడి పత్రికలయందు ప్రకటించినదాని నొసఁగినవారికి బహుమతి నొసఁగుట మననేల? ఇది యంతయు చూడ, నా తాళముచెవి మిక్కిలి ప్రాముఖ్యమందినదని నాకుతోఁచెను. అంత పోఁగొట్టుకొనినవా రెవరై యుంకురని యోచించితిని. ప్రకటనమునందలి —ప—శి—కు— అనెడి నామాదిసంపుటాక్షరములచే వారిపేరు సంపూర్ణముగ దురూహ్యమైనందున, నప్పటికా యోచనను మాని దానియనుసంధాన సమయమును నిరీక్షించుచుంటిని, నాకు దానివిమర్శన మత్యావశ్యక మై యుండెను- మొన్న 25 తారీఖున, శిరీషకుమారి హత్యోద్యమ విషయము పత్రికాముఖమున ప్రకటింపఁబడి యుండుటను గాంచినపిమ్మట నాఁడు 22 తారీఖునందున ప్రకటింపఁబడిన ప్రకటనమందలి —ప—శి—కు— అను సంపుటాక్షరముల కర్థమును తెలియఁగల్గితిని, హత్యాప్రకటనమందు "పంచాననబాబు పుత్రిక శిరీషకుమారి" యను మొదలు గాఁగల విషయములఁ జదివియున్నందున పంచాననశబ్దమునకు "ప" యనియు శిరీష యనుటకు "శి" యనియు కుమారి యనుటకు "కు" అనియు ననుసంధానించితిని. తోడనె నాకొక యూహ పొడమ నేను పోస్టాఫీసునకు వెళ్ళి యందలియుద్యోగిని, పోస్టుబాక్సు 40 పోస్టుమాష్టరు పైవిలాసమున కేమైన జాబు వచ్చినదా" అని యడిగితిని. అందున కాతఁడు విసిఁగికొనుచు "ఎందఱికని నేను ప్రత్యుత్తరమిత్తును? నేఁటిప్రాతఃకాలముననె యొక రీపై విలాసమున కేమైనపత్రిక వచ్చినదా యనియడిగిచనియెను. మొన్న 23 వ తేదియందు ఒక స్త్రీ ఈ పై విలాసమున వచ్చిన జాబుకొఱకే వచ్చి అట్లు వచ్చియున్న జాబును కైకొని వెడలిపోయెను. ఇపుడు మీరు వచ్చి యదేరీతిగ నదేజాబు నడుగుచున్నారు. ఇది మాకు చాల కష్టముగ నున్నది." అనియెను. ఈ సల్లాపముల నాలించి నే నొకింత చమత్కృతుఁడనై యతనితో "ప్రాతఃకాలమున

జాబునకై వచ్చిన మనుజుని యాకారమును దయయుంచి చెప్పఁగలరా!” యని యడిగితిని. ఉద్యోగియు కొంచె మించుమించుగ నంబికాచరణులు గారి యాకారమును బోలిన మనుజునిపోలికఁ దెల్పెను. అంతట నే నా జాబును గొనిపోయినస్త్రీ యెవరై యుండురని యోచింపకయే శిరీష కుమారియని తెలియుట సులభసాధ్యముకదా! అయిన శిరీష తాను పోఁగొట్టికొనిన తాళము చెవి విషయమును తనతండ్రికి చెప్పకుండుట కేమికారణమని యోచించి యాయుదంతము తండ్రి వినిన మనో వ్యాకులత నందుననియు, తానే మరల దానిసంపాదించిన మేలనియు నెంచి శిరీషకుమారి యిట్లు తన జనకునకు నీ విషయము వచింపలేదని నిర్ధారించితిని. నేను ప్రకృతహత్యాపరాధ విమర్శనమునకై జయంత మందిరమును పరిశోధింప నేఁగినప్పుడు రసాయన పరిశ్రమాలయమున నున్న యనుపమందసమునకు తగుల్పబడియున్న యాతాళముచెవిని గాంచితిని. అది వార్తాపత్రికయందు వర్ణింపఁబడిన తాళముచెవిని బోలి యుండెను. కావున నాకది యాశ్చర్యకారి యయ్యెను. శిరీషచేఁ దప్పి పోయిన తాళముచెవి యింతత్వరలో నిచ్చట నగపడుట కేమికారణ మనియు ఇట్టి మిక్కిలి ముఖ్యమైన తాళముచెవి నిందుంచియుండుటకుఁ గతమేయ్యది యనియు యోజించితిని. అటుపిమ్మట పత్రికాప్రకటిత మైన తాళముచెవినిఁ బోలినతాళముచెవి మఱియొకటి పంచాననుని యొద్ద నుండఁగూడదా యనియు నొకసమాధానము తోఁచెను. అయి నను నిప్పుడు పంచాననబాబుగారి వలన నట్టి తాళముచెవి యొక్కటియే యుండునదియని తెలియనయ్యెఁగదా!

ఈ విధముగ బలసూదనుఁడు చెప్పుచుండ మేజస్ట్రీటుగారు,

మేజ: ఈవిషయ మేమో విస్మయమునే కలిగించుచున్నది. కాని యనుపమందసమున నేదియేనివస్తు వపహరింపఁబడియెనా యని పంచాననునుండి తెలియవలయును.

అందఱును పంచాననుఁ డుపవేశించియున్న తావునకు తమమనమున మూలికల ప్రసరింపఁజేసిరి. కాని, యచట పంచాననుఁడు లేఁడు.

ఇంతలో పంచాననుని యాక్రోశధ్వని వినవచ్చెను. అందఱును మరల నేమి సంభవించెనో యని యాతఁడున్న ప్రదేశమునకు వెడలిరి. అతని యాక్రోశధ్వనికి కారణ మారయఁడు పంచాననుఁడు దానికింతవఱకు తనజీవితమును ధారవోసి కనిపెట్టిన యీరసాయనశాస్త్రమునందలి నూతన విషయములను ప్రపంచమున కెఱింగించి యుండినచో నగణ్యమైన సత్కీర్తిని నార్జించి తనజన్మమును సార్థకత నొందింప నెంచి యుండెనో, యట్టి యమోఘతరములైన రసాయన పరిశ్రమ ఫలములను లిఖించి కాగితములన్నియు మందసమున నుంపబడియుండ నెవరిచేతనో యపహరింపఁ బడియెనని కడు శోకగద్గదస్వరమున నుడివెను. నాసర్వసంపదను నపహరించి యుండినను నేను చింతించుచుండ లేదనియు తనజీవితమే నేఁటికి చనియెననియు నాతఁడు నుడివెను. మే మావిషయ మెంతవఱకు సత్యమో కనుఁగొనవలయునని రసాయనాలయమునకు పోయి చూడ పంచాననుని వాక్యరీతి యథార్థమై మాకు కన్పట్టెను. ఇనుపమందస మంతయు శూన్యమై ప్రకృతము పంచాననుని మానసముఁ బోలెఁ విపర్ణమై యుండెను. దానియందే యిపుడు బలసూదనుఁడు వర్ణించిన తాళముచెవి యున్నవిషయముల మాపలుకు నుద్బోధించుచుండెను.

అంతట బలసూదనుఁడు మమ్మెల్లర మనకు పూర్వపరిచితమైన జయంతమందిరమున నున్న యనుపయోగవస్తువు లుంచఁబడిన చిన్న గదికి పిలిచికొని పోయెను. అందు మన కామందిర పరిశోధనసమయమున నిదివఱలో కనుపించిన యుచ్ఛాకృతి కలిగినగుఱుతునే మేజస్ట్రీటు మొదలగువారికి కనుపఱచి యిట్లనియెను. "హంతకుఁడే నుపమందస మందలి కాగితముల నపహరించి యాకాగితముల నెల్ల కట్టఁగట్టి తనయొద్ద నిడుకొని యీగదిఁ జొచ్చి తనబూట్సును వదలి వేఱొకబూట్సును

ఘరించుటకై తాఁదెచ్చిన వస్తువును నిచ్చుటనుంచినటుల నీగుఱుతు చెప్పఁచున్నది, తిలకింపుఁడు” అని చెప్పెను.

ఇంతినఱకు నితఁడు సామాన్యమనుజుఁ డనియు శేముషీవిహీనుఁడనియు నెంచఁబడుచుండిన బలసూదనకుమారుఁడు-ఇపుడు కనుపఱచిన లోకాతీతబుద్ధికౌశలమును గాంచి యెల్లరు నతనిమేధాధనమునకు పరిశోధనసాండితికి మిక్కిలి మెచ్చుకొనసాగిరి.

అంత బలసూదనుని వివేచనవలన హత్యాప్రయత్నోద్దేశము లలో చౌర్యముకూడ నొకటి యని నిర్ధరింపఁబడియెను. పిదప నా మిత్రుఁడు పంచాననుని సమీపించి “సుత్యచారిత్రా! తాము నిరపరాధులు. ఆవిషయమున నా కత్యధికవిశ్వాసమును భక్తియు తమపై కలదు హంతకుఁడు శిరీషగదిద్వారమునుండి వెడలిపోవలేదు. ఆవిషయమై తమపై నావరించిన యపవాదమహిమము కడు నపోహమని నే నొక్కివక్కాణించెద” అని పలికెను. బహుశః ద్విజేంద్రుఁడు పంచాననునిపై నారోపించిన యపనిందాపరంపరయు, నతఁడు నిర్ధరించిన హంతకుఁడు శయనమందిర ద్వారమునుండి చనియె ననునిర్ధారణమును నా సఖునకు వెలుపటినుండియే బుద్ధి గోచరించియుండును కాఁబోలు నాఁటివిచారణ యింతటితో ముగిసెను.

నేను నీవిచారణ లోన జరుగుచున్నకాలమున వెలుపల నుపవేశించి యచ్చటియుదంత మేమియో నామిత్రుఁడు వచ్చినంతన యడిగి తెలిసికొనవచ్చునని యుంటిని. ఇంతలో నామిత్రుఁడును అంబికాచరణుఁడును చనుదెంచి నన్ను కలసికొనిరి. అంబికాచరణుడు నామిత్రుఁడు విచారణభవనమున ప్రవేశింపని సమయమున నందు జరిగిన విషయమంతయు వ్రాసి నా కొసంగెను. తదనంతరవిషయములను నామిత్రుఁడు వచింపగ వింటిని. సహస్రభానుఁ డగుసూర్యుఁడు నీపరిశోధనఫలము నంతయు పశ్చిమదిశాసతికి తెలుపుటకో యన నస్తంగతుఁడయ్యెను.

సకల వ్యాపారములును నస్తంగతములయ్యెను. అంబికాచరణుని మానసమున దుఃఖకదంబము లొక్కొక్కటిగఁ జేరురీతి నీలతామిస్ర మంతకంతకు జగన్మందిరమున వ్యాపింపఁజొచ్చెను. ఎట్టిదుర్జనస్తోమము నందైనను సజ్జనుల సత్పురుషత్వము ప్రకాశింపకమానదనుసామెతను చాటుచు విహంగసంతతులు తమనీడముల చేరఁజొచ్చెను. ఇదియే ప్రపంచవ్యాపార విరామము.

# ఎనిమిదవ ప్రకరణము

అపరాధతంత్రమును భేదింపఁజాలు లోకబాంధవులున్ననే జగము కల్యాణవంత మగును. లేకున్న నిరపరాధులు శిక్షింపఁబడుటయు సాపరాధులు విచ్చలవిడి విముక్తశిక్షులగుటయు సంభవించును. కాన, పరిశోధకులు లోకోద్ధారకులలో నొక్కరనవచ్చును.

నాకు బొంబయినగరమున న్యాయవాదికృత్యమును నిర్వహింప వలసిన యావశ్యకత యున్నందున నాఁటిరేయియే పయనమొనర్ప ప్రయత్నించితిని. నావెంట నామిత్రుఁడు ననుసరింప బైండరుస్టేషనునకు ప్రయాణోన్ముఖుల మైతిమి. మాగమనము సౌధము ననుసరించిన మార్గముగుండ పోవలసియుండెను. మే మట్లు పోవుచుండుతఱి పాఠకుల కిదివఱకే పరిచయము కలిగించిన ప్రత్యేకముగ గగనసీమయందు రాజ్యము చేయుచుండిన రెండు పెద్దవృక్షములను చూచితిమి. హాత్యా మందిరప్రాంతమున బలసూదనకుమారుఁడు పరిశోధించినవృక్షము లివి యని తెలియఁదగును.

నా మిత్రుఁడు వానిని తిలకించి యేమి తలపోసెనో కాని యందొకతరువు నెక్కెను. నేను మాత్రము వృక్షముక్రింది ప్రదేశము ననే బలసూదనుని యీవృక్షారోహణ కార్యమునకు నుద్దేశమేమియో కనుఁగొనవలయునని నిలిచియుంటిని. ఈ పాదపము శిరీషకుమారిశయన గృహమునకు పురోభాగమున నుండుటచేత దాని నెక్కి చూచిన యెడల నా శయనమందిరమున నున్నవిశేషముల నెల్ల పరికింపవచ్చును. అట్లు నామిత్రుఁడు వృక్షము నారోహించిన కొలఁదిసేపటికే యా గది యందెవరో యిరువు రొండొరులతో సాయంకాలవందనము

లర్పించు మాటలనప్పుడే వినవచ్చెను. దీనిపైన వారిరువురు ఏదేమో సంభాషించుచుండి యొండొరులం బాయువారలై సాయంకాల వందనములొనర్చి యుండురని యూహింపనగును. అది నాకెంతయు పరమ విస్మయమును కలిగించెను. స్నేహసౌహార్దమైన నామిత్రుని కందలివిషయమంతయు నయనారంగమున ప్రకాశించుచునియుండెను. తనశయనగృహమంతః శిరీష శయనించియుండెను. ఆమె శయ్యను సమీపించి అంబికాచరణుండు మోకాళ్ళను భూమిపై మోపి యామెయంతితో నేమియో సంభాషించుచుండెను. ఒకచో బల్లపై దీపము వెలుఁగుచు వీరియాలాపముల నాలించుటకో యన నిశ్చంచలమై యుండెను. వారి సంభాషణ ప్రారంభవాక్య మొక్కటి మాత్రము మాకు వినవచ్చెను. అదేదన? "మనయన్యోన్యానురాగ ప్రేమలతపై దైవమున కిష్టము లేని యట్లున్నది."

అనునదియే-పిదప జరిగినసంభాషణ వాక్యముల వినుటకు మాకు వీలుకలుగ లేదు, గాలి యెక్కువయైనందున మాకు ఎదురుగనున్న గవాక్షమును మూసినందున వారివాక్యములను మేము వినుటయును దైవమున కిష్టమున్నట్లు లేదని నేననుకొంటిని. అంతట నిశ్శబ్దమయ్యెను. దీప ప్రసార కాంతియు మాయమయ్యెను.

ఇంతటితో నామిత్రుండు మానసమున దుఃఖసాగరము లుప్పతిల్ల క్రిందికి దిగివచ్చెను. నాతఁడు క్రిందికి దిగినకొలఁదినిమిషములకే వేఱొకయాకృతి యాగాఢాంధకారమున్నట్టి యావృక్షమునుండి క్రిందికి దిగి వచ్చుచుండెను. అట్లు దిగివచ్చిన యాకృతిని గాంచిన నాకాశ్చర్యమునకు మేఱయే లేదు. వృక్షారోహణ మొనర్చినవాఁడొక్కఁడు. దిగివచ్చిన దిరువురు. ఇప్పుడు దిగివచ్చిన యాకృతి మా సమీపమునకే దిగినందున మేమాయాకారమును అనిబిడాంధకారమునందైన గుఱుతింపఁగల్గితిమి. ఆతఁడు ద్విజేంద్రలాలై యుండెను. ఇతఁడేల యిట్లువచ్చి యుండునా? యని మాశ్చర్యము ద్విగుణీకృతమయ్యెను. కాని, యది

చాలకాల ముండలేము. పరిశోధకునకు చోరరానితావును సమయము లేదుగావున పరిశోధకచక్రవర్తి యనఁదగిన ద్విజేంద్రుఁడు ఏదియైన నూతనాంశమును కనుఁగొన నామిత్రునివలెనె యిందేలవచ్చియుండ రాదనునూహ యావిస్మయమును బాఱఁద్రోలెను. ఆద్విజేంద్రునికర మునందు దొకబెత్తము వెలయుచుండెను.

బలసూదనుఁడు వృక్షమునుండి దిగినవెంటనే "అయ్యో! పాపము" అని యుచ్చైస్స్వరమున పలికెను.

దానికి ద్విజేంద్రుఁడు "ఔను" అనియెను. ఇదివఱకు పరా యత్తుఁడై యున్న బలసూదనుఁడు ద్విజేంద్రునివైపు గాంచి యాచీఁకటి యందును నాతని చేతియందున్న బెత్తమును గాంచఁగల్గెను. తోడనే విస్మయ సంశయములు ముఖపంకజమునుండి వెలికి వచ్చుచున్నను వాని దాఁపనియ్యక ఆకరదండమునే యెగాదిగ చూడఁదొడఁగెను.

అంతలో తెలివిదెచ్చుకొని "ద్విజేంద్రలాలుగారూ! ఇచ్చటికి సమీపమున నున్నఫలాహారశాల కరిగి, యించుక ఫలాహార మొనర్తము వచ్చెదరా?" యని సగౌరవముగఁ బలికెను. అందునకు ద్విజేంద్రుఁడు సమ్మతించెను. మే మందఱ మా ఫలాహారశాల నలంకరించితిమి. అది మనశూరసింగుహోటలే.

మేము నందుచనుమార్గమున నే నిట్లు వితర్కించుకొనుచు నేఁగి తిని. ద్విజేంద్రుని కరదండమును గాంచి నామిత్రుఁ డేల యచ్చెరువు పొందవలయు! కరమున కరదండముండుట గౌరవోచితమనుజులకు స్వభావమేకదా? అయిన నామిత్రుని యాశ్చర్యమున కర్థము లేదా? ఎక్కడిమాట. అర్థములేనివ్యాపార మొక్కటియు బలసూదనుని యందు కానిపింపదు. దాని కెంతియో మహార్థ మున్నది. ఏదియది? ద్విజేంద్రుఁడు హాత్యోద్యమమునకు పూర్వ మెన్నఁడును కరమున బెత్తమును ధరించుచుండుట నెవ్వరు గాంచలేదు. ప్రస్తుతముమాత్రము

ఇట్టిసుందర తరమైన బెత్తమును ధరించుటకు ప్రయోజన ముండకపోదు. ఇదియుఁగాక యాబెత్తమును నెప్పుడు మానక ధరించుచున్నాఁడు. దానికి తార్కాణము రాత్రి వృత్తము నక్కడ విషయశోధనచేయు నపుడును ఆ బెత్తమును స్థహాయకారిగ ధరించియుండుటయే. ఎన్నఁడును బెత్తమును చేతఁబట్టి యెఱుంగని వాఁడిపుడు దానిని విడిచి యొకక్షణమైన నుండక సదా దాని ధరించుట కేదియో ముఖ్యప్రయోజన ముండియే తీరవలయు. అందును నిట్టి మహాపరాధ విమర్శనకాలమున ముఖ్యప్రయోజనము వేఱుండుట కవకాశమ్ములేదు. కావున ప్రకృత పరిశోధనవిషయమునందే యీ వేత్రరాజము మహాప్రయోజనమును గలుగఁజేయుచుండనోవు. అపరాధపరిశోధన కీకరదండ ముపయోగ కారియని నిర్ధరించినచో నీ బెత్తము పరిశోధనమునందే యితనికి లభించి యుండవలయు. అట్లుదొరికిన దాని నపరాధకుని యపరాధనిరూపణ మొనర్ప సాధనముగ దీనిని దనయొద్ద నుంచుకొనియుండవలయు. అట్లైనచో నపరాధి యిట్టివాఁడని యితనికేఁ దెలిసియే యుండవలయును. ప్రకృత మితని యపరాధపదము నెక్కఁదగియున్న యపరాధి యెవరు? పరిశోధన ప్రారంభమునుండి ద్విజేంద్రలాలు తనసందేహాస్త్రముల నంబికాచరణునందే యెసఁగొల్పెనంచి నటుల నా కూహ జనించుచుండెను.

నే నిట్లాలోచించుచు పూర్వోక్తరీతి మేము సౌరసింగు హోటలునందుఁ జేరి యందు ప్రవేశించితిమి. శౌరసింగు తొలుతటి కోపభావము నెందో పంపి మాకు వలయు వివిధఫలభక్ష్యాదులను క్షీరమును గొనితెచ్చెను. మేము భుజియింపసాగితిమి. నామిత్రుఁడు తనమానసమున నింకను ద్విజేంద్రుని కరదండమే స్ఫురించుచుండుటచే ద్విజేంద్రు నుద్దేశించి,

బల : తా మీా బెత్తము నెక్కడ క్రయమునకుఁ గొంటిరి ?

ద్విజే : కలకత్తానగరమున.

బల : నే నొకపర్యాయము దీనిని జూడవచ్చునా ?

ద్విజే : అవశ్యము జూడవచ్చును.

అని బెత్తమును ద్విజేంద్రుఁ డొసఁగగనె కొంతవఱకు దానిని పరీక్షించుచు దానియం దొక చోటనున్న కొన్ని యక్షరములఁ గాంచి దాని ద్విజేంద్రున కొసఁగుచు " దండము చాల సుందరముగ నున్నది. అయిన నిది బొంబాయియందు ధూనిచంద్ అండు సన్సు వారిచే చేయఁబడి యున్న బెత్తమును తాము కలకత్తాయం దెట్లు కొంటిరి ? " అని ప్రశ్నించెను.

ద్విజే : బొంబాయియందు చేయఁబడిన బెత్తములు కలకత్తాయందు విక్రయింపఁబడఁగూడదా ?

బలసూదనుఁ డేమియు మాఱుపలుకఁడయ్యె. అపుడు నూతన పురుషుఁ డొకఁ డందు వచ్చెను. అతఁడు సామాన్యజనుల యుడుపుల ధరించియుండెను. వాని గాంచినంతనే ద్విజేంద్రుఁడు కోపమున " అయ్యా ! ఇందు పెద్దమనుష్యులు రహస్యముగ సంభాషించుచుండుట తెలియంగవా " యనియెను. ఆగంతుకుఁడును సవినయముగ " చిత్తము ! నేను వేఱొకగదియందు ఫలాహారములఁ గైకొనెద " ననుచు వెడలి పోయెను. అతండెవ్వరు ! ఆగంతుక ద్విజేంద్రుల సంభాషణమున కర్థమేమి ?

# తొమ్మిదవ ప్రకరణము

అపుడు 8-30 గంటలగుచుండెను. బొంబాయికిఁ బోవు ధూమశకటము 9-41 గంటలకు బైడరుస్టేషనుకు వచ్చుట తెలిసి మేము ద్విజేంద్రునిచే సెలవుగైకొని స్టేషనువైపు వెడలితిమి. మార్గమున నామిత్రుఁ డగాధయోచనపయోధి మునింగి మౌనమున నావెంట వచ్చుచుండెను. అట్టిసమయమున నాతనితో సంభాషింప ప్రయత్నించుటసైతము నిష్ఫలమని యెఱింగినవాఁడనగుటచే నేనును మాఱు మాటాడక నడచుచుంటిని.

మేము స్టేషను చేరుటకు సుమా రొకగంటకాలమయ్యెను. ధూమశకటము వచ్చుట కింకను 15 నిమిషములుండెను. అపుడు నామిత్రుని గాంచి, "ద్విజేంద్రుని పరిశోధనయంతయు నంబికాచరణునికి వ్యతిరేకముగ నున్నదికదా!" యని ప్రశ్నించితిని.

బల : పాప మతనిని జూచిన నాకుఁ జాల జాలి కలుగుచున్నది. ఇపుడు ద్విజేంద్రుని చేతనున్న బెత్తముసైత మంబికాచరణునికి వ్యతిరేకముగ నేదియో విషయమున సాక్ష్యముగ నుండుటకైయే యతఁడు దాని నంతభద్రముగ, నొకక్షణమేని బాయక యుంచుకొనియుండు నట్లు తోఁచెడిని. అయిన దాని నతఁ డెచ్చట సంపాదించెను? దానికిని నంబికాచరణునికిఁ గలసంబంధ మెయ్యది? ఇట్టినామాక్షరములచే వెలయుకఱ్ఱలు బొంబాయియందుతప్ప వేఱొకచోట విక్రయింపరని నే నెఱుంగుదు. అయిన ద్విజేంద్రుఁ డేల నీవిషయమున నసత్యమాడ వలయు; నే నెఱుంగనివిషయము నే దేని యతఁడు తెలియఁగలిగెనా?

అది యసంభవము. అయిన నేమైన నగుఁగాక ? నా కీవిషయమున జయము చేకూరియే తీరవలయును. నే నాద్విజేంద్రుని పరిభవింపనే వలయు. అతఁడు ధీశాలియే కాని తన శేముషినాధారపడి వివరముల తన్నిరూపణకై సేకరింపఁబ్రయత్నింపక, యేలకో వక్రమార్గగామియై నిరపరాధిని సాపరాధిగ సాధింప యత్నించు చున్నవాఁడు."

బలసూదనుఁ డీవిషయముల వచించుచుండఁగనే ధూమశకట మరుదెంచెను. నేను బండి నెక్కి యొకచో నుపవేశించితిని, బలసూదనుఁ డంత "వశీకర్ ! నీవు బొంబాయి చేరినతోడనే "ఘోరాన్ రోడు 81 నంబరు ధూనిచంద్ అండ్ సన్సు" వారి దుకాణమునకు వెడలి 25 వ తేది సాయంకాలమున నెవ్వరేని యిట్టిచేతిబెత్తము క్రయమునకుఁ గొనిరా ? కొనియున్న దానియాకారమును, సాధ్యమగునేని పేరును విచారింపుము. నీవిచారణ ఫలితార్థమును నాకు రేపే తంతిమూలమున దెలుపవలయు" ననెను. ధూమశకటమునను తోడనే స్టేషను వదలెను.

మఱునాఁటి ప్రాతఃకాలముననే నేను ఘోరాన్ రోడు నందలి ధూనిచందువారి దుకాణమునకు పోయి విచారింప 25 తేదీ సాయంకాల మట్టి చేతికఱ్ఱనొక్కటి విక్రయించిరనియు, నట్టికఱ్ఱ వేఱొకటి యా వారమున వారు విక్రయింపలేదనియు వచించిరి. నేనంతట యామనుజుని యాకారము వర్ణింపఁగలరా యనియడిగితిని. వారు మొదట కోపగించుకొన్నను నపరాధపరిశోధక శాఖోద్యోగి నని నేను వచించినంతనే శాంతమునవహించి యామనుజుని యాకారము వర్ణించిరి. ఆయాకార వర్ణన మెవ్వరినిఁబోలియుండునో మాపాఠకు లూహింపఁజాలరా ? బలసూదనుఁడు సంపూర్ణముగ నిర్దోషియని నొక్కి వక్కాణించుచున్న యంబికాచరణునే !

# పదియవ ప్రకరణము

"తత్క్షణమే బైండరుకు రమ్ము. రెండుపిస్తోళ్లుకూడ తెమ్ము.
బలసూదనుఁడు."

నేను బొంబాయికి వచ్చిన నాలుగవదినమున బలసూదనుఁడు యీతంతివార్త నాబల్లపై నుండుటఁ గాంచి చకితుఁడనైతిని. పిస్తోలుల రెండు కొనిరమ్మని వ్రాయుటచే నామిత్రుఁడు మిక్కిలి యాపదయం దుండవలయు. లేకున్న బలసూదనుఁడు సామాన్యముగ నిట్టికార్యముల యందు మిత్రుల సాయమునేని యపేక్షించువాఁడు కాఁడు. ప్రభుత్వ నియమితాపరాధ పరిశోధకుఁడు గాకున్నను నెట్టియాపత్సాగరమునేని నీఁదసమకట్టుట పరికించిన వారందఱికిని నామిత్రుని స్వార్థత్యాగతయు, పరోపకార పారీణతయు తెల్లముగాకమానదు.

నాకింతవఱకు బైండరుసమాచారము లేవియు తెలియవు. నే నింకను న్యాయవాదవృత్తి ప్రారంభించి రెండుసంవత్సరములు కాలేదు. ప్రారంభదశయందున్న న్యాయవాదులస్థితి యెల్లరకును దెలిసినవిషయమే. ఆదాయము లేకున్నను పనియున్నను, లేకున్నను ఉన్నవానికన్న నెక్కుడుగ నటింపవలయు.

ప్రకృతము నాకట్టిపనులేయున్నను నామిత్రుని క్షేమవిషయమున గల యాతురతచే వానినన్నిటిని మాని బైండరుకు పోవనిర్ధరించితిని. తత్క్షణమే యత్యావశ్యకము లగుపరికరములఁ గైకొని బజారునకు వెడలి రెండుపిస్తోలుల క్రయమునకు కొంటిని.

ధూమశకట మధిరోహించినపిదప బైండరు చేరువఱకు నాయోచన యంతయు బలసూదనుని విషయముననే యుండెను. అతని కెట్టి యాపద సంభవింపఁగలదు! సంభవించియున్నను నతని రక్షింప

తనయసాధారణ శేముషీప్రభావ ముండలేదా? మిత్రుఁడే వలయునేని అంబికాచరణుఁడందు లేఁడా? లేక యంబికాచరణుఁడే యాపదకు గుఱియయ్యెనా? యోచించుకొలఁది నాకేమియు బోధపడదయ్యె.

బైండరుస్టేషనునందు బలసూదనుఁడు నాకై వేచియుండునని తలఁచితిని. కాని యతఁ డందు కాన్పింపఁడయ్యె. విధిలేక అద్దె బండిని విచారింప నదియు లభింపదయ్యె. జయంతమందిరమువైపు నడువసాగితిని.

మార్గమధ్యమున గృహోద్యానాధికారి యగుమదన మోహనుఁడు నిజసహజ గాంభీర్యగమనమున హోటలువైపు వెడలుచుండుటఁ గాంచి, బలసూదనుని క్షేమవిషయమున గలయాతురతచే నతనిని విశేషము లేమైన నున్నవా? జయంతమందిరమున నందఱును సేమమా! యని సావేగముగఁ బ్రశ్నించితిని. మదనమోహనుఁడు నావైపొకని మేషకాల మెగాదిగఁ జూచి, "అందఱు సేమముగనే యున్నా" రని వెడలి పోయెను.

# పదునొకండవ ప్రకరణము

బల : పిస్తోలులను గొని తెచ్చితివా ?

వశీ : తెచ్చితిని. కాని, ఇవి యెందులకు ?

బల : అవసరమగునెడ హంతకునిపై నుపయోగించుటకు.

వశీ : హంతకుం డెందున్నాఁడు ?

బల : ఈరాత్రి యిందు వచ్చును.

వశీ : హంతకుఁడా ? ఈరాత్రి యిందు వచ్చునా ? ఆతని నెట్లు గుఱుతించితివి ?

బల : హంతకుని నేనింకను గుఱుతింపలేదు. కాని యతని నీరాత్రి బంధించుటమాత్రము నిశ్చయము. అతఁ డీరాత్రి తప్పించుకొనియెనా యది మానయువజ్ఞతయే.

వశీ : నీమాట లేమియు నాకర్థము కాలేదు. హంతకుఁ డీరాత్రి యిందు వచ్చునని నీ కెట్లు తెలియును ?

బల : అతఁడు మొన్నరాత్రి యిందు వచ్చియుండుటవలననే.

వశీ : ఏమీ ! ఏమీ ! హంతకుఁడు మొన్నరాత్రి యిందు వచ్చి యుండెనా ? నీవతని నిర్బంధింపఁజాలవైతివా ? ప్రాణములపై నతఁడంత యాస మానెనా ?

బలసూదనుఁడు నాప్రశ్నల కెట్టిప్రత్యుత్తరమును నొసంగఁ డయ్యె. కావున, నాయాతురత నంతటితో నణఁచుకొనవలసి వచ్చెను. పైనివ్రాసిన సంభాషణయంతయు జయంతభవన మహాద్వారమునుండి బలసూదనునకు ప్రత్యేకముగ నొసంగఁబడిన గదికిఁ బోవుమార్గమున జరిగెనని పాఠకులు గ్రహింతురుఁగాక ! నేను బొంబాయికి వెడలినపిదప

నామిత్రుని కంబికాచరణుని సాయమున నాభవనమందే నివసించి తన విమర్శనాజాలము నెదఁగొల్పఁదగిన సదుపాయములు లభించియుండెను. ముఖ్యభవనమున మేడపై ద్విజేంద్రుని కొకగదియు దానిప్రక్కనే బలసూదనున కొకగదియు నొసంగఁబడియుండెను.

మేమాగది ప్రవేశించినంతనే, బలసూదనుని చూడ్కు లాగది యంతయు కలయఁజూచెను. అతఁ డందేమి కాంచెనో కాని, హారియని యొక్క కేక వైచి యున్మత్తునిచందమున నొక్కయెగురున నంచలి యొక బల్లచెంతఁ జేరి యందున్న చిన్నవస్తువు నేదియో పెన్నిధిగన్న పేదవోలె యిరుగేల పైకెత్తెను.

నామిత్రుని చందమునకై యక్కజఁబడి యసమాన శేముషీ ధనుఁడగు బలసూదనునంతటివానిని సైతము పిచ్చివానివలె నాడింపఁ గల సంతసమును జేకూర్చినవస్తు వెయ్యదియో యని నేనును సమీప మున కేఁగి దానిఁ గాంచితిని. కాని నాయాశ్చర్య మంతట నశింపలేదు. అదేదని మాపాఠకులాతురత నందనక్కఱలేదు. అది సమీపదృష్టిగల యొకకంటి బంగరుసులోచనము.

దాని నాకుఁ బ్రదర్శించుచు "మిత్రమా! దీని జూచితే? అప రాధపరిశోధనయందు జగన్నుత సత్కీర్తి గడించి, యసమానుఁడై వెలయు ద్విజేంద్రుని దప్పక పరిభవించెద. ఔను. అవిదితనామధేయుఁ డగు నీబలసూదనకుమారుఁడు ద్విజేంద్రునంతటివానిని సైతము పరి భవింపఁ గలఁడు." అని సగర్వముగ సామోదమునఁ బలికెను.

అతని మాటలు ముగియకమునుపే ద్వారమున వనపాలకుని భార్యయగు కౌముది బలసూదను నుద్దేశించి "నేలలో రంధ్రమున" ననియెను. బలసూదనుఁడు సరియే యన నా తన్వి వెడలిపోయెను. ఇదంతయు నొకవిచిత్ర నాటకప్రదర్శనముఁబోలె నుండెను.

కౌముదీకందళులు నిర్బంధింపఁబడియుండుట పాఠకులకుఁ దెలిసినవిషయమే. నిర్బంధితయగు కౌముదికి మరల స్వేచ్ఛ యెట్లు లభించె? వారపుడు నామిత్రునియెడ ప్రకటించిన కృతజ్ఞతావిశ్వాసములకుఁ గారణ మెయ్యది? ఇత్యాదిప్రశ్న పరంపరలు నను బాధింప సులోచన లాభమున మైమఱచిన వానితీరున నున్ననామిత్రుని నీప్రశ్నల నడిగితిని. కాని యతఁడు మరల "నిశ్చయము. ఈపర్యాయము బలసూదనుని చేత ద్విజేంద్రలాలుమహాశయునకు పరిభవము కలుగుట నిక్కము. నిస్సందేహము" అనియెను.

# పంద్రెండవ ప్రకరణము

"ఓహా! దినేశబాబుగారా! ఎపుడు విచ్చేసితిరి?"

"అయ్యా! నే నిప్పుడే వచ్చితిని. పంచాననబాబు నామిత్రుఁడు కదా! అతని కాపద సంభవించినతటి నేను పరామర్శింపనే వలయుకదా! కాన, తమకు విన్నవించిన తెఱంగున మాదేశమునకు పోవుట ప్రక్కి తము చాలించి యిందువచ్చితిని." "చిత్తము. మరల దర్శించెద" ననుచు నామిత్రుఁడు నందుండి వెడలసాగెను. ప్రత్యుత్తర మొసంగినపురుషుఁడు జగుంతభవనము మేడపై నున్న గదిగవాక్షమునుండి తొంగి చూచు చుండెను.

పిదప నామిత్రుఁడు నన్నుఁ గాంచి "దినేశుఁ డొరిస్సాదేశనివాసి. ఇతని నొక్కపరి నే నొకమిత్రునియింటవిందుసమయమునఁ గాంచియుం టిని. ఇతఁడును, పంచాననబాబును నొక్కదేశీయులగుటకతనవారికిట్టి మైత్రి యుండనోపు. అయిన, దినేశుని కెట్టియుద్యోగము నున్నట్లు కను పింపదు. విద్యావంతుఁడైనను మద్యపానాసక్తుఁడు. నాఁటిరేయి నేనితని గాంచినపుడు మధుపానమున మైమఱచియుండెను. అయిన నతఁడు మఱు నాఁడే స్వదేశమునకు పోవుచున్నానని వచించె, అతఁ డిచ్చటి కెపుడు వచ్చెను? ఎట్లు వచ్చెను? కౌముదీకందళులేల నాకితనియాగమనవిష యమై పలుకరైరి." అని పలుకుచుండ మేము వనపాలకమందిరము చేరితిమి.

కందళుఁడు మాత్ర మందుండెను. మముగాంచినంతనే యతఁడు సవినయముగ నెదుర్కొనెను. బలసూదనుఁ డాతనిఁ గాంచి "దినేశ బాబు యిచ్చటి కెపుడు వచ్చెనో నీకు తెలియునా" యని ప్రశ్నించెను.

కంద : ఆర్యా! అతని యాగమన నిర్గమనము లన్యులకుఁ దెలియుట కష్టము. అతఁ డెప్పుడు నందఱివలె మహాద్వారమునుండి భవనమును ప్రవేశింపఁడు. శకటారోహణ మతనికిఁ బ్రీతికరము కాదఁట. కావున నతఁడెప్పుడును నడచియే వచ్చును. అతనికొఱకై దక్షిణదిశయందలి ప్రాకారపుగోడలో ప్రత్యేక ద్వారము నిర్మింపఁబడి యున్నది. అతఁ డెప్పుడును నామార్గముననే వచ్చుచుఁ బోవుచుండును.

బల : అతఁ డీమాసమున నెన్నిపర్యాయము లిచ్చటికి కేతెంచి యుండెను ?

కంద : మూఁడు నాల్గుపర్యాయము లిచ్చటికివచ్చియుండెను.

బల : హత్యాదినమునఁ గాని, ముందుదినమునఁగాని యతఁడు వచ్చియుండెనా ?

కంద : హత్యోద్యమము వెనుకటిదిన మిచ్చటికి వచ్చి యుండెను.

బల : అతఁ డెప్పుడు వెడలిపోయెనో తెలియునా?

కంద : చెప్పఁజాలను. కాని హత్యోద్యమమునాఁటిమఱుదినము మేడయందు వేఱొందుకార్యమునకై పోవుట తటస్థించెనుఁ అప్పటికాతఁ డందుండ లేఁడు.

బల : అతనివిషయమై నీ కింకేమైనఁ దెలియునా;

కంద : ఇఁక నేమియుఁ దెలియదుఁ అయిన నతఁ డెట్టిసమయమున వచ్చినను భవనమున నిరాటంకప్రవేశము లభించును.

సంభాషణానంతరము మేమిర్వురము హోటలున్నదిశ కభిముఖులమై వెడలితిమి. నాకింకను నన్నిచ్చటికి రప్పించిన యావశ్యకత యేదియో తెలియదు. నే నావిషయమై నామిత్రుని బ్రశ్నింప ముందుప్రకరణమున వివరించిన చందమున నేను బొంబాయికి వెడలి మరలివచ్చువఱకు ప్రవర్తిల్లిన విషయముల బలసూదనుఁడు వచించెను.

# పదుమూఁడవ ప్రకరణము

కౌముదీకందళుల నిర్బంధమునకుఁ గారణ మీా వెఱుంగుదువు కదా? హత్యోద్యమదినము రాత్రి వసంతుఁ డేతెంచుసరికి మార్గమధ్యమున నేసముచితవస్త్రాలంకారులై వారాతని నెదుర్కొనిరి కదా? అందుకు వారు వచించినకారణ మసత్యమనుట నిర్వివాదాంశము. ఎందుకన, వారు వచించిన తెఱంగున హత్యామందిరమందు పేల్పఁబడినధ్వనినివినిన పిదప కదా వారు రావలయు? మేజస్ట్రీటుగారి విషయమును బరీక్షింప హత్యా మందిరగవాక్షద్వారముల బంధించియుండ నందు వసంతుని పిస్తోలు కాల్పఁబడెను. ఆశబ్దము వీరిగృహమందున్నవారికి వినుపింపలేదు.

అయిన వీరు ప్రాణాపాయమునకేని వెఱవక హత్యోద్యమాపరాధమున నిందితులుగ నెన్నుకొనఁబడుటకైన సమ్మతించి యసత్యమాడునంతటి వారిరహస్య మెయ్యది! ప్రకృతాపరాధమున హంతకుఁ డొక్కఁడే యనియు నతని కెవ్వరును సహాయకు లుండలేదనియు నిర్ధరించితిమి కదా!

అయిన వీరియపరాధ మెయ్యది? మన మీా భవనమునకు వచ్చినపుడు హోటలుఅధిపతియగు శూరసింగు తనగృహమున కేతెంచిన వారితో నుడివినపలుకులు జ్ఞాపకముగనున్నవా? ఇకఁముందు మృగమాంస మిచ్చట లభించుటకఱవగు ననికదా యతఁడు వచించినది!

మన మరుదెంచినప్రదేశము జనబాహుళ్యరహితము. నగరజానపదములయందువలెఁగాక యిచ్చట మనుజుల కార్యపథము మార్పులు లేక, యొక్కవిధముగనే గడచుచుండును, ఇచ్చటినివాసులకు పరస్పరసంబంధ మెక్కుడగ నుండును. నిన్న జరిగినవిధముననే, ఱేపును మఱునాఁడును జరుగుచుండును.

ఇట్టిసలమున నేదైన,నత్యాహితము ప్రవర్తిల్లిన నది యీప్రాంత వాసుల దినచర్యాజీవిత ప్రవాహమునకు నొకింతేని అంతరాయము కల్పించియేయుండవలయును. కావుననే నాఁడు శూరసింగుపలుకులు విన్నదాది యాపలుకులకును, హత్యోద్యమమునకును నేదియైనసంబంధ ముండవలయుననితలంచితి.

"ఇఁకముందు మృగమాంస మిచ్చుట లభించుట కఱవగు"నను నీపలుకుల కేమియు నర్థము లేకున్నను ఇఁక ననుపదమున కిట్లు వ్యాఖ్యాన మొనర్చిన నించుక యర్థము కలుగు. ఇఁక—హత్యాపరాధము ప్రవర్తిల్లినదికనుక నిఁకముందు—అప్పటికి కౌముదీకంఠుల నిర్బంధ విషయమై నాకు తెలియదు.

మనమిరువురమును మరల హోటలుకు వచ్చునప్పటికి_యిఁక ననుటకు కౌముదీకందళులు నిర్బంధింపఁబడిరి. కాన, నిఁకముందు మనకు మృగమాంసము లభింపదనియర్థము చేసికొనియుంటిని. దానిని బరీక్షించుటకై నే నావాక్యములఁ బలికినంతనే శూరసింగు ప్రవర్తనమారుట నీ వెఱుంగుదువు కాదా! కాన నాయూహ నిర్ధారణమయ్యెను ఆమాటవలననె శూరసింగు నాకు వశీకృతుఁడయ్యెను.

పంచాననబాబు కఠినముగ నాజ్ఞాపించియున్నను, కౌముదీకందళులు, రహస్యముగ మదనమోహనునికనుమీరి రాత్రిసమయముల నావనమందలి పక్షిమృగముల చంపుచు వానిని శూరసింగునకు విక్రయించుచుండిరి. వారు నిర్బంధింపఁబడిరికాన నిఁకముందు మృగమాంస మిచ్చుట లభించుట కఱవగు నని శూరసింగు పలికెను. దీనిని బరీక్షించుటకై నేను కందళుని యిలుసొచ్చుటయు నీప్రశ్నకు ప్రత్యుత్తరముగ వందుఁ జాలములును, (వలలు) తుపాకియు నున్నవనియు వచింపలేదా?

ఇఁక వారేల యీ విషయమును విచారణసమయమునఁ బలుక రైరన్న తమదోషము నొప్పుకొన్న పంచాననుఁడు వారిని వెడలఁగొట్టును. కాన నసత్యము వచించిరి. వా రానాఁడును షక్షులబట్టుటకుఁ దిరుగుచు, హత్యాగృహసమీపముననున్నందున పిస్తోలుధ్వని విని రాఁగలిగిరి. సత్యమెప్పుడైన వెలువడక మానదని వారినమ్మకము. అపుడు వారి నిర్దోషిత్వము తెల్లముకాఁగలదు, అంత మితిమీరివచ్చిన న్యాయసభ యందు సత్యము వచించి విముక్తిఁబడయువచ్చునని వారివిశ్వాసము.

నా కీవిషయము తెలిసియు కార్యాంతరమున వారినిర్దోషిత్వమును నిరూపింపనైతి. నీవు వెడలిపోయినపిదప నాయెడవిశ్వాసమున నాకు సాయమొనర్పవా రావశ్యకియయ్యెను. నేను వారిని విడిపించిన కృతజ్ఞులై యుందు రనునమ్మకమున పంచాననబాబు చెంతకేఁగితిని.

కౌముదీకందళులనిర్దోషిత్వవిషయమున పంచాననబాబునకును దృఢ విశ్వాసము కలదుఁ కావున నాప్రార్థనపై నతఁడు "మీ రేమపరాధ మొనరించియున్నను మన్నించివాఁడ"నని కాగితమునవ్రాసి సంతకమొనర్చి నాకొసంగెను. నేనును దానిసాయమున వారిభీతి మాన్ప వారంతయు నే వచించినవిధమున నొప్పుకొనిరి.

పిదప నేను మేజస్ట్రీటుగారివద్దకు పోయి వనపాలకులు నిరపరాధులని వచించితిని."నిదర్శనములుకలవా"యని యాయన నన్ను ప్రశ్నించెను. "ఉన్నవని" వారివాఙ్మూలమును వచించితిని. అంతట మేజస్ట్రీటుగారు ప్రార్థనాపత్రికను, విచారణకాలమున న్యాయస్థానమునకు తప్పక వచ్చునటుల జామీనుదారునొక్కరుని సిద్ధపరచిన వారిని బంధముక్తులఁజేయుటకై సమ్మతించిరి, నేనటులే గావించితిని.కౌముదీకందళులు బంధముక్తులైరి. అది మొదలు వారు, నాయందు కృతజ్ఞులై యున్నారు. మఱియు నాపరిశోధనమునసహాయకారులైనా కెంతయు నాంతరంగికులై మెలఁగు చున్నారు.

# పదునాలుగవ ప్రకరణము

ఆ దినముసాయంకాల మంబికాచరణుఁడు సత్వరముగ నేతెంచి "తానీ యుదముననే బొంబాయికి పోవ నత్యావశ్యకకార్య మొండు కల దనియు, శిరీషకుమారి దేహారోగ్యవిషయమునను, ఆమె రక్షణవిషయమునను, తనకొఱకుఁగడుజాగ్రత్తవహింపవలయుననియు" మిక్కిలి దైన్యముగఁ బ్రార్థించెను. నే నందుకు—

బల : ఐన తామీదినము హంతకుఁడు తప్పక నిందువచ్చునని భావించెదరా?

అంబి : (గద్గదస్వరమున) లేదు, హంతకుఁడు తనప్రాణములపై నైనను నాశవదలి యుండేలవచ్చును?

బల : మీరు నాకడ దాచినదానివలన ప్రయోజనమేమియు లేదు. ప్రయోజనము లేకపోవుట యొక్కటియేకాక దానికిమూలముగననే కాపదలు, ననేకకష్టములు మిమ్ము నావరించును. హంతకుఁడెవ్వఁడో, హత్యాప్రయత్నమేదో, యుద్దేశమేమియో యంతయు మీ కెఱుంగుదురు. ఈనాఁడతఁడిందువచ్చుటను నెఱుంగుదురు, ఇంత తెలిసియు తాము పరమిత్రుఁడనై నాయథాశక్తి తమకు సాయమొనర్ప పరిశోధనకై కడంగిననాయట్టివాని చెంతనైనను దాచుట యెందుకో తెలియ కున్నది. ఇట్టిదినముననె హంతకుఁ డిందువచ్చుదినముననె, ఇట్టిసమయము ననె తాము బొంబాయికి పోవఁదలంచుటయు నెందుకో నాకు దురూహ్యమైయున్నది. ఇట్టికష్టశైలము నెదుర్కొనుట మీకెందుకో, మీచారిత్రము నా కాశ్చర్యము గొలుపుచున్నది. మీరిందుండి యామెకు రాఁగలయాపదనుండియామెనురక్షించుటమాని యింకొకరి

శిరీషకుమారిశయనమందిరమునకు పోవనేనివారిని ఆమెరక్షణమునకై ప్రార్థింప నేటికో "నేను బొంబాయికిఁ బోవుటకు నత్యవసరకార్యమున్నందున నేనట్లుచేయవలసివచ్చెను" అని మీరు చెప్పెదరుకాఁబోలు? శిరీషప్రాణరక్షణకన్న మీ కత్యావశ్యకమొకటి లేదనుట నేనెఱుంగుదును. మీయిప్పుడిప్రయాణయాను రాగపరమావధియే దానికికారణము. ఇట్లు మీ కాటకప్రాణమై వర్తించుశిరీష నట్టియాపదయందు వదలి మీరు పయనమగుట చూడ నాకుపంపునకె మీరు పోవుచున్నారని నేనూహింప నపరాధము కాదుకదా? ఆమెస్నేహము తనకై యెదురుచూచుచున్న మహోపాయమును శంకించియు తనకాత్మరక్షణమునకై పరమాంతరంగికుఁడవై యున్న నిన్నె తానే బొంబాయికి పంపవలయునన్న నందేదియో ముఖ్యమగుకారణము నిమగ్నమైయున్నదని భావింపవచ్చునుగదా? మీరా మెయభిలషితమును మీఅఁజాలక నామెకెంతయో యననుకూలత మీనుండి కలుగుటను సహింప నేరక విధిలేక బొంబాయి ప్రయాణమునకు సిద్ధపడి నన్ను నామెకపాయస్థితి కలిగినపుడు రక్షింపుమని నియోగించుచున్నారు, ఇదియేకదా దీనితత్త్వము? మిమ్ముల నేను నపరాధియునియెంచినవాఁడఁ గానని తాముభావింపవలయు. తాము నిరపరాధులు; పరబాధాసహిష్ణులు; స్వార్థత్యాగులు; అని నావిశ్వాసము. మీకు హంతకునివిషయమై కొంతభాగముమాత్రము తెలియును నాకన్ననో, రెండుభాగములవఱకును దెలియును. కావున మీకుఁ దెలిసిన యాప్రథమభాగమును నాకుఁ దెలిపినయెడల నేనాయంశమును నాకుఁదెలిపిన రెండుభాగములలోఁజేర్చి నాల్గవ భాగమును కడుసులభముగ రాఁదీసి, హంతకునిసంపూర్ణకథావిషయము నంతను ననుసంధానింపవలసియున్నది. మీరొకవేళ హంతకుని సంపూర్ణతత్త్వమును దెలిసియు కారణాంతరమువలన దాని వెలిబెట్టుట కిష్టపడనియెడల నేనాపరమరహస్యమును భేదించి యిఁకముందు మీకా

హంతకునిచే నెట్టియుపాయమును గలుగకుండఁజేసెదను. ఇంతియే గాక యీరహస్యము నితరులకెవరికిని నేను దెలుపనని వాగ్దానమొన ర్చెదను. దీనివలన శిరీషకుమారిబాధయు మీకుఁగలుగు నపాయమును తొలఁగును. మీ దుస్థితి చూచిననాకుఁ గడు జాలి కలుగుచున్నది. నేనీ రహస్యమును విని వెలిబుచ్చిన శిరీషకుమారిమనశ్శాంతికి భంగముగలుగు ననియుఁ దలంపవలదు. అది బ్రహ్మాదులకైన నగమ్యమై నావలన బ్రహ్మరహస్యముగ నిగూఢమై యొప్పునని త్రికరణశుద్ధిగవిశ్వసింపుఁడు. ఇదియుఁగాక మీవలన నెటులైన నంతరంగమునఁ బదిలముగ రక్షింపఁ బడుచున్న యీరహస్యమును దెలిసికొనవలయునని నే నీ కపటతంత్ర మూని "నాకు రెండుభాగములు హంతకునివిషయమునఁ దెలియు" నని యసత్యము లాడుచున్నానని నన్ను దలంపకుఁడు. నా శాహంతకచారి త్రమున రెండుభాగములవఱకుఁ దెలిసినదనుటకు నిదర్శనములు కావల సిన వచించెదను వినుఁడు. మొన్న 23 తేదియందు మిత్రేంద్రబాబుగారి యింట జరగిన విందునకు నేనును నాహ్వానింపఁబడి యరిగియుంటిని. మం దిరమంతయు నతిథిబృందముచే నిండి క్రిక్కిరిసి యుండెను. నేను నాయ లంకృతమై మహేంద్ర భవనమునొక నెక సక్కెములాడెడి యీవిశాల శాలాప్రదేశమున నుపవేశించి యుంటిని. కొన్నినిముషములకు 60 వత్స రములవయసుగలిగినగౌరవకుటుంబి యొకఁడు మనోహరసహజ సౌందర్య ప్రభనీను నిండుజవ్వని యైనయొక మందగామినిచేయూతతోలోనఁ బ్రవేశించి నేను గూరుచున్న పీఠముగుండనె వచ్చెను. ఆయువతి నాముందు నడచునపుడు నే నిదివఱలో నెఱింగియుండిన స్త్రీయొక్క మేని సుగంధద్రవ్యవాసన నా నాసాపుటమునఁ బ్రవేశించినందున నప్పుడే మృదుసలిగృహస్థుయొక్కయు నాలతాంగియొక్కయు యీవద్వృత్తాంత మును దెలిసికొనవలయునని నాకుఁ గుతూహల మొంతయు జనించెను. కావున నా చెంత నుపవేశించియున్న యొకరిని "వారియుదంత మే" మని

ప్రశ్నించితిని. "ఈవృద్ధమహాశయుఁడు రసాయన విద్యాపారీణతయుం దసమానమేధాశాలియై పెక్కురసాయనశాస్త్రనూతన విషయములఁగని పెట్టి సుప్రసిద్ధివహించిన పంచాననబాబుగా రనియు, నాఁగుబలయతని యేకపుత్రిక శిరీష కుమారి యనియు" నాతఁడు నాకుఁ దెలిపెను. నేను పంచాననబాబుగారి విఖ్యాతిని వినియుండినవాఁడనగుటచే వారిని దర్శింప వలయునను నభిలాష మొలకెత్తెను. తోడనె నేను వారిని వెంబడించితిని. పంచాననుఁడుమాత్ర మావిశాల భవనమున నొకచోట కూరుచుండెను. శిరీషకుమారి మధ్యవయస్కుఁడగు నొక్కసుందరపురుషుని కరగ్రహణ మొనర్చి సరసాలాపములాడుచు మందిరోద్యానమును జేరెను. ఆతన్వంగి యొక్క దివ్యపరిమళము నన్నాహ్వానింప నేనును వారిననుసరించి యేఁగితిని. శిరీషకుమారి పార్శ్వము నలంకరించిన ధన్యుఁడెవరన నాముందు ప్రత్యక్షముగ నున్ననీవే. మీపరిచయభాగ్యము నాకుఁ గలుగనందున మీ రా శిరీషను మీ మనోనురాగ పీఠమున నెలకొల్పి మోహకుసుమములఁ బూజించుచుండుటను నే నెఱుంగను. కావున నే మీవెంట వచ్చి యీవ్యాపారమునఁ బ్రవేశించితిని. అంత మీరిరువురును సమందగమనమున నాయుద్యానవనము కొట్టకొనవఱకుఁ బోయి ప్రత్యేకముగ మందిరమునకు చాలదూరమున నున్న యొకనికుంజము చెంతకుఁ బోయి యుండాఁగితిరి. నేనును మీ వెంట చనుదెంచి దానిచెంత నున్న మఱియొక పొదమఱుగుననుండి శిరీష తనచెంతదాచిన యొకపత్రికను దీసి దానిని రెండుకరములచే బట్టుకొని చదువుచుండుటను మీరామె భుజముపై కరమిడి దానినిఁ గాంచుచుండుటను దిలకించితిని. కొన్నినిమిషములకు పత్రికాపఠనము సాంతమయ్యెను. పిదపశిరీషకుమారి ముఖమున వైవర్ణ్యముఁదోప నిన్నుఁగాంచుచుఁ "ప్రార్థనామందిర మింకను దన సహజరామణీయకమును వీడ లేదు. దానియుద్యానవన మింకను దనసహజ రామణీయకమును బాయలేదు." అనువాక్యమును మీసంభాషణమున

నుడువుటమాత్రము వింటిని. పత్రికను జదివినపిమ్మట దానిని శిరీష తన యఱచేతియందు దీసుకొని నలుముచుఁ గోపమును బ్రదర్శించి తనయొడు పులయందు దానిని నిగూఢపరిచెను. అనంతరము మీరిరువురును వెను దిరిగివచ్చుచో మీ మోములయందలి విషాద దైన్య నిరాశాదిభావము లను నేను లక్షించి మీతో నామెవచించిన యాపత్రికలయందలి రెండు వాక్యములే యింతటివంతకుఁ గారణములై యుండవచ్చునని తలంచి తిని. మందిరద్వారము సమీపించునపుడు మీరు శిరీషకుమారితో "నిన్నుఁబడయువలయునన్న హత్యాపరాధమునకై సాహసింపవలయుఁ గదా!" అనిపలికితిరి. ఈవాక్యమే శిరీషను నామెనవశిరీషకోమలతనువల్ల రిని మొదలంట వాడఁజేసెను. ఆబాలయు మీ మోమున విషాదదృష్టుల నొకక్షణకాలముఁ బఱపి పిదప శిరము వంచికొని మౌనముద్రచే నెచ్చట నడుగులిడుటయు దెలియక ముందునడువఁజొచ్చెను. మీరిరువురును మందిరము జేరితిరి. నేనును జేరితిని. చేరునప్పుడు నామానసమున మీతుదిమాటలయందుఁ గలభావము నెగురుచుండెను. దీనికిఁగారణ మెయ్యదియో యనియాలోచన నన్నావరించెను. అంతట నాజనసమ్మర్దమున మీ రెందేగినదియుఁ గాంచనేరనైతి. ధ్యానపరాధీనమానసులు కనులుండియును లేనివారలే కదా? అప్పటికిని నాయాలోచన నన్ను బాయ లేదు. నే నొకచోట నుపవేశించితిని. నాచెంతవృద్ధకాయుఁ డొకఁడు మధుపానమున స్వాధీనదేహుఁడుగాక తూగాడుచుండుటను జూచితిని. అతఁడు మధ్యవయస్కుఁడు. గౌరవోచితపరిధానముల నలంకరించికొని యుండెను. ద్రాక్షరసమును మితిమీరి త్రాగియుండుటచే నచేతనుఁడై పడుచు లేచుచు నడుమనడుమ నేమేమియో యవ్యక్తభాషణము లాడు చుండెను. నను జూచి తన్ను వెలిఁజేర్పుమని యస్పష్టవచనముల నుడి వెను. అతనియలంకరణములు విదేశీయతను సూచింప నే నాతని బ్రశ్నించితిని. అతఁడు తననివాసము ఒరిస్సా దేశమని యెట్టులో నుడివెను.

తనపేరు "దినేశుఁ" డనియుఁ బలుకఁగ్గలైను. నేను నతనిని నా చేతియూత నిచ్చి తెలివిదప్పియున్నవానిని యాజనసమ్మర్దమందిరబాహిరునిఁ జేసితిని.

అని నే నింకను నావాక్యసరణి ననుసరించుచుండ నంబికాచరణుఁడు నాధోరణి మాన్పి యిట్టులనియెను. అతనికి తన్ను ననుమానించినట్లు తోఁచెను. మిత్రేంద్రునింటియుద్యానద్వారమున దానాడినకడపటివాక్యమునుగూర్చి యధికసంతానము జనించెను. తానె హంతకుఁడని నేను దలంచితినేమో యనుసంశయ మాతని నాడించుచుండెను. ఆసంశయము తొలఁగిపోయెను. నేను తన్ను నిరపరాధియని మున్నే వచించుట యతనికి జ్ఞాపకమయ్యె కాబోలును. అయినను హంతకునిపేరైనఁ దనకుఁ దెలిసియేయుండునని తలంచితినేమో యనుభావము తుదకాతని మోముపై తోఁచుచుండెను. ఆతనియోష్ఠచాలనమే యాతని యాతురతఁ దెలుపుచుండెను. నయనములందు బాష్పములు నిండి తొలుకాడఁ జొచ్చెను.

అంబి : మిత్రమా! దైవసాక్షికముగఁ బలుకుచున్నాను. నాకు హంతకుని పేరు తెలియదు. నీవు ద్విజేంద్రునివలె నన్ను సంశయింపక నేను నిరపరాధినను సదభిప్రాయము గలవాఁడవగుటఁ జెప్పఁదగినవిషయమును దాఁపక నీతో వచించెదను. నీ వభిప్రాయపడినరీతి నేను బొంబాయికిపోవుట నాశిరీషయొక్క యభిమతబలాత్కారముననే యని సమ్మతించెదను. నన్ను శిరీష నావియోగమును సహింపఁజాలనిదియైనను బొంబాయికి పొమ్మని బలవంతముపెట్టుటచే హంతకుఁ డిందు వచ్చునేమోయని నే నూహించితిని; కాని, నిక్కము నెఱుఁగను. హంతకుఁడు వచ్చినసమయమున నే నిందుండుట శ్రేయస్కరము కాదని యామె భావించి యుండనోపు నని తలంచుచున్నాను. రాఁబోవుఘోరాపదనైన

నిశ్యేకొని యతని రాకకై సమ్మతించుటకు ముఖ్యకారణ మేమోనాకుఁ దెలియదు. విధిలేక ఆయమచే ప్రేరితుడనై బొంబాయిప్రయాణమున కుపక్రమించితిని, అట్లు పోవుచున్నను సర్వదశలయందును నా మె క్షేమమే పరమపురుషార్థమని భావించు నేను తమ్ము నేను లేకున్నతఱి ఆమెను రక్షింపఁ బ్రార్థించితిని. మీరు నా కాప్తబంధువులై నన్ను నిరపరాధినని భావించినందున మీ కీరహస్యమునుఁ దెల్పవేఁడికొంటిని.

ఈ రేయి హంతకుఁ డిచ్చటికి వచ్చునని దృఢముగఁ జెప్పఁజాలను. శిరీషయొక్క మాటలవలన నే నూహించినదంతయు మీకుఁ దెలిపితిని. ఇఁక 25 తేదిరాత్రి నేను బొంబాయికిఁ బోయినకారణమును నేను వచింపఁజాలను. నా నిరపరాధత్వమును తా మిదివఱకే తమ మేధామార్గమున బరికించియేయున్నారు, వివేచనజ్ఞానమున దృఢపరచియే యున్నారు. కావున మీరు నేను వచింపఁగూడని యంశమును దెలిసికొనిననేగాని నానిరపరాధిత్వమును దృఢపరుపఁజాలరని నే తలంపను. నా దుర్వాచ్యకారణము లేకయే తాము పరిశోధనమహిమచే హంతకుని బంధింపఁగలరని నాదృఢవిశ్వాసము. దానికి వలయునంత సహాయము చేయుటకు నేను సంసిద్ధుఁడనై యున్నాను. కావలయు నేని దీనికన్న నెక్కుడగుభోజన నివాససౌఖ్యములయందలి సౌకర్యమును గలుగఁ జేయుదును, వలయు నన్ను నీ మహామందిరమునఁ గలయుండఱిని తమ మాట జవదాటకుండునటుల చేసెదను. కాని, నేను చెప్పఁజాలని కారణమును మాత్రము వచింపఁజాలను. కనుక దానిని మాత్రము నన్నడుగకుఁడు. దానిచే నాకెంత దుస్సహకష్టములు వచ్చినను ప్రాణహాని యేకిలిగినను దానిని భరించువాఁడ నని తనవాక్యహారమును ముగించెను.

ఇఁక నతనివలన నెట్టివిషయమునైనను సంగ్రహించుట దుర్లభమని యెంచి యతనిప్రార్థనానుసారము శిరీషరక్షణవిషయమున జాగరూకత వహింతునని వాగ్దాన మొనర్చి యాతనిని బంపివైచితిని. ఇంతలో మేము హోటలును బ్రవేశించితిమి.

# పదుహేనవ ప్రకరణము

నాకేమియుఁ దోఁచుటలేదు. హత్యాగహనమున చరించినందున నామానసము నానాభావములచే నిండియుండెను. నామిత్రుఁడు మాత్రము సఫలప్రయత్నుఁడైనట్లు గాన్పించుచుండెను.

నాఁడాసత్రమున శూరసింగు కాన్పింపలేదు. కావున నాహోటలంతయుఁ బ్రశాంతముగ నుండెను. ఆతనిభార్య మలయవతి మృదుమధురస్వరమున మాకు స్వాగత మొసఁగి ఫలహారములను పానీయములను మాముందుండుబల్లపై నునిచి వానిప్రక్కనె శుద్ధనీరములు గల పాత్రలను సైత మునిచెను. ఆమెవదనము మందహాసచంద్రికల గురియించుచుండెను. మేము వానిని భుజించుచు శూరసేనుని యుదంతమును బ్రశ్నించితిమి. ఆబాల "యాతఁడనారోగ్యముగ నున్నాఁడ"ని సవిలాసముగఁ బ్రత్యుత్తర మిచ్చెను. నామిత్రునిముఖమున చిఱునవ్వు నానావిషయములను మాకు గోచరింపఁజేయు సమయమున దినేశుఁడు వడివడిగ లోనికేతెంచెను.

దినే : ఓహూ! బలసూదనబాబుగారూ! అభివాదనములు, క్షేమమా?

బల : (ఆతని రాక కచ్చెరువందుచు.) దినేశ్‌బాబుగారా! ఒరిస్సానుండి యెప్పుడు దిగ్విజయ మొనర్చితిరి?

దినే : వార్తాపత్రికలయందు శిరీషకుమారి హత్యావిషయమును జదివి యీయమయారోగ్య మారయుదమని మొన్ననే వచ్చితిని. పంచాననబాబుగారు మాదేశవాస్తవ్యులు. కాన నాకు

వారిపరిచయము మెక్కువగఁ గలదు. ప్రస్తుతము వారిమేఁడయం దొకగది యందునివసించుచున్నారు.

బల : పాపము! శిరీష దుస్థితి చాల శోచనీయము. హంతకుఁ డెవ్వరైనదియు నింకవఱకును తెలియలేదు.

దినే : ఇదంతయు నాశ్చర్యముగనే యున్నది. హత్యోద్యమము నాఁటిరేయి దేవరపల్లి యరవును అంబికాచరణుని యాకస్మిక బొంబాయిప్రయాణమును నాకాశ్చర్యజనకములుగనున్నవి.

బల : అవును. పరిశోధనాసారాంశమున పెక్కువిషయము లతనికి వ్యతిరేకముగనున్నవి.

దినే : హత్యాగదినుండి హంతకుఁడు మాయమగువిషయమును ద్విజేంద్రలాలుగారు వచించిన తెఱంగునపంచాననునికి తెలిసియేతప్పించుకొని యుండవలయుననుట నిస్సందేహము. పంచాననునికి తెలియుట యొక్కటియేగాక యాతఁడు సమ్మతిగైకొనియే హంతకుఁడు వెడలెననుటయు నిర్వివాదాంశము. హంతకునికి మార్గ మొసంగవలయునన్న నతఁడు పంచాననునియొక్క ప్తకోటిలో నొక్కఁడుగా నుండవలయుననుటయు నిర్వివాదాంశ మేకదా? అయిననట్టి యాప్తుఁడెవ్వరు? అంబికాచరణునికన్న మిత్రుఁడును నాప్తుఁడును పంచాననునకు మ రెవ్వఁడుకలఁడు. అందును నతనితనయ మనసారవరించిపరిణయమాడనున్న వాఁడు కాఁడా యంబికాచరణుఁడు? కావుననే వెలివెట్టిన తనకును, వంశమునకును, కలుగు నపకీర్తియునకై వెఱచియే పంచాననుఁడు హంతకనిర్గమనమునకుసమ్మతించుట. అదియుఁగాక పంచాననునికి రసాయనశాస్త్ర పరిశ్రమాఫలితార్థమునంతయు వ్రాసియుంచినకాగితము లపహరింపఁబడలేదా? ఆకాగితములు రసాయనశాస్త్ర పారంగతుఁడగుట నంబికాచరణునకుఁదప్ప నితరులకేమిలాభము. వానినతఁడు కాక యితరులెవ్వరు హరించియుందురు?

బల : ఆ కారణముల కేమిలెండు, మీరు వచించిన కారణములతో యాతని నిర్దోషిత్వస్థాపన కుపయోగింపవచ్చును. నిందారోపణమే యొనర్పవలయు నన్న కారణములు తక్కువయగునా?

దినేశుఁ డేటికో మారువలుకక యందుండి వెడలిపోయెను. నాకాతని యాకస్మికాగమనమును శీఘ్రనిర్గమనమును నాశ్చర్యముఁగొలిపెను. బలసూదనుఁడు "స్త్రీలుసాహసమొంతేని నోవర్చుఁగదా" యనిపలుకుచు లేచెను! మేమిరువురమును ద్వారమును దాటుసరికి గృహోద్యానాధిపతియగు మదనమోహనుఁడు సగాంభీర్యగమనమున హోటలువైపు వచ్చుచుండెను.

# పదునాఱవ ప్రకరణము

"హాంతకుఁడు రెండుదినముల క్రిందటి రాత్రి మరల జయంతమందిరమున—శిరీషశయ్యాగారమునకు వచ్చియుండెను. ఆతనియాగమనోద్దేశమే నెఱింగితి కాని— యాతఁడు మేమందఱము చూచుచుండ మాకట్టెదుట మాయమయ్యెనన్నచో నీవు విశ్వసింపఁజాలవు. అయినను నది నిశ్చయమే" యని బలసూదనుఁ డాశ్చర్యచకితుఁడనై కాంచుచున్న ననుఁజూచి పలికెను. నేనంత "యసంభవము— ఈ ప్రపంచమున నింకను ప్రకృతిశాస్త్రవేత్తలు సైతమట్టి యద్భుతమును కనిపెట్టియుండలేదు. మానవుఁడనగ నేమి? మాయమగుట యేమి?" యని నేను మాఱుపలికితిని.

బలసూదనుఁడు మందహాసమున "నేనును ప్రథమముననట్లే తలంచితిని. కాని, యాశ్చర్యసాగరమునుండి విముక్తిఁగాంచిన యుత్తరక్షణమున మరల నాశేముషి నాసాయమునకే తెంచెను. మొదటినుండియు దానిపై నేనాధారపడక, వంగభాషాంతరీకృతనవలలయందలి విమర్శకులఁ బోలె, బహిర్విషయములకే ప్రాధాన్యమొసంగితి. కావుననే నాబుద్ధి యొకమార్గమును జూపుచున్నను ననుసరింపనైతి. అందుచేతనే నేనింత వఱకు దరిఁగానక భ్రమించుచుంటిని" అనుచు నేను మరల భైండరుకు చనుదెంచుటకు రెండుదినములు పూర్వము జరిగిన యాశ్చర్యకరవృత్తాంతము నంతయుఁ దెలిపెను.

ఆవిషయమంతయు నాలకించినపిదప నాకుఁగలిగిన యాశ్చర్యమునకు మేరయే లేదు. ఆవిషయములఁ దెలిసికొనుటకు ముందామహా సౌధ పరిచయ మత్యావశ్యకము.

మేడ యంతయు యెల్ (L) అను నాంగ్లేయాక్షరమును బోలి యుండెను. అందు రెండు శాలలు (హాలులు)న్నవి. శిరీషపంచానన, ద్విజేంద్రబలసూదనుల గదులున్నవి. పాఠకులు తొలుత, గృహపరిచయము కలిగినగాని, ముందుప్రకరణమునందలి యంశములు తెలియుట కష్టమగును.

హంతకుని ద్వితీయోద్యమవిషయముల నేను వచించుటకన్న బలసూదనుని దినచర్యపుస్తకమునందలి యంశములఁ బొందుపఱచుట యుత్తమమని యట్లొనర్చినాఁడ. ఆతనిదినచర్యపుస్తకమునందిట్లుండెను.

## పదునేడవ ప్రకరణము

"మార్చి 1 వ తేది                    రాత్రి 11—50.

నిశాకాంత మకుటధారణ ముహూర్తము సమీపించుచుండెను. పంచాననబాబు మందిరనిశ్శబ్దత, పౌరోహిత్యమును వహించియుండెను. ఆనిశాభామ యాసీనయైయున్న జయంతగృహావనసింహాసనముచెంతకు ఆనిశ్శబ్దపురోహితుఁడు తనకార్యమునిర్వహించుటకై యరుగుచుండెను. ఇంతలో మకుటధారణముహూర్తసమయము వచ్చెను. తోడనే, పౌరోహిత్యమువహించిన, నిశ్శబ్దత, తళ తళ మెఱయుచుండిన మెరుపు కిరీటమును, ఆనిశీథినీరమణికి ధరింపఁజేసెను. ఈసుసమయమున, దేవర పిల్లి యఱపు మంగళవాద్యమై తనరారెను. ఈమంగళవాద్యమే నన్ను నిద్రనుండి, మేల్కొల్పినది. ఈమంగళవాద్యనినాదము, జయంతమందిరపరిసరమునుండి వినవచ్చుచుండెను. ఇది నాకు కొంచెము విస్మయమునకెడమియ్యఁ నాగదినుంచి చిన్నహాలునకు వచ్చితిని. ఈచిన్నహాలునకు సూటిగ ముందుభాగముననున్న పెద్దహాలులోని దీపమొకటి తూగాడుచుండెను. ఈరెండుశాలలయందున్న దీపములెల్ల నింటికప్పునకు కట్టఁబడియుండుటవలన పెద్దహాలులోనిదీపములలో నిదియొకటి మాత్రము తూగాడుచుండనేలయని యోచించితిని. వెంటనే నా కొక యూహ జనించెను.

గాలిచేత నట్లు చలించుచుండనోపునని సమాధానతనొందితిని. ఆదీపమునకు నెదురుగనున్న చిన్నహాలుయొక్క చివరగోడయందలి గవాక్షమువంక దృష్టి సారించితిని. ఆకిటికీ తెఱవఁబడియుండెను. ఇది నాకప్పుడు పెక్కుసంశయములఁ గలిగించెను. ఈరెండుహాలులలోని

గవాక్షములన్నియు మూయఁబడియుండ నిదిమాత్రము ఎందునకు తెఱవఁబడియున్నదని యెట్టివారికిని సంశయముకలిగింపక మానదు గదా? కిటికీలన్నియు మూయఁబడుచో సేవకవసంతుఁడు మఱపుచే దీనినిమూయుటకు నేమైనమానియుండునా యనియోచనయు కలుగక పోలేదు. అయినను కిటికీలనన్నిటిని వరుసగ మూయునపుడు దీనిని మాత్రము మూయుటకు వసంతునకు మఱపుకలుగుట మిక్కిలి యసంభవమని తలంచితిని. ఐన దీనికి కారణమేమైన నుండవలయుఁగదా? అది యేది? ఒకవేళ నెవరిపైనైనను నేదేనియపరాధమును మోప నిట్లెవరైనను జేసియుందురా యని యోచించితిని. అచిరకాలమునందే నానేత్రము లపుడు నేలపైనున్న యడుగులగుఱుతులపై వ్రాలెను. అప్పుడే యెవరోయొక మనుష్యుఁడందు నడచియుండవలయునని నిర్ధరించితిని. నిపుణముగ సమీపించి పరిశోధించితిని. ఆయడుగులు సరోవరప్రాంతమున మనముతిలకించిన పెద్దబూట్సుగుఱుతులే యని నిస్సంశయముగ రూఢమయ్యెను. ఆబూట్సుగుఱుతులజాడ గవాక్షమునుండి శిరీషశయనాగారమువఱకు వ్యాపించియుండెను. నేనాగదికిపోయిచూచితిని. కవాటములు బంధింపఁబడియుండెను. కవాటమునకు తాళముచేయియుంచు రంధ్రముగుండ లోనచూచితిని. ఆగదియందు శిరీషపర్యంకశయనములే యందు కాన్పింపలేదు. ఆమెయు గోచరింపలేదు. పిదప నాయుపయులంకారభవనమును చూచుటయే నాకు శరణ్యమైయుండెను. నేనాగది కవాటములు తాకితాకకమున్నె నాకు దారియొసఁగెను. ఇట్లజాగ్రత్తగ కవాటములుబంధింపకుండుట విస్మయజనకమయ్యెను. ఇదివఱకు కడుజాగరూకతతో ద్వారములబంధించుట యొక్కటియెగాక తానొంటిగ శయనింపక సఖీసహితయై శయనించు శిరీషకుమారి, నేఁడిట్టులజాగరూకత యేలవహించెను? అందునను హంతకుని యాగమనదినమున మఱియు బద్రముగ కవాటముల బంధించుకొనుటకు మాఱు

వానిని తెలిపియుండుట నానాసంశయభావకుసుమగుచ్ఛమేకదా ? ఇదియుఁగాక, తనశయనమందిరమును త్యజించుటకు నామెయాశయమేమి? ఇదియంతయు నాలోచింప, శిరీషకుమారి ప్రవర్తనము మిగుల నద్భుతమై, యమేయమై తోఁచెను. ఆయమయేదియో యొకయుద్దేశమున నిట్లాచరింపసమకట్టినది. ఆయుద్దేశమెయ్యది? హంతకునిరాకకై యభ్యంతరమేదియు లేకుండఁజేయుటకై యుండునా! సంశయమేమి? అదియేకారణము. తనకు హింసకుఁడై యాపత్పరంపరలఁ గూర్చుచున్న వానిరాకకై యాసుకుమారి తానె దారికల్పించినదన్న నామెస్థితి యెంతశోచనీయము! ఆదురాత్మునినుండి తనఁదార్కొను ఘనతరాపదలనైన, నాయబల లెక్కింపలేదు. తనకెంతయో యింతయపయశమునకై లోలోనఁగుందుచున్నది. తనకసమ్మతమైన దవాగ్నిని తానే యింటఁ జేర్పవలసిన తనదుస్థితికై వగచుచున్నది.

పాపమాయబల యేమిచేయనేర్చు నను నూహాసోపానశ్రేణిగుండ నానిశ్చయము నడచుచుండెను. నేనావల సాహసించి నిశ్శబ్దముగ కవాటమునోరగ తెఱచికొని తదనంతరమును ప్రవేశించితిని. నేనట్లుప్రవేశించిన గదియందే శిరీషశయనమందిరమునకుఁ బోవుద్వారమొకటియు ఆమె యుడుపులధరించు నలంకారభవనమునకు చను ద్వారమొకటియును గలవు. విశ్రాంతిభవనమునకు ద్వారమిందేయున్నది. ఇప్పుడీద్వారములన్నియు తాళమువేయఁబడియున్నవి. కాని శిరీషశయననికేతనము మాత్రము లోపలబంధింపఁబడియు తాళము వేయఁబడియునుండెను. నేను విశ్రాంతిభవనద్వారమునొద్ద నిలిచితిని. దానికెదురుగశిరీషశయన గృహాముండుటపోల్చి చూచి యందేగితిని. ద్వారముచెంతకుచని కవాటము నానుకొని నాచెవినిడి యాలించితిని. ఎవరోయిరువురు సంభాషించిన సవ్వడి వినవచ్చుచుండెను. వారెవరు? కవాటముననుండు తాళము

చేయియుంచు రంధ్రముగుండ దృష్టిని లోనఁబఱపితిని. లోనదీపప్రకాశ మించుక మందముగనుండెను. ఆకవాట సూక్ష్మవివరమునుండి నాకొక మనుష్యాకృతిచ్ఛాయ గోచరించెను. ఆయాకృతి దనవీపును కవాట ద్వారమువైపుంచియుంచుటచే నాతని మోమును గాంచుటకు వీలుపడ దయ్యెను. సూక్ష్మబిలమునుండి యాకృతివిభాగము స్ఫుటముగ కనుపింప దయ్యెను.ఆయాకృతిచ్ఛాయగాక మఱేయాకృతియు నాకులోచనగోచ రముకాలేదు. శిరీష యేమైనది? ఎందున్నది? దీనిని చక్కఁగ కనఁగొన తలంపు నన్ను వేగిరింప మొదలిడెను. శిరీష యిందు లేకున్న నీయమను గాంచుటకై వచ్చిన హంతకుని కృత్యమిచ్చట నేమి? కనుఁగొనుసమయ మియ్యదియే. అపరాధపరిశోధకులపరిశ్రమ కెల్ల ఫలభూతుఁడై నహంతకుఁ డప్రయత్నముగ లభించుటచే నాతని సమ్ముఖమున దర్శింపనెంచి నేనుం డినగది వీడి ద్వారకవాటముల నిశ్శబ్దముగ యథారీతి మూసి హాలు గుండ నీరావముగనడచితిని. క్షణకాలములో సౌధసోపానపఙ్క్తిని దిగి తిని. అచ్చటనే సేవకవసంతుని గదియుండుట జ్ఞప్తివచ్చెను. ఆతనిగాంచి ప్రస్తుతకార్యమున నాతని సాహాయ్యమునఁబడయుటకై యాగదిచేరితిని. ఆతనితో మాటలాడుటకు వేఱొకకార్యమున్నైతము నన్నుదొబ్రధించు చుండెను. హాలులోని కిటికీలన్నిటినిమూసి యాకిటికీని మాత్ర మాతఁ డేలమూయలేదో ప్రశ్నించి తెలిసికొనుటయే కార్యముకదా! వసంతుని నివాసమందిర కవాటము తెఱవఁబడియుండెను. వసంతుఁడు యుడుపులధరించికొని యేలకోయుపవేశించియుండెను. ఇతఁడర్ధరాత్ర మయ్యు నిద్రింపక నిద్రానసనములఁ ధరింపక యథారీతి వసనాదులధరించి మేలుకొనియుండుట కేదియో కారణమని యద్భుతపరిపాటిని కలిగించెను. ననుఁగాంచి వసంతుఁడును విస్మయమందకపోవఁడుగదా. అట్లుమేమిరువు రము పరస్పరాశ్చర్యమున మునుంగుట పాఠకులకాశ్చర్యము గొలుపదు గదా? మాయిరువురి యాకస్మికసంఘటనము మఱియొక సంఘటనమున

కెదురుచూచుచున్నది, నను(గాంచి వసంతుఁడు నావిస్మయమును బోపుటకై మొదట ప్రయత్నించెను. వెంటనే నను(గాంచి "ఆర్యా! ఇంతకుముందే యీకఘోరనినాదము నానిద్రాభంగమునకు కారణమయ్యెను. ఆశబ్దమెయ్యదియో తామూహింపఁజాలరా? ఆమాలవిముండ నీపరిసరమునుండి వెడలఁగొట్టినఁగాని మేమిఁకనిందు మనఁజాలమనియేమో వచించుచుండ బలసూదనుఁడడ్డమువచ్చి—

"వసంతా! మేడపై గవాక్షములన్నియు భద్రముగ లోనబంధించితివికదా?" అనవసంతుఁడౌనని తలయూప "నందొక గవాక్షమిప్పుడు తెఱవబడియున్న" దనివచించెను. "సంభ్రమాశ్చర్యములు ముప్పిరిగొన వసంతుఁడేమియో పలుకనుండ వారించి మాటాడకుము—నిశ్శబ్దముగ రమ్ము—హంతకుఁడు శిరీషగదియందున్నాఁ"డని పలికెను—వసంతుఁడు నిశ్చేష్టితుఁడయ్యెను.

# పదునెనిమిదవ ప్రకరణము

“అంధకారనిశ్శబ్దతా వాయువులు మాకన్న ముందంజవేయుచుండెను. మా యాతురత వాని నోడింపసమకట్టి వానికన్న ముందు పరు వెత్తుచు నొక్క క్షణమున శిరీషశయనాగారగవాక్షము చేరెను. దాని సహాయముననే మేమును నతిశీఘ్రకాలముననే శిరీషశయనాగారమున్న ప్రాంతము చేరితిమి.

మా యాతురత జయమునుగాంచి, సన్మానింపనెంచియో యన, శిరీషశయనించుగది గవాక్షద్వారములించుక తెఱవఁబడియుం డెను. అపుడు నాకుఁగలిగిన సంతసము వర్ణనాతీతముగదా! ఆగవాక్షము మాత్రము చేరఁగలిగితిమా?—ఏల చేరరాదు? తత్క్షణమే క్రిందపరికించి తిని. సాధనములు లేక భూమికిరువది గజములకన్న నెక్కుడుగ నెత్తున నున్నగవాక్షము చేరు టెట్లు—హంతకుని పరికించు టెట్లు? ఆ—మఱచితి. మదనమోహనుని గదిచెంత నొక నిచ్చెనచూచియుండలేదా! తోడనే వసంతుని నా నిచ్చెనతీసికొని రా నాజ్ఞాపించితి.

అంధకారమును, నాఁటి రేయివిషయములును వసంతుని మనో వీధిసైతము నంధకారమును వెదగొల్పి యతని నంధునిఁజేసెను. అయిన నాయాజ్ఞాకరణమును చేయుమాత్ర సాయమున వెడలిపోయెను.

హంతకుఁడసాధారణప్రతిభాశాలియనుటకు తెఱచియున్నగ వాక్షమును నొక్కతార్కాణమేకాదె—దానిని కొద్దిగమూసియున్న కలెనవందలి దీపప్రకాశము వెలుపలికి కనుపింపదు. కాననెవ్వరేనినీ సమయమున నిందువచ్చుట తటస్థించినచో లోననెవ్వరో యిట్టియర్ధనిశీథ

సమయమున సైతము మేల్కాంచియున్నారని యెఱుంగఁజాలరు. ఒకవేళ ద్వారమునుండి యెవ్వరేని లోనప్రవేశించుట సంభవించినేని హంతకుని నిర్గమనమున కీగవాక్షమే యాధారమగుకదా! నేనాతని ఆగమనమును నెఱుంగుటగా దేవరపిల్లి వికృతనినాదమే కాదా కారణం!

ఇట్టి సమాసప్రతిభాశాలితోడి శేముషీ మహాసంగ్రామమున సంపూర్ణజయశ్రీ ననువరింపనున్నదికదా! ఆహా! ఇంకను వసంతుఁడు రాఁడయ్యె. అందునిచ్చినవెవ్వరైన తీసివుంచిరా? లేక హంతకునకుసాయము నొనర్పుటకై యతని అనుచరులెవ్వరైన దానిగుప్తస్థానమునదాచిరా! లేదు. శిరీషహత్యాపరాధమున హంతకుఁడొక్కఁడే. ఆతనికి సహాయులెవరును లేరు. అయిన వసంతుఁడేల యింకను రాఁడయ్యె! ఆలస్యమొనరించిన హస్తగతమగు పక్షిరాజ మట్టె యెగసిపోవునేమో!

ఆసందేహవార్ధి నీదఁజాలక నేనే దానికై పోయెదనని కొన్ని అడుగులనడిచితిని. అంతయునిశ్శబ్దం. ఎందును నంధకారమహార్ణవమే. వాయువుసైతము హోరునవీచుచు వృక్షములపై ప్రసరించి మహాధ్వనిచేయుచు హంతకునకే సాయమొనర్చుచుండెను. ఆ మహాశబ్దసాగరమున వసంతుని పాదవిన్యాసధ్వని యెందువిలీనమయ్యెనో!

మరల కొంతదూరమేఁగితి. ఇప్పటికి నాకనులంధకారమున కలవాటు పడియుండెను. కొంతదూరమున నొకయాకృతి నావైపునకే వచ్చుచుండెను. అయ్యది వసంతుని దేయైయుండవచ్చును. ఆతఁడు నిచ్చెనఁదెచ్చెనా? అంధకారమును భేదించుకొని నాచూడ్కులావచ్చుచున్న యాకృతివంక సావేగముగ ప్రసరించెను. లేదు. ఆవచ్చు మనుష్యాకృతి హస్తమున మరేద్దియును లేదు. నిరాశ—ఇచ్చటసైతము దైవము హంతకునికే సాయమొనర్చెను.

నేనంత తాళఁజాలక వసంతుని కెదురేఁగి "అందానిచ్చెనలేదా" యని సావేగమున నడిగితిని. వసంతుఁడూరక లేదనెను. నాయూహయే

నిక్కవమగునా ? హంతకుని యనుచరులెవ్వరైన దానిదాచిరా ? అపుడు తటాలున నొకవిషయము జ్ఞాపకమునకు వచ్చెను. మదన మోహనుని గదులు చక్కచేయఁబడుచుండ లేదా ? అతనినివాసము ప్రకృతము భవన పశ్చిమభాగమునందలి గదులయందుకదా ? అతని నివాసము మారినతరి నందలివస్తువులుసైతము మేల మారియుండరాదు !

తత్క్షణమే మదనమోహనుఁడు ప్రకృతము నివసించు గదులవైపు వెడలితిని. నాకు వసంతుఁడే మార్గదర్శిఅయ్యెను. మాగమన మతిత్వరిత మగుచున్నను నామనోవీధి పెక్కు యోచనలు, పలు సందేహములు, మెఱపు మెఱసినచందమున నుత్పన్నములై . యుత్తరక్షణముననే లయ మగుచుండెను.

మదనమోహనునిగది, మహాసౌధమునకు దక్షిణభాగమున నుండెను. కిటికీతలుపులపై బంగరు రేఖలవలె ప్రకాశించుచున్న దీపపు కాంతినిఁ గాంచి యతఁడు మేల్కాంచియుండునని తలఁచి యతనిని పిలిచితిని.

లోనుండి యెట్టిప్రత్యుత్తరమును రాలేదు. వసంతుఁడంత మరలఁబిల్చుచు తలుపుతట్టెను. ఆశ్చర్యము—తట్టినంతనే కవాటములు తెఱవఁబడియెను.

ఆశ్చర్యమున లోన ప్రవేశించితిమి. కాని యాదినమునిట్టియు నాశ్చర్యములే దోఁచుచుండెను. లోన మదనమోహనుఁడు లేఁడు. అతఁడు రాత్రిధరించు నుడుపు లందే యున్నవి. శయ్య వేయఁబడి యుండెను. కాని యందెవ్వరును శయనించిన చిహ్నములు కనుపింప లేదు. నిచ్చెనయు లేదు.

# పందొమ్మిదవ ప్రకరణము

మదనమోహనుని గదియందు శూన్యదేవత నర్తనమొనర్చుచుండెఁగాదా? ఆమె స్వేచ్ఛావర్తనమున కభ్యంతరము గొల్పిన మమ్ముల నుత్తరక్షణముననే యందుండి వెడలఁగొట్టెను. అందుండి వెలువడినను యోచనాసాగరమునుండి మాత్రము వెలువడఁజాలనైతి. దానితరింపనే ప్రయత్నించినకొలందియు నాపయోధి గభీరమై, యపారమై, యొప్పుచుండెను,

మదనమోహనుని గదియందలి శూన్యదేవతానర్తనము నాకించుకాశ్చర్యజనకమై చూపట్టినను నదియొకనిముసముకన్న నెక్కుడు నను బాధింపలేదు. కాని, నిచ్చెన యేమయ్యెను? ఇట్లాలోచించుచుఁ బోవుచుండ నొకప్రదేశము సమీపించితిమి. మేడయందలి చిన్నహాలులో తెఱవఁబడియున్న గవాక్షమునుండి క్రిందనున్న గడమిద్దె నాలుగడుగులక్రిందనుండుట వర్ణింపఁబడివున్నది. ఆగది పాచకునిదైనను, ప్రస్తుతమతఁడు భార్యాసహితుఁడై యుండినందున వేఱొకగదియా దంపతులకొసంగఁబడియుండెను. కావున ప్రకృత మాగదియందెవ్వరును లేకున్నను దానిని మనము పాచకునిగదియనియే పిలుచుచుందము. మేమిపుడు చేరిన దా పాచకుని గదిద్వారము.

ఆగదిద్వారసమీపముననే మేమంతయాతురతతో నన్వేషించుచున్ననిచ్చెన గోడకుఁ నిలువఁబెట్టఁబడియుండెను. మరునిమేషముననే యయ్యది వసంతుఁడు గైకొనెను. మరల మేము శిరీషశయనాగారసమీపప్రదేశమును సత్వరగమనమున చేరితిమి.

నిచ్చెన నధిరోహించితిని; శరీరమంతయు నిచ్చెనపైనుండ శిరముమాత్రము నిశ్శబ్దముగ పైకెత్తితిని. అందొకపురుషుడు శిరము వంచుకొని ముందుబల్లపైనున్న కాగితముపై నేదియో వ్రాయుచుండెను. ఆతనివీపుమాత్రము నాకుఁ గాన్పించెను. ఆహా! యేమి యాతని స్థైర్యము. నిరపరాధియగు గృహమేధి స్వగృహమున జగన్నుతసత్కార్యము నెట్లనన్యథామనస్కుఁడై నిర్భయముగ స్వీయకార్యోపారంభము నకైగడంగునో హంతకుఁడును నట్లే యుట్టిస్థైర్యమున నేయుంచెను. వాలు వందలి యాతని కాలిగుఱుతుల నేచూడకున్న నతఁడు హంతకుఁడని తెలియ నేరితరము.

ఇపుడు నాకర్తవ్యమేమి? హంతకునినిర్బంధింతునా? యెట్లు? నేను గవాక్షముగుండ లోనికరిగితినా? అతఁడు ద్వారమునుండి తప్పించుకొనును. బలసూదనా! అంతయు నీపై నాధారపడియున్నది. త్వర పడిన కార్యనైఫల్యము సంభవించును. హంతకుఁడు ధీశాలియేయైనను నీకును దైవము సమానశేముషి నొసంగియున్నవాఁడు. కానిమ్ము చూచెద. వాఁడెట్లు తప్పించుకొనునో? నాకార్యక్రమమంతయు నిపుడే నిర్ధరించి, నిశ్శబ్దముగ క్రిందికరుదెంచితిని. వసంతుని నావెంట రాసంజ్ఞ చేసి వడివడి మురల గృహమున కరుదెంచితిని.

మేడనధిరోహించుచు "వసంతా! నీవు నిశ్శబ్దముగ పంచానన బాబు శయనాగారముచేరి యతనిని మేల్కొల్పుము. ఉడుపులధరించి పిస్తోలునుగైకొని సిద్ధంగనుండునట్లొనర్పుము. విషయంలమాత్రమేమియు వచింపకుము. హెచ్చరిక" వానినట్లుపంపి నేను ద్విజేంద్రునిగదికేగితిని. ఆతని గదితట్టుచు మూఁడునాలుగుమారులు మెల్లగఁబిలువ, నాతఁడు కన్నులు నులుముకొనుచు, తలుపుతెఱచి, "బలసూదనబాబుగారూ! మధ్యరాత్రమునసైతము తమవిమర్శనాతంత్రములకు విశ్రాంతి లభిం

పదా" యని యించుక కోపస్వరమునఁబలికెను. నేనాతనివారించి "మాటల కవకాశము లేదు. హంతకుఁడు శిరీషశయనాగారమున నున్నవాఁడు. మన మాతనిని బంధింపవలయు" నంటిని.

ద్విజేంద్రుఁడు క్షణకాలమాత్రము చకితుఁడయ్యెను. ఉత్తరక్షణము ననే మందహాసమున పరిహాససూచకస్వరమున "మీకు నిద్ర యందుమేల్కాంచినవానివలె సంచరించునభ్యాసము లేదుగదా!" అనియెను.

నేను—ఏల ?

ద్విజే—మీరు హంతకుని కనులార పరికించినవానిచందమున మాటాడుచున్నారు. నీ నీసాయంకాలమేకదా హంతకుని బొంబాయి వఱకు వెంబడించి, యొకసురక్షితస్థానముఁజేర్చివచ్చితిని!

నేను—మీరనునది యంబికాచరణుని విషయమా! అతని విషయమున మీయభిప్రాయము మార్చుకాలము త్వరలోనే రాఁగలదు.

పిదప నాతనికి సంక్షేపముగ నే పరికించిన విషయములఁ దెలిపి యతనిసాయమపేక్షించితి. ద్విజేంద్రుఁడును నంగీకరించి "యీకార్య భారమంతయు నీయదియే. ఒకవేళ హంతకుని నిర్బంధించిన, నాకీర్తి యంతయు నీయదే. కావున నీవాజ్ఞాపించినట్లే నొనర్చెద. చెప్పుము, ఇపుడు కర్తవ్యమెద్ది" యని ప్రశ్నించెను. "వచింతు" రమ్మని అతనిఁ దోడ్కొని పంచాననబాబు గదిచేరి యాతని సావేగప్రశ్నలకు సూక్ష్మముగ నుదంతమువచించి, వారా హంతక నిర్బంధన మహానాటకమున నటింపవలసినపాత్రల బోధించితిని.

నామార్గమతిసులభము. నేను మరల క్రిందికిఁబోయి. నిచ్చెన సాయమున,గవాక్షముగుండ శిరీషశయనాగారము జొత్తును. హంతకుఁ

డంత శయనాగారమునుండి యుపదేశించుగది చేరవలయు. అందు రెండేద్వారములున్నవి. అందొకటి వస్త్రాలంకారాదు లొనర్చు కొనుగది. అది ప్రకృతిములోన బంధింపఁబడియుండుట నేచూచియే యున్నానుకదా! కాన, హంతకుఁడు రెండవద్వారముగుండ పెద్దహాలు ప్రవేశించును. హంతకుఁడు హాలు ప్రవేశించినంతనె వెలువమటకు ముందే తెఱచియున్న హాలునందలి గవాక్షమువైపు పరువెత్తును. చిన్న హాలు ఉవరభాగమందున్న ద్విజేంద్రుడును వానినడ్డగించును. పెద్ద హాలులో పశ్చిమభాగమున వసంతుఁడు నిలిచియుండును.

ఇంక పెద్దహాలునందు మేడనుండి క్రిందికిఁ బోవుసోపానముల చెంత పంచాననబాబుండును. కాన నామార్గమును హంతకునిగమనము నకు నిషేధింపఁ బడినట్లయ్యె.

హంతకుని నేనట్లు వెంబడించి, యతండు పెద్దహాలు చేరినంత నే నేనొకయీల వైచునట్లును తోడనే యుందఱును పెద్దహాలును చిన్న హాలును కలియుస్థానమునకు పరువెత్తిరావలయు నని యుఁగూడ బోధించి తిని. అపుడు హంతకుఁడు మానలువురిమధ్యమున చిక్కును. నేనీల వైచుపఱకు నొక్కరును తమస్థానమును వీడకూడదు.

ఈయేర్పాటు విధమున నందఱికిని బోధించి వారివారిస్థానముల కనుప మూఁడునిముసములయ్యెను. ద్విజేంద్రుఁడు హంతకుని గదినీవొక్కఁడవే ప్రవేశించుట యపాయకరము. కాననాపిస్తోలునుగైకొని పొమ్ము. నాకిందు దానియావశ్యకత యుండదనుచు తనపిస్తోలు నొసంగెను.

వారినందఱిని నియమిత స్థానములనుండునట్లు చేయుభారము ద్విజేంద్రునిపై నిడి నాకార్యసాధనమునకై నేను వెడలితిని. హంతకుఁ డింకను నందే యుండడా? తప్పక పట్టువడియే తీరవలయు. మరలనిశ్శబ్ద ముగ నిచ్చెననధిరోహించితి—అత్యాతురతచే నాహృదయము

బద్ధలగుచున్నట్లుండెను. ఎట్లో కుదుటఁ బఱచికొని మరలతలయెత్తి గదియందు పరికించితిని.

ఆహా! ఎంతసంతసము. హంతకుఁడింకను నందేయుండెను. కాని దీపమిపుడు నేలపైనున్నది. అతఁడిపుడు కుర్చీపై లేడు. క్రింద నేలపై వంగియుండెను. ఆ క్రిందనున్న దీప మాతని నీడ నసంభవాకృతిగఁ జేయుచుండెను.

ఇదియే సమయము. నిచ్చెన పైభాగమునకు గవాక్షము నాలు గంగుళములయెత్తుననుండెను. కావున నిచ్చెనమీఁదనిల్చి కిటికీఁ జట్టఁబట్టుకొని నా దేహమునంతయుఁ బైకిలాగికొనవలయును. వాయుసంచారము లేదు. అంతయు నిశ్శబ్దముగనుండెను. నాయుచ్ఛ్వాస నిశ్వాస శబ్దముల ధ్వనియే హంతకునికి నాయాగమనముఁ దెల్పునేమో యను భీతి నొక నిమేషము మనస్స్థైర్యమునకై నిచ్చెనపై నాగితిని.

గవాక్షమునందలి కఱ్ఱను దృఢముగఁబట్టికొంటిని. మెల్లగ పైకి నాశరీరమును చేర్ప యత్నించితి. నాపాద మొకటి కిటికీచేరెను. కాని ఆఁ దురదృష్టము—అందున్న పాషాణమొకటి నాపాదము తగులుట వలన నందుండిజారి నిచ్చెనపైఁబడి మహాశబ్దముకలిగించెను. తోడనే నిచ్చెనసైతము మహాశబ్దమున క్రిందఁబడెను.

పిదప జరిగినదంతయు నొకక్షణమాత్రమె—క్రిందనున్న హంతకుఁడు తటాలున నావైపు·నిజసునిశితశస్త్రపాతములఁబఱపి యందుండి యొక్కపకుగున, నేనూహించిన తెఱంగున, ప్రక్కనున్న యుపవేశించు గదిఁజొచ్చెను. అతఁడా గది ద్వారముదాటు క్షణమే నే నా కిటికి నెక్కి గదిలోనికి లంఘించితిని. వెనువెంట పరువెత్తితిని.

హంతకుని నతివేగముగ వెంబడించి పరువెత్తుచున్నను నాచూపు లింతకుముందు హంతకుఁడు వ్రాయుచున్న బల్లపైఁ బ్రసరింపక

మానలేదు. అందొకకమ్మ యుండుట తెలిసికొనుటయు నాశీఘ్రగమనమున కంతరాయము కల్పింపలేదు.

నే నా యుపవేశించుగదియందు కాలిడు క్షణముననే హంతకుఁడు హాలులో ప్రవేశించు తలుపు తెఱచెను. ఉత్తరక్షణముననే యతఁడు హాలు చేరి చిన్నహాలునందలి గవాక్షమువైపు పరువెత్తెను. ఉత్తరక్షణముననే మే మేర్పఱచికొన్నవిధమున నీల వైచుచు పరువెత్తితిని.

మే మేర్పఱచుకొన్న విధమునయంతయు ప్రవర్తిల్లెను. నాకు హంతకునికి 8 గజముల దూరమున్నది. హంతకుఁడు హాలులో పరువెత్తుచుండెను. నాయీలవినిన పంచాననుఁ డతని కొకగజము దూరమున పరువెత్తుచుండెను. ఎదుటనుండి వసంతుఁడు వచ్చుచుండెను. నానోటినుండి హంతకుఁడు చిక్కె-కదాయని సంతోషమున "హా" యను కేక వచ్చెను.

మరియొకక్షణము హంతకుఁడు చిన్నహాలువైపు తిరిగెను. ఉత్తరక్షణముననే పంచాననుఁడా స్థలము చేరెను. నేను నచ్చోటికిఁ బోవునప్పటికి "చిక్కె-చిక్కె" నని యొక్క-హస్తమునను గట్టిగ బట్టుకొనియె. మఱియొక కంఠస్వరమున "హంతకుఁడు-హంతకుఁడ"ను ధ్వనియు నొకరిని గట్టిబట్టుకొను శబ్దమును వినవచ్చె.

అందఱము నందుంటిమి-ఒకరిమోముల నొకరు మాచుకొంటిమి. వసంతుని హస్తము నన్ను బట్టుకొనియుండెను. ద్విజేంద్రుఁడు పంచాననుని బట్టుకొనియుండెను.

అయిన—. ఆశ్చర్యము మాకట్టెదుటనే హంతకుఁడు మాయమై యుండెను. మేము నలువురమే యందుంటిమి, హంతకునిమాని మావారి నొకరిని బట్టుకొనియుండిరి. హంతకుఁడేమయ్యెను. తిరస్కరిణీవిద్య నాశ్రయించెనా? వాయువునందు లీనమయ్యెనా?

మామకనయన మాలామండలమహామధ్యమున నస్మదీయ శేముషీఘనాఘనతటిత్ప్రభాగోళమున హంతకుఁడు విలీనమయ్యెను. అద్వైతరీతి నీరూపుఁడయ్యెను.

# ఇరువదియవ ప్రకరణము

"శూన్యము. నామనోవీథియందంతయు శూన్యము. నాపరిశోధనా పాండితియంతయు గంగలోఁగలసెను. బలసూదముని శేముషీ ప్రతిభలు నష్టోటముసిఁగెను. నాకన్న సామాన్యరక్షకభటుఁడే రహస్యాపరాధ పరిశోధనకార్యమునకు సమర్థుఁడు. చేతఁజిక్కినయపరాధిని బంధింపఁ జాలని నాసామర్థ్యమేల. కాల్పనే?"

అయిన నే నెందుపొరఁబడితిని? నేనంతయు యోచించియే యొనర్చితిని. నా యోచనాతంత్రము లంకలి ప్రతితంత్రమును సుదృఢముగనే యుండెను. అయిన నిపుడేల హంతకుని బంధింపవయ్యె? హంతకుఁడు మానవాతీతమహిమచే తిరోధానుఁడగుట చేకదా?

ద్విజేంద్రపంచాననాదు లాశాలలందంతటను హంతకుఁడు దాగుటకు గాని మాయమగుటకుఁగాని యేదైనమార్గమున్నదాయని పరీక్షించుచుండిరి. గోడలయం దెంకును, రహస్యద్వారములుగాని, గదులుగాని లేవు. మేడయంతయు బండలచే పరుపఁబడియుండినందున నేలపై పాతాళ గృహములు లేవు. శాలలందు మనుజుండు దాగుట కెట్టివస్తువులును లేవు.

నాకేమియుఁ దోఁచుట లేదు. నేను హంతకుని కనులారఁ జూచితిని. మిగతవారిని ప్రశ్నించితిని.

వసం—హంతకుని యుచ్ఛ్వాసము (గాలి) సైతము నా మోమున సోఁకినది.

పంచా—నాకరమున నాతనివస్త్రములసైతము స్పృశించితిని.

ద్విజేం—నాకర మాతని దేహామునకు సోఁకెను- అట్టివాఁడెట్లు మాయమయ్యెను ?

మేమిట్లు పిచ్చిపట్టినవారికై పడి నందఋముదమ తమవిషయముల వచించుచుండ “ జానకా ! విషయమేమి ” యని యెవరో మృదుమధుర స్వరమున పలుకరించిరి ఉపవేశించు గదిద్వారమున సుందరీమణియొా ర్తు నిలువఁబడియుండెను.

ఆమెమోముసం దాతురత, విషాద, భయము లొండొంటిని మీరుటకై కలహించుచుండెను. మోమున ధావళ్య మామె కొక వింత కాంతి నొసంగుచుండెను. ఆమెకింకను సంపూర్ణస్వాస్థ్య మలవడి యుండలేదు. ఆయమ యెవ్వరో పాఠకు లూహింపఁజాలరా? ఆమెయే మన కథానాయికి. ఆమెను రక్షించుటకే యిండఱిందు చేరియుండుట.

ఆమెను గాంచినంతనే పంచాననబా బామెచెంపఁజేరి కర మంది గద్గదస్వరమున యుదంతమంతయు వచించెను. శిరీష తెల్లఁబోయెను. పంచాననుఁడంత “ కుమారీ! నీవేల-నీశయనాగారమును వదలి వేఱొకగదియందు శయనించితి ” వనియడిగెను. అందుకాయువతి “ హత్యోద్యమమునాఁటి రేయినుండి నేనొంటిగ పరుండవలయునన్న భీతి కలుగుచున్నది. ప్రక్క-గదియందే పరిచారికలున్నను నాకుధైర్యము కలుగదయ్యె. కావున నేనును వారిగదియందే నిద్రించితిని. ” అని వచించెను.

పంచాననుఁడంత, మరల నాపదనుండి విముక్తయైన కుమారిని కౌఁగిలించికొని యొకపరి నాకేల చెప్పవైతివని కోపమునను, మరియొకపరి ప్రార్థనాపూర్వకముగను నుడువుచు, నవ్యస్తచిత్తునిఁబోలె, చిరకాంక్షితము లభించినబాలునికైవడి నటించుచుండెను. అతఁడొక మారేడ్చును- మరియొక మారునవ్వును. ఇఁకనీప్రక్క-గదియందే నేనును పరుండెదనని ప్రతిమాలును.

ఆ దృశ్యమును పరికించిన నట్టికటికమానసమైనను ద్రవీభూతము కాకమానదు. ఇపుడు మేమందఱ మా మె యుపవేశించుగది యందుంటిమి. ఈ దృశ్యమును గాంచిన నాకన్నులశ్రుబిందుపూరితము లయ్యెను.

ద్విజేంద్రుఁడు దీపపునీడయందు నిలిచి యధోముఖుఁడై క్రింద నేదియో వెదకుచున్నవానివలె నిలిచియుండెను. వసంతునికన్నులనుండి యశ్రుధారలు ప్రవహించుచుండెను.

నేను హంతకుని వెంబడించుచో బల్లపై నొక జాబు చూచితిని కదా! అదియిపుడందున్నదా! లేదు. అయిననేమయ్యెను! శిరీషయే దాఁచివుండవలయును. అయిన నాకమ్మ ఆమెకొరకై వ్రాయఁబడినదా అయ్యో! ఈతన్విరక్షణపై యెందఱిసౌఖ్యములు—ఎందఱి యాశాలతలు నాధారపడియున్నవి. ఆమెయే హంతకునికి దారియొసంగుచుండ, నింకెవ్వరు రక్షింపఁగలవారు! ఆమె యొక్కమాట వలంచిన నీలపద-ఈసంశయవాహినులు—యీప్రయత్నములు—నన్నియు తొలఁగును కదా! పసితనముననే యీఘోరరహస్య మీమె హృదయకమలము నుండి వెలువడఁజాలక, యీచిన్నజీవితవృక్షమును మొదలంట ధ్వంసమునర్చుచున్నదికదా! ఆమెను రక్షించువారులేరా! లోలోన, క్షణక్షణమునకును నింతింత నశించుచున్న యీ మెనుద్ధరించువారు లేరా! కలఁడు—కలఁడు—ఈ బలసూదనకుమారుఁడొకఁడే యీమెను రక్షింపఁగలఁడు; రక్షింపనున్నాఁడు.

అయ్యో! ఎట్లు రక్షింపఁగలఁడు! కృపాణహస్తుఁడై వధియింప నేనెంచు వేటకానిచెంతకు చెంగుచెంగునకరతెంచు కురంగకన్యవోలె, నీతరుణియే హంతకుని హత్యోద్యమమున కెదురేఁగుచుండ నెవ్వరు రక్షింపఁగలరు! రహస్యాపరాధ గృహకవాటముల నీతన్వియే చేసేత

మాయుచు, హాంతకుని సంరక్షించుచుండ తత్కార్యభేదనమునకై పూనువా రెవరు?

నిజరహస్యగోపనమునకై ప్రాణములనేని నర్పింప సిద్ధముగ నున్న యీధీరచారిత్రపట్టుదల కేమందును? కావుననే హాంతకుఁ డీమెను నిర్బంధిగ బాధించుచున్నవాఁడు. ఇట్టి యల్పజీవితచారిత్రమునకై తను నిగూఢరహస్యప్రకరణముంగూర్చిన యీవిధాతకాఠిన్య మెంతనిందింప వలయు? అంబికాచరణుఁడుసైత మీరహస్య మెఱింగి, తద్రక్షణార్థమై ద్విజేంద్రుని నిందారోపణతంత్రబంధనములనేని సరకుగొనకున్నవాఁడు. అరహస్యమంతయు "ప్రార్థనామందిరమింకను తనసహజసౌందర్యమును బాయలేదు. ఉద్యానవన మింకను నిజరామణీయకమును బాయలేదు" అను వాక్యములందే యిమిడియున్నది! లేకున్న నేనీపలుకుల నుడివి నంతనే యాతఁడు వైవర్ణ్యము నందనేల?

ఈ రహస్యపమోధి వారు తలఁచురీతి దుస్తరణీయమా? కాదు కాదు, అది యీ బలసూదనునికి తెలిసియే యున్నది. శేషించిన కొన్ని యంశములుసైత మాతఁ డెఱుంగఁగలఁడు. అతని నిరోధింపఁ గలవా రెవ్వరు?

హాంతకుఁడు నిర్బంధింపఁబడరాదు. అతఁడీరహస్యచారిత్రమును ప్రకటింపరాదు. అతని రహస్య ప్రకటనాశక్తినిమాత్రము విధ్వంస మొనర్పవలయు. జగద్రంగమున నాతఁ డున్నను లేకున్నను నీమెబారికి మాత్ర మతఁడు చావవలయును. పిదప నంబికాచరణుని రక్షింపవల యును. అంతమిటిమీరిన నాచే హాంతకుని మరణమేని సిద్ధింపవలయుఁ గాని రాజకీయనిర్బంధమున కతని గుఱి చేయకూడదు.

ఔను హాంతకునినోటికి మౌనముద్రవైచి, జగద్రంగమునుండి తొలఁగించినఁగాని యీాతన్వికి సుఖము కలుగఁజాలదు. ఆహా! ఏమీ! హాంతకుని మాయింప నేనును, హాంతకుఁడను గావలయునా? న్యాయమా

న్యాయముల నిమర్శించి న్యాయసభల న్యాయాధిపతుల శిక్షావిధాన మున హంతకులైనను నగుదురుగాక! సాపరాధియైనమాత్రమున నతని జీవితవృక్షమును విధ్వంసమొనర్ప నేనెవ్వండను! అపరిచితయగు నీబాలిక సకారణముగనో యకారణముగనో మౌర్ఖ్యమువహించి నిజ ప్రాణరక్షణమున నిర్లక్ష్యభావమునమండ, హత్యకైన నియ్యకొని నేనేల యామెను రక్షింపవలయు?

ఆహా! అదేమి! రసాయనశాస్త్రపారంగతుఁడై, నిజపరిశ్రమ మేధాశక్తుల ఖండాంతరవాసుల పొగడ్తకుసైతము పాత్రుఁడైన పంచాననబాబు మూర్ఖబాలునిచందమున నటించుచున్నాడు. కన్నుల నీరుగారుచుండ మోమున సంతసము తాండవమాడుచున్నది. అతని మాటలన్నియు నవ్యక్తములే. ఔరా! పుత్రికాప్రేమ వర్ణనాతీతము గదా? ఆతని యపారప్రేమ కీకుమారి యర్హురాలా? అయిన నీరహస్య గోపనమేల? ఆమె సాధ్వియేయైన నామెజీవితనాటకమంతయు విషా దాంతముగ నొనర్చు నీరహస్యమున కేమనవలయు?

కాదుకాదు. ఆమె యపరాధినికాదు. ఆమెమోమున సాధ్వీత్వ లక్షణము లుట్టిపడుచున్నవి. ఆమె సాధ్వియనుట నిక్కము. నిస్సందే హము. కాకున్న నారహస్యమెఱింగిన యంబికాచరణునంతటివాఁ డామె నింకను ప్రేమించుచుండెను. ఈతన్నీరహస్యము దుండగీడుల కల్పనాతంత్రసంజనితము, అమాయికయై, లోకమునంతయు తనవలె భావించి, యందఱిమాటలను హృదయనిర్గతములని విశ్వసించి, కరుణా క్షమాగుణముల ప్రకటించుచున్నందున కలిగియుండవలయు. ఈమె జీవితచారిత్రమున లోకమునకు ప్రకటింపఁగూడనివిషయ మున్నదన్న దైవసృష్టమగు నీప్రపంచమంతయు సకళంకమనియే భావింపవలయు. ఇట్టి పూతచారిత్రజీవితమంతయు విషాదమయ మొనర్చిన ఆ హంతక కిరాతకుఁడు నిశ్చయముగ—నిస్సంశయముగ హంతవ్యుఁడే.

ఈమె నెల్లని రక్షించెద. లోకమే పుత్రికారూపమునఁ గాంచు చున్న పంచాననబాబు మానసమున సంతోషబీజములనాటెద. అంబికా చరణున కీమును సహచారిణీత్వసౌఖ్యమును గూర్చెద. ఆమె సమ్మ తింపకున్నను తండ్రి నిరోధించినను రక్షించెద. ఇది నిశ్చయము.

వ్రాయుట కెంతకాలము పట్టినను నీయోచనాతరంగములు నా మానసమున ప్రసరించుట కెంతయోకాలము కాలేదు. నా నిర్ధారణ మును దెల్పి యామెస్వార్థత్యాగమును మనోధైర్యమును నేనెఱుంగుదు ననియు, నామెను నిశ్చేష్టగ నొనర్చినహంతకుని మాయాజాలముల భేదించి రక్షింతుననియు దెల్పి యామె కించుక మనశ్శాంతికలిగి ంప నెంచి మాటాడఁ బ్రయత్నించుసరి కాతురుణి " జనకా !" యనియెను. తోడనే పంచాననబాబునకు ప్రపంచజ్ఞానముగల్గి తన్నధీరునిఁ జేసిన భయవిషాదదుఃఖముల నావలకుఁ దోలి కుమారివైపు పరికించెను. ఆమె " జనకా ! నేనిఁక నిలువఁజాల " ననియెను.

అదియే మమ్ముల నందుండి వెడలించునుడనునాజ్ఞ. విధిలేక తండ్రి కుమార్తెల వీడి మేము వెలుపలి కేఁగితిమి. మదనమోహనునిగదికి మేము పిచ్చెనకై వెడలినపు డతఁడందు లేకుండుట మొదలగు విషయము లను నేను ద్విజేంద్రునితోఁ జెప్పితిని. ద్విజేంద్రుఁ డొకనిమేషము యోచించి " రమ్ము పోయి చూచివత్త " మనియెను.

మేము మదనునిగది చేరి తలుపుతట్టినంతనే లోనుండి "ఎవరు వా" రన్నుప్రశ్న విననయ్యెను. మేము మాపేరులవచించి యతనితో నొక్క ముఖ్యవిషయమై మాటాడవలయుననియు తలుపు తెఱవవలయు ననియు కోరితిమి. మదనమోహనుఁడు లోనుండియే "అయ్యా! నిద్రా భంగమైన నొనర్చి మాటాడవలయునంతటి ముఖ్యవిషయమా!" యని ప్రశ్నించెను.

ద్విజే : ఔను, చాల ముఖ్యవిషయము. నీకు నిద్రాభంగము కలుగ లేదని మాకుఁ దెలిసియే వచ్చితిమి.

మదనమోహనుఁ డంత కవాటమును దెఱచి ద్వారముననే నిలిచి "ఆకార్య మెయ్యది" యని యించుక కోపమున ప్రశ్నించెను.

మేమాతని ప్రశ్నకు ప్రత్యుత్తర మొసంగకయే, యతని యనుమ్మతిని సరకుఁగొనక, యతని ద్రోసికొనుచు లోని కేఁగితిమి. అతఁడంత కోపమున మమ్ము చుఱచుఱఁ జూచుచు ద్విజేంద్రుని నుద్దేశించి, "అయ్యా! మీరపరాధపరిశోధకాధ్యక్షులైన మాత్రమున సమయాసమయములు లేక పరులయిండ్ల బలిమియై ప్రవేశింపవచ్చునా" యని ప్రశ్నించెను.

ద్విజే : మేము హంతకు నన్వేషించుకార్యమున నియుక్తులమై యుండుటయుంగవా?

మద : అయిన నాగదియందు హంతకుఁ డున్నాఁడనియా మీ యభిప్రాయము?

ద్విజేంద్రుఁడు మాఱుపలుక లేదు. మదనమోహనుఁ డింకను పర్యంకము నలంకరించియుండ లేదు. అతఁ డప్పుడే యెచ్చటికోపోయి యుండి తనగది చేరెనని యాతనియుడుపులే తెలుపుచుండెను. అతఁ డుడుపుల మార్చుచుండ మేమభ్యంతర మొసర్చితిమని యాతనివస్త్రములే తెల్పుచుండెను. ఆతనిపచ్చ వస్త్రములలో చొక్కా-పరుపుమీఁద నుండెను. ఒకకాలియందు మాత్రము పాదరక్ష యుండెను. పగటివేళ విలాసార్థముగ ధరించు పచ్చనిషరాయి యింకను నాతనినలంకరించుచుండెను.

ఆగదియందనుమానాస్పదవస్తుజాల మేదియును లేదు. పిదప ద్విజేంద్రుఁ డతనిని "నీవు నిద్రించుచుండ మేమంతరాయముగొల్పితిమా" యని ప్రశ్నించెను.

మద : అవును.

ద్విజే : నీ వసత్యమును బలుకుచున్నాఁడవు. నీవెచ్చటికో పోయి యిప్పుడె గదిచేరితివి.

మద : ఉండవచ్చును. అది మీ కేల? నాయిచ్ఛవచ్చినపుడు వెలుపలికిఁ బోవుటకును వచ్చుటకును నాకు స్వాతంత్ర్యము లేదా ?

ద్విజే : ఇది స్వాతంత్ర్యవిషయము కాదు. హత్యాపరాధ విమర్శనకార్యము.

మద : అయిన ?

ద్విజే : ఏమి? నీవేమియు నెఱుంగవా ? హంతకుఁ డీనాఁడు మరల శిరీషశయనాగారముం జొచ్చి మాకన్నుబ్రామి తిరోధానుఁ డగు టెఱుంగవా ?

మద : అయిన నేనే హంతకుఁడ ననియా మీయభిప్రాయము ?

ద్విజే : నీవీరాత్రిసమయమున నెచ్చటి కేఁగితివో వచింపుము.

మద : ( కోపమున ) నేనీయుద్యానవనాధిపతిని కానా ? ఇందలి పక్షి, జంతుసముదాయము నితరు లపహరింపకుండ రక్షించుటకై రాత్రిసమయములందు పరీక్షింపవలదా ! చాలు నిఁక పొండు. మీ కెంతయు కృతజ్ఞుండ. మీయిచ్ఛవచ్చినరీతి నొనరింపుఁ" డని పలుకుచు నతఁడు మమ్ముల వెడలనడచి ద్వారము బంధించుకొనియెను.

మే మొకరిమొ మొకరు చూచితిమి. ఒకక్షణకాలము మాయిరువురిచూపుకు లేకమయ్యెను. మరునిమిషమందే యుద్యానమును నవ్వ సాగితిమి. మదనమోహనుఁడు మాకొసర్చిన సత్కారము హాస్యాస్పదము గాక మఱేమగును! పిదప మేమిరువురము గృహాభిముఖుల మైతిమి.

మదనమోహనునిచర్య యాశ్చర్యజనకము. అతనియకారణ కోపమున కర్థమేమి. తనగదివీడి యర్ధరాత్రమున బయట సంచరించుట

కతఁడొసఁగిన కారణము సరియైనదే. అతనిధర్మము నతఁడు నిర్వహింప నేఁగెను. చోరులు రాత్రిసమయములఁగాక పగటివేళ రారుకదా? వారిని బట్టుటకు రాత్రివేళయేకదా యేఁగవలయు. ఇఁక ననుమానమునకు కారణ మేమి? హంతకుఁడు శిరీషగదికి వచ్చునాఁటిరేయియే-యీ సమయముననే — మదనమోహనునికిని, చోరులఁబట్టు కార్యమునకుఁ గడంగ బుద్ధి జనించెను, ఇది కాక తాళీయన్యాయసంభవమా? లేక కల్పితమా?

# ఇరువదియొకటవ ప్రకరణము

మా మేయునాటకమునందు హాంతకుని పాత్ర తిరోధానరంగము
చమత్కారముగ నటించుటకు నేను సంతసింపవలయునా?
తసింపరాదు! పరమాద్భుత శేముషీప్రతిభకై సంతసించుట
రియే కాదు. బహూమానింపవలయు. ఐన, నిదిసమాన
నా? హీనప్రతిభ యని యంగీకరింపవలయు. ఎవరు? నేనే.
తమున "రమ్మి! నీ మేధాశక్తిచే నన్ననుగమింపుము"
పతిస్పర్థినన్ను ప్రతిభాయుద్ధమున నాక్రమించి పలుకుచుండ
విధమునఁ గాందిశీకత నొందిన శేముషీకరవాలమును కర
మొనర్చుటచే నీగ్రంథ విస్తర మంతయు హీనప్రతిభయే
యను.

కేమాత్రమును బాహ్యప్రపంచజ్ఞానమే లేదు. నేను చరించు
ది కేవలజ్ఞానరాహిత్యభూమి. నాగమ్యస్థానము ఎండమావుల
ంచు హాంతకుని యాకస్మికాద్భుత రహస్యమార్గము! అయిన
నిని సమీపింపజాలనా? చాలను, సమీపింపఁజాలను. నాఁటి
లమున నేను చెంతకరుదెంచినకొలఁది నది తనవివిధసందేహ
ను నిసుకతిన్నెలమాత్రను ముందునకుఁ ద్రోయుచుండెనే
ను మాత్రము వెనుక వెనుకనె చనుచుండెను.

హాంతకుఁడు మామధ్యమున అంతసూక్ష్మకాలమున రహస్య
గుండ తప్పించుకొనుట దుస్సంభవము కదా? ఐన నతఁడెట్లు
డమ్యెను? బాపురే! ఇదికదా యాతని యసమాన శేముషీ
అతఁడేమైన దేవాంశసంభూతుఁడా? కాక తిరస్కరిణీవిద్యా
తుఁడా? దేవాంశసంభూతుఁడనుట కతని కాలక్షణములే లేవు.

ఇఁక తిరస్కరణీవిద్యాపారంగతుఁ డన్న నట్టి తిరస్కరిణినైనను కను మూసి కను తెఱచునంతలో నదృశ్యముగుట సాధ్యమా? ఇఁక రెండును కాకున్న హంతకునియదృశ్యత యూహాతీతమనియే నిర్ధరింపవలయు. అట్టిచో నేమి షి. నిష్ఫలప్రవృత్తి యానవలయు ?

అపుడు నామానససాక్షి మనోవీధిని సాక్షాత్కరించి నన్ను మందలింపసాగెను. "ఓబలసూదనా! నీవు నీవిమర్శనీయపదార్థమను వ్యాధిగ్రస్తుని చికిత్సచేయుటకై నీమేధాశరమున సకారణశస్త్రమును తప్పుమార్గమునకు త్రిప్పి పట్టియున్నాఁడవు. అందుచేతనే విమర్శనవ్యాధి యింకను కుదురలేదు. కావున శస్త్రమును సరియైనమార్గమునకు త్రిప్పుము. అది కృతకృత్యత నొందును. హంతకుఁడు దేవాంశసంభూతుఁడు గాక తిరస్కరణీవిద్యాసిద్ధియుఁ గాక యున్నందున అతఁడెట్లు మీనేత్ర సన్నిధానమున నేమందిరమునుండి వెలువడును! ఎట్లు వెలువడియే యదృశ్యుఁడు కాఁగలఁడు? మందిరమునుండి వెలువడక మీకు మాత్ర మదృశ్యుఁడు కాఁగూడదా? అతఁ డదృశ్యుఁడై యుండియు నామందిరముననే మీకెఱుంగకుండ నేల యుండరాదు?

ఇప్పుడు నాకు కలిగినసంతసమును దెలుప సహస్రముఖసంకలితుఁడైన యాదిశేషునకైన దుర్లభముగ నుండెను. ప్రపంచసార్వభౌమపదవియే చాకరతలమున వెలసినను నాకంత సంతసముదయింపదు. కాని ప్రకృతము మనోదేవత నా కుద్బోధించిన "హంతకుఁ డేల మందిరముననే యుండరాదు" అను వాక్యవైకుంఠము సశరీరవైకుంఠమై తనరెను. అదియే నాభాగ్య సర్వస్వము. అదియే మదీయసంజీవజీవితామృతము. అదియే నాకిహలోకమోక్షద్వారము. మరల నామనస్సాక్షి మెఱపు నాహృదయాకాశమున "తథాస్తు" మని మెఱసెను! ఆసౌదామినినుండి యొక యారవ ముప్పతిల్లెను. ఆయారవమోంకారనాదముం

# ఇరువదియొకటవ ప్రకరణము

"మాయామేయనాటకమునందు హంతకునిపాత్ర తిరోధానరంగము లందు కడుచమత్కారముగ నటించుటకు నేను సంతసింపవలయునా? ఏల సంతసింపరాదు! పరమాద్భుతశేముషీప్రతిభకై సంతసించుట యొక్కటియే కాదు, బహుమానింపవలయు. ఐన, నిరుపమాన ప్రతిభయా? హీనప్రతిభ యని యంగీకరింపవలయు. ఎవరు? నేనే. కనులసమక్షమున "రమ్మ! నీ మేధాశక్తిచే నన్నునుగమింపుము" అని నాప్రతిస్పర్ధినన్ను ప్రతిభాయుద్ధమున నాక్రమించి పలుకుచుండ చేతగానివిధమునఁ గాండిశీకత నొందిన శేముషీకరవాలమును కర గ్రహణ మొనర్చుటచే నీగ్రంథ విస్తర మంతయు హీనప్రతిభయే యనఁబోలును.

నాకేమాత్రమును బాహ్యప్రపంచజ్ఞానమే లేదు. నేను చరించు చున్నయది కేవలజ్ఞానరాహిత్యభూమి. నాగమ్యస్థానము ఎండమావుల వలె కాన్పించు హంతకుని యాకస్మికాద్భుత రహస్యమార్గము! అయిన నేను దానిని సమీపింపజాలనా? చాలను, సమీపింపఁజాలను. నాఁటి ప్రాతఃకాలమున నేను చెంతకరుదెంచినకొలఁది నది తనవివిధసందేహ పరంపరలను నిసుకతిన్నెలమాత్రను ముందునకుఁ ద్రోయుచుండెనే కాని, తాను మాత్రము వెనుక వెనుకనె చనుచుండెను.

హంతకుఁడు మామధ్యమున అంతసూక్ష్మకాలమున రహస్య ద్వారముగుండ తప్పించుకొనుట దుస్సంభవము కదా? ఐన నతఁ డెట్లు తిరోధానుఁడయ్యెను? బాపురే! ఇదికదా యాతని యసమానశేముషీ ప్రభ! అతఁడేమైన దేవాంశసంభూతుఁడా? కాక తిరస్కరణీవిద్యా పారంగతుఁడా? దేవాంశసంభూతుఁడనుట కతని కాలక్షణములే లేవు.

ఇక తిరస్కరిణీవిద్యాపారంగతుఁ డన్న నట్టి తిరస్కరిణియైనను కను మూసి కను తెఱచునంతలో నదృశ్యుఁడగుట సాధ్యమా! ఇక రెండును కాకున్న హాంతకునియదృశ్యత యూహాతీతమనియే నిర్ధరింపవలయు. అట్టిచో శేము షి నిష్ఫలప్రవృత్తి యనవలయు ?

అపుడు నామానసమాక్షి మనోవీధిని సాక్షాత్కరించి నన్ను మందలింపసాగెను. "ఓబలసూదనా ! నీవు నీవిమర్శనీయపదార్థమను వ్యాధిగ్రస్తుని చికిత్సచేయుటకై నీమేధాకరమున సకారణశస్త్రమును తప్పుమార్గమునకు త్రిప్పి పట్టియున్నాఁడవు. అందుచేతనే విమర్శనవ్యాధి యింకను కుదురలేదు. కావున శస్త్రమును సరియైనమార్గమునకు త్రిప్పుము. అది కృతకృత్యత నొందును. హాంతకుఁడు దేవాంశసంభూతుఁడు గాక తిరస్కరణీవిద్యాసిద్ధుఁడు గాక యున్నందున అతఁడెట్లు మీనేత్రసన్నిధానమున నేమందిరమునుండి వెలువడును ! ఎట్లు వెలువడియే యదృశ్యుఁడు కాఁగలఁడు ? మందిరమునుండి వెలువడక మీకు మాత్ర మదృశ్యుఁడు కాఁగూడదా ? అతఁ డదృశ్యుఁడై యుండియు నామందిరముననే మీ కెఱుంగకుండ నేల యుండరాదు ?

ఇప్పుడు నాకు కలిగినసంతసమును దెలుప సహస్రముఖసంకలితుఁడైన యాదిశేషునకైన దుర్లభముగ నుండెను. ప్రపంచసార్వభౌమపదవియే నాకరతలమున వెలసినను నాకంత సంతసముదయింపదు. కాని ప్రకృతము మనోదేవత నా కుద్బోధించిన "హాంతకుఁ డేల మందిరముననే యుండరాదు" అనువాక్యమై కుంఠము సశరీరమై కుంఠమై తనరెను. అదియే నాభాగ్య సర్వస్వము. అదియే మదీయసంజీవజీవితామృతము. అదియే నాకిహలోకమోక్షద్వారము. మరల నామనస్సాక్షి మెఱపు నాహృదయాకాశమున "తళుక్కు" మని మెఱసెను! ఆసౌదామినినుండి యొకయారవ ముప్పతిల్లెను. ఆయారవమోంకారనాదముం

బోలి యుండెను. ఆనాదమునుండి యస్ఫుటాక్షరములు వినవయ్యెను. అవియే యివి.

"సత్వరమున మందిరమును జేరుము. ఊరక మందిరబహిర్భాగమున వెదకిన నీవన్వేషించు శోధనీయవ్రజము దొరకునా? నీ శేముషి కన్న నీకుసాధన మెయ్యది? నీప్రతిభ సమానప్రతిభయే. హంతకుని నిర్దేశించినపుడు అసమానప్రతిభ కాఁగలదు. నీమేధాదర్పణమున నపుడే పైసౌధమును, అందలి ప్రతిభాగమును ప్రతిఫలించుచుండ లేదా? ఆ ప్రతిఫలితాంశములందు నీమేధాకిరణములు ప్రస్ఫురించుచున్నవి. పొమ్ము. నీకంతయు నామేడయే విశదీకరింపఁగలదు. నీప్రతిభా విమర్శనదళ విస్ఫులింగములే అదృశ్య - అభావ్య - అనూహ్యావస్తువుల యందు మెఱసి యంతస్తేజమును సృజించును. ఆయాంతరతేజమే మనోనేత్రముల నాంతరంగిక దివ్యదృష్టిని నీకు ప్రసాదించును. నీ శేముషియే, నీ మానసదర్పణమే, నీ ప్రతిభామణిస్తబకమే, నీ సౌధరాజమే సర్వము."

# ఇరువదిరెండవ ప్రకరణము

నామిత్రుని దినచర్యాగ్రంథము బ్రహ్మమాయమై యైంద్ర జాలిక మహామాయాజాలవిభూతియై నాకు చూపట్టెను.

వశీ : నీయంత యున్మత్తు లెవరును నుండరు, మిత్రమా! మొన్న కన్నకష్టములువడి యెట్లో తన యదృష్టవిశేషమున తప్పించుకొని మీ చేతినుండి వెలువడిపోయిన హంతకుఁడు మరల నగ్నిఁబడు శలభ మట్లు నేఁడు నిచ్చటికి వచ్చునంతటి వెఱ్ఱివాఁడా? అటుల వచ్చియే తీఱవలయుననుటకు దృఢకారణ మేమైనఁ గలదా?

బల : లేక యేమి! హంతకుఁ డాదినమురాత్రి యొకజాబును శిరీషగదియందలి బల్లపై నునిచి చనియె నని తెలిపితిని జ్ఞాపక మున్నదా? వశీకర్ !

వశీ : ఉన్నది. శిరీషకుమారి కేదియో యొకముఖ్యవిషయ మును తెలియఁజేయుటకై యా జాబందుంచి చనియెను. ఐన ?

బల : అందుకే యతఁ డిందువచ్చుట !

వశీ : ప్రత్యుత్తరాభిలాషచేతనే కదా! దాని కంత తనప్రాణ ములనైన నడ్డుపెట్టి యుపాయసముద్రమున తనంతట తాను మునుంగ వచ్చునా? ప్రత్యుత్తరము కావలయునన్న పోస్టువారు శిరీష వ్రాసిన కాగితమును బంపరని తలంతువా!

బల : విషయ మది కాదు. అపరాధి వచ్చినరాత్రి శిరీషాతని యాగమనమును నిరోధింపవలయునని తనవాడుకప్రకారము శయన మందిరమున పరుండక సఖీసహితయై మధ్యనున్న వేఱొకగదియందు

పరుండెనని కోపోద్దీపితుఁ డయ్యెను. అందుకే యారాత్రి యొకజాబు వ్రాసి యాబల్లయం దునిచెను. ఆజాబునందు నే నీనాఁడు మరల వచ్చెదననియు, నాతో సంభాషింప సిద్ధముగ నుండుమనియు, లేకున్న హానికై యెదురుచూచుచుండు మనియు వ్రాసియున్నాఁడు. ఆజాబును శిరీష కుమారి హంతకుఁడు మాయమైనవెంటనే మాయము చేసెను. ఇదిచాలదా? కారణము "హత్యాపరాధి యీదినము రాత్రి యిచ్చటికి వచ్చుననుటకు నీవు వచించినరీతినే యెల్లరు "మరల హంతకుఁ డిందు రాసాహసింపఁడు" అనునభిప్రాయమున జాగ్రత్త వహించియుండు రనియే తప్పక యాతఁ డీనాఁడిక్కడికి వచ్చునని సిద్ధాంతింపవలయును.

వశీక : వధకుఁడు ఇన్నిమాయ లొనర్చుచుండుటను చూడ ద్విజేంద్రలాలుగారియిష్టమే కారణ మనవలయు. లేకున్న హంతకుఁడు మాయమగుటకు వే ఉపాయము లేదు. ద్విజేంద్రుని యెదుట పంచానను నయనపథముననే హానకర్త యంతర్ధానుఁడై యున్నాఁడు. అపరాధము పంచాననునిమీఁద వ్రాలి యాతనికీర్తిపల్లవమును మంటఁ గలిపెను. ఆతనికి న్యూనతను తప్పక ప్రతిష్ఠించును. పంచాననునిచరిత యీవిషయమున మాత్ర మనుమానస్థాపకమే.

బల : ఈయారోపణమునకన్న లోకము నహోహ వేఱొకటి కలుగదు. పంచాననుఁడు సంపూజ్యచారిత్రుఁడు; అకళంకవర్తనుఁడు ద్విజేంద్రుని యనుమానమునకు మఱియొక యసహ్యరూపమైన కారణము ప్రస్ఫురించుచున్నది.

పంచాననుఁడు బ్రహ్మసామాజికుఁడు. కావుననే పూర్వాచార పరాయణుఁడుగాక నవీనసంస్కార సంస్కర్తలలో నొక్కఁడై యున్నాఁడు. పూర్వాచారులు తమకన్నియలకు కడు లేబ్రాయముననే యుద్వాహమొనర్చి బాలావివాహదురాచారపిశాచమున లోకమున వ్యాపింపఁ జేయుచున్నారు. ఇకేఁడట్లొనర్చుట కొడంబడక నవీనసంస్కా-

రానుసారము తనకుమారికి నిండుయౌవనము వచ్చువఱకు నుద్వాహ మొనర్పక నాకుమారియే తనయనురాగ కుసుమహారముతోఁబాటు కుసుమహార మెవ్వనికంధరమున వైచునో యట్టివాని కుద్వాహ మొనరింతునని యెంచి రజస్వలావివాహ నిషేధమును గణింపకున్నాఁడు. ఇదివఱకు శిరీష యెవ్వనికిని తనహృత్సీమను తావొసంగలేదు. అంబికా చరణునకు మాత్రము హృదయమధ్యమున ప్రేమమందిరమున సమంచి తాలంకృతప్రదేశ మిచ్చెను. ఇచ్చెనుగాని యేలొకో యతని నుద్వాహ మాడుటకు సమ్మతింపక తానీజన్మమున వివాహమును ద్వేషించుచున్నా నని వచించెను. హాత్యాదినమునకు కొలఁదికాలముక్రిందట నెట్టకేల కంబికాచరణుని పరిణయమాడఁ దనసమ్మతిని తెలిపెను.

ఆమాట విన్నంతనే యంబికాచరణుని మనస్సంతోషము మిన్నందెను. తండ్రియభిలషితమును ఫలించెను. కాని యదేమి శిరీష మానససంకల్పమో కాని 22 తేదియందు మరల నంబికాచరణుని నుద్వాహమాడ నని దృఢముగ పలికెను. అంతట వివాహము విరామ మందెను. అంబికాచరణుని యాశ యడుగంటెను. తండ్రికోర్కె మంట నంటెను.

“వీనికన్నిటికిని బ్రహ్మసమాజ దురభ్యాసమే కారణమని ద్విజేంద్రుఁడు పంచాననునియం దసహ్య, అగౌరవ, అనుమానముల నొందుటకు కారణమయ్యె. ప్రస్తుతాపరాధమున నంబికాచరణునిపై నపరాధ సంశయమునకు ద్విజేంద్రుని మానసము తావొసఁగెను. హిందూ పూర్వాచారులగు నైష్ఠికలోకముకంతకును పంచాననుఁ డసహ్య పాత్రుఁడయ్యెను. ద్విజేంద్రుఁడు బ్రాహ్మణేతరుఁడు కాక హైందవమత నిష్ఠలయందు దృఢవిశ్వాస భక్తిగలవాఁడు. కనుకనే శిరీష సదభిప్రాయమునకును దూరుఁడయ్యెను.

మేము మందిరము చేరితిమి. ఆ సౌధమునందే బలసూదనునకు నివాసమునకై యేర్పాటుచేయబడిన గదియున్నది. అప్పటికే రాత్రి 8 గంటలై యుండెను. ఇంతకాల మయ్యును నా ప్రియమిత్రుండు నేడు జరుగనున్న హంతాగమన నాటకమునందింకను వలయుపాత్రముల సంసిద్ధపఱచియుండలేదు. ఇదేమి! బలసూదనుని పరిశోధననాటకమున కిది యుచితమే? ఈనాటకము నాకు క్రొత్తదియా? అయినను కుమారబాబు తన యభ్యాసమును నేడు ప్రదర్శింపఁబోవు నాటకమునఁ గనుఁ జూపక—

బల : పళీకర్! నేఁటి నాటకమున నీభూమిక నీవిధముగ నడుపుము, హంతకుఁడు రాత్రి 12 గంటలకు దయచేయును. నీవు రాత్రి 10 గంటలు కొట్టినంతనే మేడపైని పెద్దహాలు కుడివైపు చివరభాగమున ప్రక్కప్రదేశమున దినేశబాబు నివసించుచున్నగది కెదురుగ నున్నమూల కిటికీవలె నుండు గూటిలో కూర్చుండి యుండుము. అది యితరకిటికీల వలె వాయుసంచారమునకై సౌకర్యము కలిగించునది కాక కేవల పరస్పరగవాక్ష సామ్యమునఁ గట్టుశోభకై యునుపఁబడియున్నది. నీవా గూటియందుండిన యెడల దినేశబాబు నివసించుగదియును పంచాననబాబుండు గదియును పెద్దహాలున కెడమవైపు భాగమంతయు చివరవఱకును నీకు కనఁబడుచుండును. అందు జరుగువిషయము లన్నియు నీనేత్రముల కతిథులు గాకపోవుటకు వీలుండదు. దానికలంకారార్థమై యెప్పుడు నొక పెద్దతెర వేయఁబడి యుండుటను గాన నితరుల కందు గవాక్షమున్నదని సైతము తెలియదు. నీవా తెరలో నీవేషము నునిచి దానిసందున దినేశబాబుగదిని కడుజాగరూకతతో నిరీక్షించుచుండుము. ఆగదియెదుట గాని, గదియందుగాని, యేమైన విచిత్రలీల విలసిల్లిన యెడల నెవనినేని మనుజుని చూచినపక్షమున నీవున్నగూడునకు ప్రక్కనున్న మఱొక్క కిటికీపరదాను క్రిందికి విడువుము. ఆ ప్రక్క—

కిటికీకి తెర కట్టఁబడియున్నది. ఆ తెరపగ్గము నీగవాక్షమునకె కట్టఁబడి యున్నది. నీవుండినచోటు కదలకయే ఆరజ్జువును లాగినచోఁ గట్టఁబడి యున్న పరదా తటాలున క్రిందఁబడును. ఆ తెర క్రిందపడఁగనే లోపలి నుండి ప్రసరించు దీపప్రకాంతి కది యవరోధ మగును. కావున నదియే సమయమని దీపపు భయమున నెందోడాఁగియున్న యంధకారము హాలులో స్వేచ్ఛగ ప్రసరించును. అదియే సంకేతముగ భావించి నిన్ను కలిసికొనియెదను. పిదప ప్రవర్తిల్లవలసిన విషయమును నీవే చూచెదవు లెమ్ము.

వళీ : ఈ విషయమంతయు ద్విజేంద్రలాలుగారికి తెలియునా ? వారీనాటకమునం దేపాత్రను ధరింతురు ?

బల : ప్రకృతి మాఁటఁడిచ్చట లేఁడు. బొంబాయికి పోయి యున్నాఁడు.

వళీ : ఏమీ ! బొంబాయికి పోయినాఁడా ? ఎందుకు ?

బల : అదియుఁ జెప్పవలయునా ? అంబికాచరణుని వెంబడించుటకు.

వళీ : అంబికాచరణునా ? ఆతఁ డెందున్నాడు ? ఇచ్చట లేఁడా ? బొంబాయిలో నున్నాఁడా ?

బల : ఇంకేమి ? ఈరాత్రి హంతకుని సమాగమ మగుటయేమి ? అతఁ డిందుండు టేమి ?

వళీ : ఇదియే నాకును ఆశ్చర్యమును కలిగించుచున్నది. సంశయమునకు దారి చూపుచున్నది. హంతకుని రాకకుముందే అతఁడెల్లప్పుడును బొంబాయికి పోవుచుండును. దీనికారణము మనోభూమికి నగోచరముగ నున్నది.

బల : (మందహాసమున) నీకును నిందె పొరవడుట సంభవించెనా? ఇల్లు ప్రమాద మొందుట దొరతనపు పరిశోధకుల సొత్తనుకొంటిని.

కాని యీ ప్రమాదవాహిని రాజకీయ పరిశోధకులనుండి నీమనో భూమిని ప్రవహించెఁ గాబోలు ? ద్విజేంద్రలాలుగారు దొరతనపు పత్తే దారగుట వలననే పౌఱవడి యంబికాచరణుని వెంబడించి కడుశ్రాంతి నొందుచున్నారు. ఎండమావులనీరు ద్రావసమకట్టుచున్నారు. అయిన ద్విజేంద్రుఁడు డంబికాచరణు ననుమానించుటకు పెక్కునిదర్శనములు భ్రాంతిజనకములై యున్నవి. నీకన్ననో కారణములు లేకయే ప్రమాదము లంకురించుచున్నవి.

హంతకాగమనమునకు ముందే యంబికాచరణుని బొంబాయి ప్రయాణమును 25 తేది సాయంతనమాతనిఁ బోలినమనుజుఁడొక్కఁడు చేతికఱ్ఱను బొంబయియందు కొనియుండుటయు, హత్యోద్యమమునకు పూర్వము 3 రోజులక్రిందట తనద్విచక్రయానమును బొంబయికి కొని పోవుటయు, హంతకుని బూటుచిహ్నమంబికాచరణుని బూటుగుఱుతులను బోలియుండుటయును 25 తేదికి వెనుకటిదినముననే శిరీష యాతని బఱిణయమాడ నిరాకరించుటయును, రసాయన విద్యాపరిశ్రమ పత్రికలన్నియు చౌర్యమొనర్పఁబడుటయు నిదర్శనములై యంబికాచరణునిపై నపరాధకిరణములఁ గుమ్మరించుచున్నవి. ఇవన్నియు సత్యవస్తుప్రదర్శనమునఁ బటాపంచలై పోఁగలవు. ద్విజేంద్రుని యూహావిహంగ మింతటితో నాఁగెను. నీయూహయు నంతియేనా ? పాపము !

# ఇరువదిమూఁడవ ప్రకరణము

ఈప్రకరణసంభాషణము రహస్యముగ ప్రవర్తిల్లినదని చెప్పకయే మా పాఠకమహాశయులు గ్రహింతురుగాక.

ఇంతలో ప్రక్కగది తెఱచినశబ్దము విన నయ్యెను.

బల : వశీకర్! కొంచెము నిలువుము. అదిగో! ద్విజేంద్రుఁడు ప్రత్యక్షమయ్యెను. బహుశః బొంబయియందు తనకారణసామాగ్రి నంతయు నేరికొని వచ్చియుండనోపు! ఇఁకనపరాధశృంఖలములు అంబికా చరణుని హస్తములకై వేచియున్నవి. ఈచేతిబెత్తము నితఁడెందు కని పెట్టెనో కాని యిదినాకాశ్చర్యమును కలిగించుచున్నది. ఈసమయమున బలసూదనుఁడు ద్విజేంద్రునియెడ జయసిద్ధిని పరిగ్రహించుట కేమి యంతరాయము కలుగదు. రమ్ము పోవుదము. ఈరాత్రి కడపటి భోజన మాతనిగదియందే చేయుదము.

వశీక : కడపటిభోజనము——

బల : అవును. పోవుదము రమ్ము. ఆకసమున నక్షత్రములు ప్రకాశింపక యిఁక నెందుప్రకాశించును !

ఇరువురమును ద్విజేంద్రునిగది నలంకరించితిమి. ఆతఁడు తన ప్రయాణపరిధానముల విసర్జింపఁ గడునాతురతతో నుండెను. మాయాగమనమునకు చకితుఁడయ్యెను సగౌరవదృష్టులతో "బలసూదనబాబుగారూ! అభివాదనములు! దయచేయుఁడు. ఈసాయంతనము భోజనాతిథ్యమును పఙ్క్తిభోజనమున సార్థకత నొందింపుఁడు.

బల : తమయానతి శిరసావహించెదను. కాని మీయామంత్రణమునకుముందే మేమే యాతిథ్యమునకై ప్రార్థింపవలయునని యూహించితిమి.

ఇంతలో పాచకుఁడును భోజనపదార్థముల ద్విజేంద్రునకై యొక పాత్రనుంచి కొనితెచ్చెను. మేమావలల మహాశయునితో, "మా భోజ్య పదార్థములనైతే మిచ్చుటకే కొనితెమ్ము." అని యాజ్ఞాపించితిమి. పదార్థములు వచ్చెను. భోజన మొనర్ప ప్రారంభించితిమి. భోజనావసరమున నెన్నియో లోకాభిరామాయణములు సాకారతఁ దాల్చి చెలరేఁగుచుండెను. ఆ సంతోషసల్లాపముల నడుమ—

బల : తామేమైన గ్రామాంతరమున కేఁగియుంటిరా ?

ద్విజే : బొంబాయినుండి నేనిప్పుడేకదా యరుదెంచుట !

బల : అందలివిశేషము లేమైన నున్నవా ?

ద్విజే : విశేషములకేమి గాని నాకార్యము రేపటితో ముగియును. కాన రేపు మరల బొంబాయికి వెడలెదను. మీరిందింక నెన్ని దినము లుండెదరు ?

బల : నాకును నిందేమియు కార్యము లేదు. నాకార్యమును రేపటికి ముగియఁగలదు. మీరిందు లేకున్న నాకుమాత్రమిచ్చట నేమి పని ? ఎట్లును నేను మిమ్మేకదా యనుసరింపవలయు.

ద్విజే : సంతోషము.

భోజనపదార్థములయం దానాఁడు పాయస మొకటియుండెను. నాకు మధురాహారము గిట్టదు. కాన వారిరువురును నాభాగము సైతము మనసార భుజించిరి.

భోజనాంతరము సేవకుఁడు గది శుభ్రపఱచెను. మేమును తాంబూలచర్వణ మొనరించుచుంటిమి. అపుడు ప్రసంగ మంతయు పరిశోధనాత్మకమును గూర్చియుండుటచే, నాకు విసుఁగు దోఁప నందు పాలుగైకొనక కన్నుమూరకయుంటిని. శిరీషయే తనజనకుని పానీయమున నేదియో చూర్ణము [illegible]నతనికనుమఱగించి కలుపుట చూచియుంటిమి.

పంచాననునకు మత్తు కలిగించి హంతకుని యోగమునమున కనుకూల మొనర్చి నతనిని రక్షింప మాకు సాధ్యమా!

నేనిట్లు యోచించుచుండ, ద్విజేంద్రబలసూదనులసంభాషణ యోగుటనాలించి వారివైపుచూడ ద్విజేంద్రుని కన్నులర్ధనిమీలితములై యుండెను. మోమున వైవర్ణ్యము దోఁచుచుండెను. రెండుచేతులతో శిరము గట్టిగఁ బట్టుకొని "శిరోవేదన భరింపఁజాల"నని యనుచుండెను. బలసూదనుఁ డంత నతని నాసహాయమున పర్యంకము చేర్చెను. హస్తమును బట్టుకొని 'శిరీష మత్తుమందు' అని నుడువుచు ద్విజేంద్రుని పరికించుచుండెను. ఒకనిమిష మిట్లు గడచెను. ద్విజేంద్రునికనులు సంపూర్ణముగ మూతపడియెను. శిరీషమాదకల్పితగాఢనిద్రాపాఁపరుల ద్విజేంద్రుఁడు మునిఁగెను. బలసూదనుని మోమున ద్విజేంద్రుని హస్తము వీడినప్పటినుంచి దరహాస మొకటి తాండవమాడుచుండెను.

మరల మాఁగది చేరితిమి. "నీకేమైనను హృదయమున వికారముగ నున్నదా?" యని నామిత్రుఁడు నన్నడుగ లేదని వచించితిని. అప్పుడు 10గంటలై యుండెను. నామిత్రుఁ డూహించినచందమున హంతకుడరుదెంచుట కింకను రెండుగంటలుండెను. నేను నానియమితస్థానము చేరుసమయ మిదియేకదా? బలసూదనుఁడు మరల నేనొనర్పవలసిన విధము బోధించి నన్ను పొమ్మనెను. నేనును పిస్తోలుగైకొని ద్వారము చెంతకేగ మరల నామిత్రుఁడు పిలిచెను. నేను వెనుదిరుగ నన్నతఁ డాలింగన మొనర్చుకొని "మిత్రమా! కడుజాగరూకతతో మెలంగ వలయునుమా!" యని హెచ్చరించెను.

# ఇరువదినాల్గవ ప్రకరణము

నేను నియమితస్థానమగు మూలకిటికి నిశ్శబ్దముగ చేరితిని. మేమొకపరి అపుడే యంతయు పరీక్షించియుంటిమి. నేనం దుపవేశించి సమయమేతెంచినపుడు సంకేతమునకు త్రాడు సమీపమున నుండుట పరీక్షించి యందుపవేశించితిని.

బలసూదనుని విపరీతప్రవర్తనము నామది కలంచుచుండెను. అతఁ డెప్పుడును తనహృదయభావములను వెలివెట్టుస్వభావముకల వాఁడు కాఁడు. సామాన్యములగు విషయములకు జంకువాఁడు కాఁడు: ఎట్టి యాపత్సాగరమునేని ద్రేల్మిడి నొంటిమై నీదినధైర్యశాలి. అట్టి వాఁడు నను బంపుచో నన్ను మరల బిలిచి యాలింగనమొనర్చుకొనుట యందర్థమేమి. ఇదియేకడపటియాలింగనమైనఁ గానోపునని యేకదా! అయిన నిపుడు ప్రవర్తిల్లనున్న మహాంతకనిర్బంధనము మాలో నెవ్వరికేని లోకాంతరగమన కారణము గావచ్చును.

నేను సహజముగ భీరుండను కాను. ఎట్టియాపదలనేని నెదురింనునంతటి ధైర్యశాలిని కాను. నాధైర్యపరీక్షణ కిదియే ప్రథమము. కాన బలసూదనునంతటి వానికి భీతి కలిగించినయాపద సంభవింపనున్న తరి నాకుమాత్రము స్థైర్య మెుండునా? అంగములు భయకంపితములగుచుండెను. ఫాలతలమున చెమటబిందువు లలంకరించెను. నాభయము నకు పాఠకులుహసింపక తామే యాస్థానమున నున్న నెట్లుందురో యోచింతురు గాక.

హాలులో నెందో యున్న గడియారముగంటలు కొట్టుచుండెను. నేనుపవేశించిన స్థానమునుండి పెద్దహాలులో చివరభాగమువఱకు

నున్నగదులును, ద్వారములును, మేడక్రిందికిఁ బోవుసోపానములును, పంచానన దినేశులగదులును చూచుట కనువుగనుండెను.

పెద్దహాలునందు మూఁడుదీపములు మిద్దెనుండి వ్రేలాడుచున్న గాజుపాత్రలలో వెలుఁగుచుండెను. అందంతయు ప్రకాశమే - నేలపై బ్రాకుచీమలనైతము కనుఁగొనునంతటి వెలుఁగుండెను. వెలుపల నేమున్నది? అంతయు నంధకారదేవతానర్తనశాలయే - అపుడప్పుడు దూరమున నక్కలకూఁతలు వినుపించుచుండెను.

కాలచక్ర మాదినము నాకుమాత్రము మిక్కిలి మందగమనమున తిరుగుచుండెను. అత్యాతురతచే నొకరికై వేచియున్నప్పుడు నిమిషములు యుగములుగ మాఱుట యంతఱకును తెలిసినవిషయమే. నిమిషములు గడచుకొలంది హంతకుఁ డేతెంచుసమయము సమీపించుకొలంది నాహృదయాతురత యధిక మగుచుండెను.

నాచేతనున్నగడియారము 11-40గంటలను దెలిపెను. ఇఁక నేనిమిషమైనను హంతకుఁడు రావచ్చును. నాయాతురత సహింపఁజాలకుండెను. విధిలేదు, సహింపనేవలయు. నాయాతురతకై హంతకుఁడు త్వరగా వచ్చునా? ఆహా! అదియేమిధ్వని! వికారమై భయోత్పాదకమగునాధ్వని దేవరపిల్లిదై యుండనోపు. నేను దాని నిదివఱకు వినకున్నను, వర్ణనచే నదియే యని నిర్ధరించితి. ఆధ్వని వీనుల ప్రతిధ్వనించుట యాఁగినంతనే మరల నిశ్శబ్దము.

కొన్నినిమేషము లట్లు గడచెను. [illegible]ను మెల్లగ నిశ్శబ్దముగ దినేశునిగదితలుపు తెఱవఁబడియెను. [illegible] నెవ్వరో సంభాషించు సవ్వడి వినవచ్చెను గాని వినునంత దగ్గరగ నుండలేదు. [illegible]టి నాయాతురత వర్ణింపసాధ్యమా? ఒక్కనిమేషమువఱకు నేమియులేదు.

అంత నొకఁడొకపేటిక శిరమున నిడుకొని దినేశునిగదినుండి వెలుపలి కేతెంచెను. ఆతనిచూడ్కులు నలువైపుల ప్రసరించెను

పిదప నేనున్నగవాక్షము వైపు వచ్చెను. ఆహా! ఆతఁడు నాయొద్ద కేతెంచునా యేమి? పిస్తోలు దృఢముగ నాకరమున నున్నదికదా?

లేదు. ఆపురుషుఁడు నాకు కొంతదూరమున తనశిరముపై నున్న పేటిక నుంచెను. మరల దేవరపిల్లియఱుపు వినవచ్చెను. ఆయాగంతుకు డొక్కనిమేష మూగెను. పిదప నందున్న కిటికీచేరి యందుండి యంధ కారమును ఛేదించుటకు ప్రయత్నించుచుండెను.

ఇపుడు నాకర్తవ్య మేమి? నేనాసంకేతము నొసంగవలయునా? ఇతఁడే హంతకుఁడగునా? కాఁడా? మరల దేవరపిల్లి వికృతనినాదము! ఇఁక నేతడయరాదు. హంతకుఁ డరుదెంచిన రెండు రాత్రులయందు నీవికృత ధ్వని వినుపింపదా? అది హంతకునికిని నతనిసహాయులకును సంకేతము గాఁబోలును! ఇంతకును బలసూదనునియాదేశ మేమి? నేనేదైన విచిత్ర మునగాని మనుజులనుగాని చూచి సంజ్ఞ యొసరింపవలయుననికదా? నేనిపుడీ రెండును నిందు చూడలేదా? ఇతనిచర్య విచిత్రముగ నున్నది. అంతయు నాకేల? ఇందేదైన పొరపాటు సంభవించిన బలసూదనుఁడే చూచుకొనును.

ఇట్లు నిర్ధరించి త్రాటి నీడ్చితిని. తోడనే తెరవాలెను. నాకార్యమును నయ్యెను. ఇఁక నేనేమొనర్పవలయు? నామిత్రునిరాకకై వేచియుండవలయునా? హంతకుని వెంబడింపవలయునా? బలసూదనుఁ డీవిషయమున నాకేమియు వచించియుండలేదు. నేనైనను ప్రశ్నింప లేదు.

హంతకుఁడు గవాక్షమువీడి మరల పేటికచెంత కరుదెంచెను. అదిమరల నతనిశిరముఁజేరెను. పిదప నతఁడు పెద్దహాలులోని కరు దెంచెను. దీపపువెలుతురును నతనిఁ జూచితిని. ఆశ్చర్యము!! హంతకుఁ డెవ్వరు? పచ్చని యుడుపుల ధరించిన మదనమోహనుఁడు !!

మదనమోహనుఁడు తిన్నగ పేటికను మోచికొనియే మేడనుండి క్రిందికి బోవు సోపానముగుండ క్రిందికిఁజనెను. నేను పొరపడితినా? మదనమోహనునిఁ జూచి హంతకుఁడని భ్రమించితినా?

అపుడు గడియారము 12గంటలు కొట్టెను. అంతయు నిశ్శబ్దముగ నుండెను. బలసూదనుఁడేల యింకను రాలేదు? ఆతఁడే మొనర్చుచున్నాఁడు నాకేమియుఁ దోఁచకుండెను. ఏమైనను నేనతనికొఱకై యొకగంట వేచియుండ నిర్ధరించితి.

మరల నదే నిశ్శబ్దదేవతా స్వేచ్ఛావిహారము. మరల నదే యాతురత. ఇట్లెంతకాలము గడచెనో నేనెఱుంగను. బలసూదనుని పొలకువయే కాన్పింపలేదు. అతఁడేమొనర్చుచున్నాఁడు? హంతకుఁడు బంధింపఁబడెనా! లేక నేఁడు రాఁడా? బలసూదనుని యూహాలన్నియు సత్యములయ్యెనా?

నేనంత తాళఁజాలక బలసూదనునికొఱకు లక్షింపక నామిత్రుని గదివంక కేఁగితిని. ఆగదికవాటములు మూయఁబడియుండెను. లోనఁ బ్రవేశించితిని. అందెవ్వరును లేరు. కాని యొకమూల నేమియో పడియుండుట గాంచితి. లోన దీపములేదు. మెల్లగ పలుకరించితి. ఒక మూలనుండి "హూ" యను మూల్గుధ్వని వచ్చెను. ఆవంకవీక్షింప నందేదియో పడియుండెను. సమీపించితిని అపుడు నాకు కలిగినభయ సంభ్రమములు వర్ణింప దాతకేని సాధ్యమే! బలసూదనుఁడే యందుపడి మైమఱచియుండెను!

# ఇరువది అయిదవ ప్రకరణము

భీతిల్లి అతని తట్టిలేపుటకై ప్రయత్నించితిని. కాని ఫలములేదు. శరీర మంతయు స్పృశించితిని. కాని యెందును గాయము లేదు. అపుడు మెఱపు మెఱసినచందమున ద్విజేంద్రుని యవస్థ నాకు జ్ఞాపకమువచ్చెను. అపును. శిరీషరమే ద్విజేంద్రుఁడు బలసూదనుఁడును మేల్కాంచియున్న హంతకుని నిరోధింతురేమోయను భీతిచే నట్లొనర్చియుండవలయు. ఔరా స్త్రీసాహసము !

చేయునదిలేక నేనాతని చెంత కూర్చుండి యాతనికి హెచ్చరిక కలుగుటకై నొప్పికలిగింప నిశ్చయించి గిల్లుట కుపక్రమించితిని. వెలుపల నెవ్వరో తిన్నగ నడచు పదవిన్యాసధ్వని విననయ్యెను గాని నేనది సరకు సేయలేదు.

దాదాపుగ నైదునిముసములవఱకు నావ్యాపారము నిరాతంకముగ సాగెను. అపుడు నామిత్రుఁడించుక కదలినట్లయ్యె. దాని కెంతయో సంతసించి నాకార్యమును మఱింతపట్టుదలతో కొనసాగించితి. ఒక నిమేషమిట్లు కడచెను. హీనకంఠస్వరమున "వశీకర్ అల్లరియొనర్చుచుంటివి. మాటాడవలదనెను. నేనును సంతోషమున నల్లరియొనర్చుచుంటిని.

మఱియొకనిమేషమునకు నామిత్రుఁడు లేచి కూర్చుండెను. కాని లేచుట కింకను శక్తికలుగలేదు. "అయ్యో యీనిద్రాదేవికి నేను వశంగతుఁడనగుటకు పూర్వము నాస్థితి నేమిచెప్పుదు. నాసాధ్యమగునంత ప్రయత్నించితిని. కాని జయమందఁజాలనైతి"ననియె. పిదప నేను

జరిగినదంతయు రహస్యముగ నుడివి నేనిచ్చటి కేతెంచినపిదప విన్న పాద విన్యాసధ్వని విషయమునుసైతము చెప్పితిని.

బలసూదనుఁ డంతతటాలున లేచి "అయ్యో, రమ్ము - రమ్ము హంతకుఁ డీక్షణముననే హత్యయొనర్చుచున్నాఁడేమో!" యనిరెండడుగులువైచి క్రిందఁబడుచుండ నేనతనిఁబట్టుకొంటిని. "అయ్యో! అయ్యో! ఇపుడే మునర్తును. వశీకర్! నీవైనఁ బోయి శిరీషను రక్షింపుము. అంబికా చరణుఁ డామెరక్షకభారమంతయు నాపైవైచి పోవలేదా! దాని నిట్లు నిర్వహించితినికదా! రేపతని కేమిప్రత్యుత్తర మిత్తును - అయ్యో! నేనెట్టిమూర్ఖుండను. అంతమాత్రము తెలియఁజాలనైతి. వశీకర్! నీవింకను పోలేదా! నన్ను వదలఁజాలవా! అయిన నన్నీదుప్చోనిమైన నందు చేర్పుము. రమ్ము" అని బలసూదనుఁడుసావేగముగ సాక్రోశముగ దీనముగ ప్రార్థించెను. అతనిమానసము మాత్రము శిరీషశయనాగారము చేర నత్యాతురతతో నున్నను శరీర మతని కభ్యంతర మొనర్చుచుండెను. ఇట్టివాఁ డందు చేరినమాత్ర మే మొనర్పఁగలఁడని యెంచి నేనతనిమాటల సరకు గొనన్నైతిని.

ఇంతలో నతఁడు శంకించినవిధమున నొక్కయార్తధ్వని "హత్య హత్య - రక్షింపుఁ" డని రోదసీకుహరముల భేదించునట్లు వినఁబడెను' అది శిరీషకుమారికంఠధ్వనియే—

ఆయార్తనాదము విన్నంతనే బలసూదనుఁడు లబ్ధచైతన్యుఁ డయ్యెను. మేమిరువురమును శీఘ్రముగ గది వీడి పెద్దహాలు చేరినక్షణమున శిరీషశయనాగారద్వారము తటాలున తెఱవబడి యందుండి యొక పురుషాకృతి యొక్కపరుగున వెలువడి క్రిందికిఁ బోవుసోపానములనుండి క్రిందికి శరవేగమున పరువెత్తెను. అట్టివేగమున నున్నను నతని హస్తమున తళతళ మెఱయు కత్తియొకటి యుండు టెఱింగితిమి.

ఆస్థితియందు మేము హాంతకుని వెంబడించి బంధించుట యసంభవము. కాన బలసూదనుఁడు – హాంతకుఁడు హాంతకుఁ డని కేక వైచుచు కిటికీచెంత కేఁగెను. మేము హాలుచేరునప్పటికే శిరీషయార్త ధ్వని విని పంచాననుఁడు పరువెత్తివచ్చెను. అతఁడును హాంతకునిఁ గాంచెను. వృద్ధుఁడైనను, యువకునిఁబోలె నతఁడు హాంతకుని వెంట పరువెత్తెను.

ఒకక్షణకాలమున నంతయు కలకలమే. మహాద్వారము దాఁటి హాంతకుఁడు బయటి కేతెంచెను. అతని కేఁబదిగజములదూరమున రెండువ్యక్తులు పరువెత్తుచుండెను. మఱికొంతదూరమున కౌముదీకందళు లుండిరి. బలసూదనుండు వారల నొకప్రదేశమున కాచియుండు నట్లేర్పరచి యుండెను. కందళునిహస్తమున పిస్తోలుండెను. బలసూదను డంత "కాల్చుము. కాల్చు"మని బిగ్గరగ నఱచెను. కందళుఁడును హాంతకునిపై పిస్తోలు కాల్చెను. కాని నిష్ఫలము. మరలగుఱిచూచి కాల్చుట కుపక్రమింప హాంతకుని వెన్నంటిపరువెత్తుచున్న రెండువ్యక్తులప్పు డడ్డము వచ్చిరి.

కౌముదీకందళులు మార్గమును నిరోధించుచు విడిచియుండుటచే హాంతకుఁడు గృహమున ప్రదక్షిణముగ వెడలి నూతనమార్గమే దేని నన్వేషింపవలసియుండెను. హాంతకునికి నతనిని వెంబడించువారికి 50 గజములదూర ముండెను. మరల పిస్తోలుధ్వని వినవచ్చెను. పైనుండి తిలకించుచున్నమాకు హాంతకునిగమనము మందగించినట్లు దోచెను. అక్కడ నొకమూల యున్నది. రెండుగోడ లందు చేరును. హాంతకుఁడాగోడ నతిక్రమించి రెండవగోడయు దాఁటి యేఁబదిగజముఁ దూరమున ప్రాకారపుగోడ నతిక్రమించెనేని సురక్షితస్థానము చేరఁగలఁడు.

పిదప జరిగినదంతయు మేము చూచుకున్నను మాకు వసంతు వలన వివరింపఁబడియె. హంతకుఁడు త్తరమునుండి దక్షిణదిశకు వ్యాపించి యున్నగోడ నానుకొని శరవేగమున పరువెత్తుచుండెను. అతనికి కొంత దూరమున పంచానన,కందళ, వసంతాదు లనుసరించుచుండిరి. మరల పిస్తోలుకాల్పఁబడియెను. హంతకుఁడు పశ్చిమమునకుందెరిగి వారి కగోచరుఁ డయ్యెను. కాని యుత్తరక్షణముననే యెవ్వరో క్రిందఁబడిన శబ్దము వినవయ్యెను. అందఱును చటాలున నాస్థానమును చేరిరి. అందు విగతప్రాణుఁడై యొకపురుషుఁడు పడియుండెను.

హంతకుఁడు నిహతుఁ డయ్యెను. ఒకవారమునుండి బైండరు గ్రామమునే తల్లడిల్లఁజేసి జయంతభవననివాసుల యాపత్పరంపరలఁ బడఁద్రోసి, విమర్శనతంత్రజాలముల పట్టువడక యథేచ్ఛగ సంచరించు చున్న హంతకుఁడు యమలోకమున కతిథి యయ్యెను. అయిన నతఁ డెవ్వరు_ ఎట్టిఘోరాకారుఁడు? ఏరూపమువాఁడు_ అతఁడు మానవుఁడా? ఇచ్ఛాధీనరూపి యగుభూతమా? ఆగాఢాంధకారమున నతనిఘోర సాహస కృత్యము లాతనికి వికృతాకార మొసంగియుండెను.

అప్పటికి మేమును నందు చేరితిమి. అంధకారమున నతఁడెవ్వరో తెలియకుండెను. నాఁడుసిచ్చిన నన్వేషింప నామిత్రుఁడు పోయి దానిని పాచకునిగదిగోడచెంతఁ గాంచియుండెఁగదా! ప్రకృతము హంతకుని శవము పడియుండుటయు నాపాచకునిగృహభాగముననే ?

పాచకునిగదిమీఁద్దెస నాలుగడుగులయెత్తున మేడచిన్నపోలు నందలిగవాక్ష ముండుట యీకకు తెలియంగుదురుగదా ! ఆగవాక్షము తెఱచి యుండుటఁ జూచియే నాఁడు నేను సందేహించితిని.

ఆ గవాక్షమున పురుషుఁ డొకఁడు నిలిచి "బలసూదనబాబుగారు! ఏమి యీకలకలము- హంతకుఁ డేమైన మరల వచ్చెనా" యనియెను.

అది ద్విజేంద్రునికంఠధ్వని. హంతకునిశవమును వసంతునిగదికి ముందు భాగమున నున్నశాలకుఁ గొనిపోవుటకు వలయునేర్పాటు చేయుచున్న నా మిత్రుఁ డొక్క-క్షణము రిచ్చవడియెను. ఉత్తరక్షణముననే- యించుక తడఁబడుచు "ఆర్యా! ఔను- కాదు- కాదు- హంతకుని మాని వేఱొకనిని వధించితిమి" అనియెను.

మేమందఱము విభ్రాంతులమైతిమి. అందఱము నేకకంఠమున "హంతకుఁడు కాఁడా! హంతకుఁడు కాఁడా? యను ప్రశ్నావర్షము నొక్కుమ్మడి నామిత్రునిపైఁ గురియించితిమి. నామిత్రుఁడును, దైన్య స్వరమున- "కాఁడు!" అనియెను.

వసం : అయిన హంతకుఁడేఁడీ?

బల : హంతకుఁడా! హంత- కుఁడు- తప్పిం-చు-కొనియె.

మాయాశ్చర్యమును పాఠకు లూహింపఁజాలరా? అందఱును హంతకుని వెంబడించి యతనిపై టుపాకుల పేల్చిరి. హంతకుఁడు క్రిందఁ బడియెను. బలసూదనుఁ డద్దానిని చూడకయే యది హంతకునిశవము కాదని యెట్లు నిర్ధరింపఁగలఁడు?- మే మొక్క-రము నతనిమాటల విశ్వసింపలేదు.

వసంతకౌముదీకందళులు శవవాహకత్వము నిర్వహింప మేమంద ఱమును మేడక్రిందిభాగమం దొకవిశాలశాలఁ జేరితిమి. అందు దీపము లేదు, కాన వసంతుఁడు దీపమునకై చనెను.

అపుడచ్చటికి ద్విజేంద్రుఁడును, దినేశుఁడు నరుదెంచిరి- అందరు నాశవమెవ్వరిదో పరికింప నతికుతూహలులై యుండిరి. బలసూద నునిమాట లొక్క-రిహృదయమునందును విశ్వాసము గొలుపలేదు. అందఱు నది హంతకునిశవమని దృఢవిశ్వాసమున నుండిరి. కాకున్న హంతకుఁడు పరువెత్తుచుండుటయు, నతనిపై వసంతకందళులు టుపాకులు

వేల్పుటయు, హంతకుఁడు క్రిందఁబడుటయు, కనులార పరికించిన దంతయు నైంద్రజాలిక మాయానాటక మవలయునా ?

వసంతుఁడు దీపమును గొనివచ్చుచుండెను. అతఁడు సమీపించు కొలఁది మాహృదయముల నాతురత యధికమగుచుండెను. దీపకాంతి శవముపై ప్రసరించెను- అందఱిదృష్టిపాతములు నొక్కక్షణముననే శవముపైఁ బడియెను. ఉత్తరక్షణముననే యందఱినోటను "హా" యను నాశ్చర్యసూచకధ్వని వినవచ్చెను-ఆశవ మెవ్వనిది? హంతకునిదా? అది మాకు తెలియదు కాని యాశవముమాత్రము- మాకందఱికిని పరిచితుఁడై, జయంతమందిరోద్యానాధిపతిత్వపదవిని సంచరించుచున్న మదనమోహనునిది !

# ఇరువదియాఱవ ప్రకరణము

శిరీషయార్తధ్వని విన్నపిదప హంతకునియనుసరణకార్యమందే పాఠకులదృష్టి మరలెఁగాని యామెస్థితి యెట్లుండెనో తెలియవలదా? ఆమెకింకను స్వస్థతయలవడియుండలేదు. ఇపుడామె మరల దారుణ హత్యోద్యమమునకు గుఱియయ్యెను. హంతకుఁ డామెవక్షస్స్థలమున బాకుతో పొడిచియుండెను. అప్పుడే యామె "హత్య-హత్య" యని అఱచినది. ఆశబ్ద మాలకించి మేము శీఘ్రగమనమున నామెగదివైపు పరువెత్తుటయు, హంతకుఁడిఁక నామెను మరల బాకుచే పొడుచుటకు కాలము లేనందున నంతటనే తృప్తినంది పరువెత్తవలసివచ్చెను.

గాయము ప్రాణాపాయకరమైన దైనను ప్రాణముల సింకను హరించియుండలేదు. వైద్యోత్తముల తమయసాధారణప్రజ్ఞావిశేషముల వెచ్చించి యామెను రక్షించుట కింకను నవకాశముండెను. హంతకుఁడు వెడలినయొకనిమేషమునకు పరిచారిక లందుచేరి వలయు నుపచారము లొనర్చుచుండిరి.

పంచాననుఁడు హంతకుని వెన్నంటిపరువెత్తుచున్నంతవఱకు నతనికి వేఱుయోచనలేదు. హంతకుఁ డని మే మందరము భ్రమించినమదనమోహనునిశవముగాంచినంతనే యతనియనుసరణకార్యము ముగిసెను- ఆనిముషమందే తనకుమారి ప్రాణాపాయదుస్థితిజ్ఞాపకమువచ్చుటచే నామెచెంతకు పరువెత్తి పోయెను.

మేమీవిషయము నెల్ల విచారించి మాగది చేరి యిరువురము నాసనములయం దుపవేశించితిమి. బలసూదనుఁడొక్కమాటయైన పలుకకుండెను. నేనును సంభాషణార్హస్థితి యందుండలేదు.

నాఁడు ప్రవర్తిల్లిన యాశ్చర్యకరోపలంబములు గ్రంథకర్తకొక నవల కుపయోగింపఁగలవు. నేనిట్లు యోచించుచు నిద్రపోయితిని. నేను తెల్లవారి లేచుసరి కాఱుగంటలై యుండెను- నామిత్రుఁ డంతుండ లేదు. నేను కాలోచితకృత్యముల నిర్వర్తించితిని- కాని నామిత్రుఁడింకను రాఁడయ్యె. అతఁడేదైన రహస్యపరిశోధనకార్యముపై నేగి యుండవచ్చునని నిర్ధరించి, కౌముదీకందళుల విచారించిన నంతయు తెలియునేమో యనునాసచే మేడ దిగితిని.

నేనట్లు పోవుచో వసంతునిగదియందు నామిత్రునికంఠధ్వని వింటిని. నేనాగది ప్రవేశింప బలసూదనుఁడు పర్యంకమున నుపవేశించి యుండెను. వసంతుఁడొకబల్లచెంత నితని కభిముఖుఁడై నిలిచియుండెను. కనుసన్నచే నహ్వానించుచు వసంతునిగూర్చి బలసూదనుఁ డిట్లు ప్రశ్నించెను. "ఈగది చేరినపిదప నిన్న రేయి నీ వెచ్చటికిని బోలేదా?

వసం : ఎచ్చటికిఁ బోయితిని ?

బల : దేవరపిల్లిధ్వని విని దాని నన్వేషింప నేఁగితివా! సరోవర ప్రాంతమున నీపదచిహ్నములును, హంతకునిపదచిహ్నములును నొక దానిప్రక్క నొకటి యున్నవి. మదనమోహనునిశవము నిన్నరాత్రి యుంచినవిశాలశాలయందు పశ్చిమభాగమున నున్న స్తంభముచాటునను హంతకునిపాదచిహ్నము లున్నవి.

వసంతునిమోము తెల్లవోయెను. ఒకనిమేషమువఱకు నిశ్చేష్టితుఁడై యెట్టకేలకు ధైర్యముఁ దెచ్చుకొని "ఆర్యా! నేను పర్యంకము చేరితినిగాని నిద్ర నను చేరదయ్యె! నాఁటిరేయి జరిగినభయంకరవిషయము లెట్టిధీరమానసులనేని కలవరింపవా! నేనట్లు యోచించుచు పరుండి యుంటిని- వెలుపల నత్యంతసమీపమున నీలచ్ఛాయాకృతిని గాంచితిని. నేనీయాకృతిని, పెక్కుదినములనుండి కాంచుచున్నాఁడను. ఎన్నియో మాఱు లాపిశాచాకృతి నానిద్రాభంగమునకు కారణమయ్యెను. అది

మానవాకృతియా లేక పిశాచమా! మనుజులిట్లే బాధింతురు? ఇట్టి సందేహములు నన్ను పెక్కుదినములనుండి బాధించుచుండెను. దాని యాథార్థ్య మెఱుంగ నెన్నిమాఱులో దానిని వెంబడించితిని. అది నాకట్టెదుటనే వృక్షములనడుమ నన్ను పరిహసించుచు మాయమగుచుండెను. నిన్నరాత్రి నాగదికిటికీసమీపముననే దానిఁగాంచితిని. దాని నెట్లేని మాయింపనెంచి దానిని వెంబడించితిని. మీరనినట్లు మేము సరోవరప్రాంతమును గడచి, బైండరుకు బోవు రాజమార్గమువఱకుఁ బోయితిమి- ఆపిశాచాకృతి నాకు పదిగజములదూరమునఁ బోవుచుండెను. అది బైండరువైపు పరునెత్తుచుండెను. నేనారాచబాటపై కాలిడిన తత్క్షణముననే యది మాయమయ్యెను. నేను వెనుదిరిగితిని" అని చెప్పెను.

నామిత్రుఁ డొక్కించుక నేవూరకుండి "వసంతా! నీవసత్యము పలుకుచున్నాఁడ వని నేనెఱుంగుదును_అయినను కోపగింపను- నీస్వార్థపరిత్యాగమునకు మిక్కిలి సంతసించుచున్నాఁడ"ననుచు నందుండి లేచెను.

నాకీమాట లేమియు నర్థము కాలేదు. నామిత్రుని ప్రశ్నించుటకు వ్యవధియు "లేదు. అంబికాచరణుఁ డప్పుడే బండిదిగి మాకెంత కరుదెంచుచుండెను. బలసూదనుని గాంచినంతనే "ఏమైనది- యేమైన దనుచు నతనికరగ్రహణ మొనర్చెను. బలసూదనుఁ డేమిప్రత్యుత్తర మొసంగుటకుఁ దోపక మిన్నకుండుటయు మాయిరువురిమోములు విన్నఁబోయియుండుటయుఁ గాంచి విషయమంతయు నూహించి, "హా, దైవమా! నాజీవిత మంతయు వ్యర్థమా?" యనుచు మేడవైపు పరుగెత్తసాగెను. నామిత్రుఁ డంత "అయ్యా నిరాశ చెందకుఁడు— ఆమె యింకను బ్రదికియున్న"దని బిగ్గరగ నఱచెను—కాని అంబికాచరణుఁ డావాక్యముల నాలింపలేను.

మఱియొకవిషయము పాఠకులకుఁ దెలుపవలసి యున్నది. హంతకుఁడు పంచాననునిపరిశ్రమపత్రికల నపహరించి యుండెఁగాదా? అవి యీనాఁడు శిరీషశయనాగారమున బల్లపై నున్నవి—వాని నెవ్వరు దెచ్చిరి?

# ఇరువదియేడవ ప్రకరణము

అప్పటి మా యాశ్చర్యసంభ్రమములు నా లేఖిని కతీతములు. అంతయు కలకలమే. అందఱును ప్రశ్నించువారే కాని యొక్కరును ప్రత్యుత్తర మొసంగువారు లేరు. ఆయాశ్చర్యమహార్ణవమున స్వామిభృత్యోచిత గౌరవములుసైతము నిర్నామములై యుండెను. అందఱును శవమును చూచుటకై యొకరినొకరు ద్రోసికొనుచుండిరి. ఆయాశ్చర్యవారిధికి మేరయే లేదా! పలువురిమానసవీథుల క్షణకాలోత్పన్నములై యుత్తర క్షణముననే విలీనము లగుచున్న బహువిధసందేహతరంగములకు విశ్రాంతి నొసంగువారెవ్వరు ?

అందఱు నాశ్చర్యసాగరమున నిమగ్నులైరా! లేదు. నామిత్రుఁడే మొనర్చుచుండెనో యని పరికించితి. అతఁడు మౌనముతో దూరముగ కూర్చుండియుండెను. నేనాతనిభుజాసీమపై కరమిడినంతనే యతఁడు లేచి మాటుపలుకక శవసమీపమున కేఁగెను.

“ మదనమోహనుఁడు హంతకుఁడా? కాకున్న నతనిమరణమునకు కారణమేమి. అతఁడేల? హంతకుఁడు మాయమైనస్థలముననే విగతజీవుఁడై పడియుండెను. అతఁడు హంతకుఁడు గాకున్న నిరపరాధివధకు మేము పాల్పడితిమా! అతనివధకు కందళుఁడు పేల్చినతుపాకియా, లేక వసంతుని తుపాకియా కారణము? ఈప్రశ్నపరంపరల కెవ్వరు ప్రత్యుత్తర మొసంగుదురు!

శవసమీపమున కేగినబలసూదనుఁ డప్పుఁడు “మదనమోహనుని మీఁటుపాటు లేమియును నొనర్పలేదు. అతనిమరణమునకు హంతకుఁడో

కారణ"మని యాశ్చర్యమునఁ బలికెను. తోడనే యందఱును ఏదీ-ఏదీ యనుచు శవమును చుట్టుముట్టిరి.

నామిత్రుఁడంత రక్తమయమైన మదనమోహనుని చొక్కాదీయుచు నిందు పరికింపుఁ డనియెను; వీపునదూసిపోవునటుల వక్షమున నొకకత్తి గ్రుచ్చఁబడి యుండుటఁ గాంచి యందఱును నిశ్చేష్టితులైరి.

బలసూదనుఁడిట్లు చెప్పఁదొడఁగెను. "మీ శతఘ్నులు హంతకుని స్పృశింపలేదు. అతఁడట్లు దక్షిణకుడ్యముదాటి తూర్పునకు మరలినంతనే, మదనమోహనుఁ డతనినడ్డగించెను. విధిలేక యాకస్మికముగ తన్నడ్డగించినవానిని తప్పించుకొనుటకు హంతకుని కితని వధించుటకన్న వేఱుపాయము లేదు. కావుననే యతని చేతియందున్న బాకు, శిరీషకుమారిరక్తమున తృప్తినందక, మదనమోహనుని వక్షముఁజొచ్చెను."

అయిన హంతకుఁ డెట్లు తప్పించుకొనియెను? అని దినేశుండు ప్రశ్నించెను. మదనమోహనునిశవ మొకమూలఁబడియుండుట పాఠకులు మనసుల నుంచుకొందురుగాక. ఆమూల పదిజనులకన్న నెక్కుడుగ నొకకాలమందు నిలుచునంతవైశాల్యము లేదు. అది త్రికోణముగ నుండెను. రెండువైపులు భవనముగోడ లుండెను. మూఁడవవైపును పసలాకులచే నిర్మింపఁబడిన పుష్పగృహముండెను. ఆపుష్పగృహము నానుకొనియే భవనపుదక్షిణకుడ్యముండెను. ఆగోడసమీపమునుండియే యామూల చేరవలయునన్న వారు పోవలయు. ఆమూలయందే పాచకుని గదియు, మదనమోహనునిగదియును నుండుట, నాఁడు నామిత్రుఁ డన్వేషించిన నిచ్చెనయు నీమూలయందే యుండెను. ఇపుడు హంతకుఁడు మాయమైనదియు నిచ్చటనే?

ఆసంకుచితస్థలము నతిక్రమింపవలయునన్న హాంతకుఁడు మరల వెనుదిరిగి యుత్తరదక్షిణదశల నిర్మింపఁబడిన గోడయంచున కొంతవఱకేఁగి పశ్చిమమునకుఁ బోవలయు ప్రకృతము హాంతకుఁ డామూలవైపు దిరిగినప్పు డతని వెంబడించుచున్న వసంతాదులు పుష్పగృహము చివర భాగమును చేరిరి. కావున హాంతకుని కామార్గము నిరోధింపఁబడి యుండెను. ఇఁక నామూలనుండి నిర్గమించుటకు వేఱుదారి లేదు. పుష్ప గృహము నధిరోహించియైన నత్యున్నతములగు నాభవనకుడ్యముల నెగఁ బ్రాకియైన పోవలయు. ఇంటిగోడల నెక్కి పైకప్పు చేరుట యసంభవము. ఇఁక పుష్పగృహము యినుపసలాకులచే నిర్మింపఁబడియున్నందున నదియు హాంతకునికి దారియొసంగఁజాలదు. ఇఁక నందున్న ద్వారము మదన మోహనునిగది. అతఁడే యీకలకలము విని కాఁబోలు గదివీడి బయటి కరుదెంచి హాంతకునిచే నిహతుఁడయ్యె. అతనిద్వారకవాటములును వెలుపల తాళము వేయఁబడియుండెను. ఇంతకును హాంతకుఁడు మాయమగుటకు కాలమెచ్చటిది? బఁసూదనుఁడు "హాంతకుండేఁడీ" యను మాప్రశ్నకు మందహాసమున నిట్లువక్కాణించెను. "హాంతకుఁడు తిరస్కరణీవిద్యాపారంగతుఁడు కాఁడా? అతఁ డావిద్య నాశ్రయించుట కిది ప్రథమమా?"

# ఇరువదియెనిమిదవ ప్రకరణము

నాఁటి ప్రాతఃకాలవాయువులు తమ నైసర్గికశైత్యమునకు మాఱుగ విషాదవృత్తాంత మను వేఁడిని దెచ్చుచుండెను. నవీనకాలపు తంత్రి వృత్తాంతప్రవాహమునకన్న నీసర్వసంచారిపవనుని వేగమే జయవంత మగును కదా? ఆసదాగతి చరింపని ప్రదేశమే లేదు. ప్రకృత మట్టియా వృత్తికిఁ జిక్కినయది యేది? పంచాననుని మందిరమే. ఆమందిరప్రాంతము చుట్టు నీవిషాదవార్తాహారియైన పవనునియం దుత్పన్నములై నానావిషజంతువులే యుపవరత మావరించియున్నవి. కాని, తదధినేతసమధిక శాసనశక్తి నొసర్చిన యదలింపువలన తమ స్వేచ్ఛావిహారమున తాండవమాడుటను మాని పాప మంబికాచరణునియందే తమయునికి నేర్పఱచుకొనియెను. ఆతఁడే విషాదసర్వస్వమునకుఁ దావలమయ్యెను ఆతఁడే సకలవిపద్వృష్టికి తనశిరము నొసఁగెను. ముందేమగునో? ఏది ముందగునో యేది వెనుక నగునో ?

ప్రాతఃకాలముననే మేజస్ట్రీటుగారును ఆరక్షకసర్వాధికారియు రక్షకోద్యోగియబృందమును దండనాధికారియు తమయాగమనమున మాకకాలవిస్మయమును కలిగించిరి. మేజస్ట్రీటు వాగీశదత్తుగారధికారోచిత వసనముల ధరించి తమ శాసనభయంకరతకు సూచన యొనర్చుచుండిరి. ఇరుపార్శ్వములయందును ఆరక్షకదేవతలు స్వకీయభయదనీల వస్త్రాచ్ఛాదనముచే భీతిఁ గొలుపుచుండిరి. మేజస్ట్రీటుగారి చేరువ ద్విజేంద్రలాలుగారు పరిశోధకాధిపతిత్వమున నిలిచి కొంతకాలము రహస్యముగ నేమియో సంభాషించుచుండిరి.

సంభాషణానంతరమున మేజస్ట్రీటుగారు వసంతుని గాంచిరి.

మేజ : వసంతా ! అంబికాచరణులుగా రెచ్చట నున్నారు ?

వస : అయ్యా ! వారు శిరీషకుమారిమందిరమున నున్నారు.

మేజ : నీవు శీఘ్రముగ వెడలి పోయి "నేనాతని పిలుచుచున్నా"నని నాయానతిని వారికిఁ దెలిపి తోడ్కొనిరమ్ము !

వసంతుఁ డొకక్షణమున మరలవచ్చి "ఆర్యా అంబికాచరణులుగారు తా మొకక్షణమైన శిరీషను వదలి వచ్చుట కడు దుర్లభముగ నున్నదనియు ఆయమదుస్థితి కడు శోచనీయమై మిక్కిలి యాపత్సముద్విగ్నమైనకతన నిట్లు వక్కాణించితి ననియు వచించితన్ను క్షమింప మిమ్ము వేఁడెను." అని చెప్పెను.

మేజ : ఏమి? రాఁజాలననియెనా? ఇది మేజస్ట్రీటు నాజ్ఞ యని వారుభావింపలేదు కాఁబోలు. మంచిది. పంచాననబాబుగారితో తమ యల్లుని నంబికాచరణుని నెట్లయినను తప్పక పంపుమని నామాటగ వచింపుము. పొమ్ము.

వసంతుఁడుపోయెను. కొలఁదిసేపటిలో వసంతపంచాననులు మేజస్ట్రీటుగారివద్దకు వచ్చి గౌరవాభివాదముల నాచరించిరి.

పంచా : ఆర్యభూషణా! శిరీష యాపదఁగాంచిననాశోకమటుండ నంబికాచరణుని మనోవైకల్యవిషాదములు దురవలోకములై యున్నవి. మనోవైకల్యమున నతఁడు స్తిమితము లేకయున్నాఁడు. అట్టివానిని నిజప్రాణ కాంతాపరిసరమున సందేహాజీవితయగు నామెకొఱకు వచోతీతవేదన ననుభవించుచు నామెతో నేకీభవించి కన్నీరు గార్చుచున్నవానిని బలాత్కారముగ నాకర్షించుట యెట్టిరాతిగుండియగల కిరాతకునకైనఁ జాలిగలిగింపకమానదు. కావున నతనినిందీడ్చుకొనివచ్చుట నాకెంతయు చేతకాకున్నది. తమకంత యత్యవసరమగు కార్యమున్న యెడల తామే యట్టిచేతకు దొరకొనవలయును. దానికిదియా సమయము.

మేజస్ట్రీటున కామాటలు క్రోధోద్దీపకము లయ్యెను, అంతట నధికారాభిమానమునకు తావు లభించెను. తనచెంతనున్న ద్విజేంద్రుని వంక పరికించెను. అందఱు వెంటరా శిరీషగదివైపు పోయెను. శిరీష మందిర మెల్ల ఘోరవిషాదపరిప్లుతమై యుండెను. శిరీష భూమి కవతరించిన శోకదేవతంబోలె నిశ్చేతనయై పరుండియుండెను. సమీపమున నంబికాచరణుఁడు నిరాశాసూచకనయనముల నామెను దిలకించుచుండెను. మేజస్ట్రీటు, పరిశోధక, ఆరక్షకాధిపులు, తెటాలున గది ప్రవేశింప నంబికాచరణుని విషాదకటాక్షముల తొలుదొల్త వారి మోముల ప్రసరించి యించుక యరుణములయ్యెను. వెంటనె లేచి యాతఁడు,

అం : మీరేల యింటు ప్రవేశింప సాహసించితిరి? నాతో సంభాషింపవలసిన విషయమున్న నేనే కొంచెము కాలవిళంబమున మీసమ్ముఖమునకు వత్తునుగదా? మీరిప్పుడొనర్చినకార్యము ప్రశంసాపాత్రము కాదు. కాలోచితమును గాదుగదా ! ఇట్లనుచుండఁగనే,

మేజ : నేనిపుడు వాగీశదత్తుఁడనై రాలేదు. కేవలము న్యాయాధిపతినై దండవిధాయినై యింటు ప్రవేశించితిని. న్యాయవిమర్శన ధర్మశాసనముచేత నింటు రాసాహసించితిని. అధికారకృత్యము సమయాసమయములను స్థలాస్థలములను చూడఁజాలదుగదా ! ఈకార్యము మాకుచితము కాకపోయినను ధర్మశాసనమున కుచితము. కాన మేమిట్లు చేయవలసివచ్చెను. ప్రకృతము నేనడుగఁ బోవుప్రశ్నకు మాత్రము నీవు సదుత్తర మియ్యవలసియున్నది.

మేజ : మీరు ఎల్లప్పుడును హంతకునిరాకకు పూర్వమే బొంబయినగరమునకు పోవుచు హంతకుఁడిందు వచ్చినపుడిందుండక పోవుటకేమికారణము ?

అంబి : నేను హాంతకుని యాగమనసమయమున బొంబాయికి పోవుచుంటి నిక్కువమే, కాని యచ్చట నేనొనర్పవలసిన రహస్య కార్యమును నిర్వహించుటకై పోవుచుందును. ఆకార్యము నిగూఢము. అవాచ్యము.

మేజ : ఐన తామచ్చట ప్రాతఃకాలము మొదలు సాయంకాలమువఱకు నిర్వహించుకృత్యములేమి ?

అంబి : అవి నాయిచ్ఛారీతి నిర్వర్తనీయకృత్యములు. అంత మాత్రము నాకు స్వాతంత్ర్యము వలదా ? అదియు చెప్పతగినది కాదు.

మేజ : అయిన నిటుపరికింపుఁడు. ఇతఁడెవ్వఁడో తెలియునా ఇతఁడు రైల్వేస్టేషనునందొక యుద్యోగి. నీవు బొంబయినుండి హాత్యా ప్రయత్నము చేయఁబడిన మూఁడుదినములయందును సాయంతనపు బండికచ్చటికి వచ్చినట్లును, నిన్ను చూచినట్లును సాక్ష్యమునిచ్చు చున్నాఁడు. చెప్పు మిప్పుడైనను, బొంబయి వెళ్లి మూఁడుపర్యాయములును నీవేమి చేయుచుంటివి ?

అంబి : నేనామూఁడుదినములయందును సాయంకాలమిచ్చటికి రాలేదని సప్రమాణముగ చెప్పఁగలను గాని నేనా బొంబాయి యందేమిచేసినదియు నెందుకేఁగినదియు చెప్పఁజాలను. నేనీరైల్వే ఉద్యోగిని నాఁడు శూరసింగ్ హోటలునందు ద్విజేంద్రునితో మేము మాట్లాడు నపుడొకనాడు చూచియుంటిని. ఆతఁడు రైల్వేయుద్యోగి యుఁడని యిప్పుడు తెలిసితిని.

మేజ : ఇట్టివిషయమున మీరు మూర్ఖపుపట్టుపట్టుట క్షేమము గాదు. మా ప్రశ్నల కుత్తరము చెప్పకున్న మీకే హాని గలుగును.

అంబి : నాపట్టుదలకై ప్రాణహానియైన కానిండు. నేను కారణము నుచ్చరించువాఁడను కాను.

మేజ : ఐన నాతప్పులేదు. నాయధికారధర్మమును నేనిర్వర్తింప వలసివచ్చును.

అంబి : మీ యిచ్చానుసారము వర్తింపవచ్చును. కాని నాయుద్దేశము నను ద్రిప్పువాఁడను కాను.

మేజ : సరియే? అంబికాచరణులుగారూ! నేను మిమ్ము నాన్యాయాధిపగౌరవమున ధర్మశాస్త్రము పేర బంధించుచున్నాను.

ఈయంతిమవాక్యమును వినినంతనె యింతవఱకు నచేతనయై జీవన్మృతకైవడి పడియున్నశిరీష తటాలున లేచి "హా" యనియొక యార్తనాదము నొనర్చి వివశయై మరల మూర్ఛిల్లెను. దీనిఁ గాంచి యింతవఱకు నాపత్ప్రయోధిని మునుఁగుచు దేలుచు మృత్యుముఖద్వారము చెంత చేరెను వాని స్థితియందున్న పంచాననుఁడు, "అతఁడు నిరపరాధి అంబికాచరణుఁడు నిరపరాధి. అతనిని వదలుఁడు. అతనిని వదలుఁడు." అని వాపోవుచుండెను. అంబికాచరణుఁడు తద్విషాదనిమగ్నధైర్యుఁడై మోము వంచుకొని నిశ్చేష్టితుఁడై యుండెను. అతని విశాలనయనములనుండి శిరీషను గాంచుచున్నకొలఁది నశ్రుధార లప్రియత్నముగ స్రవించుచుండెను. అతనిచేతులయందు దినుపశృంఖలములు తగుల్పఁబడెను.

# ఇరువదితొమ్మిదవ ప్రకరణము



ఈవిషాదాంత మగునంతిమాంక సమయమున నేనును నామిత్రుఁడును ద్విజేంద్రలాలును, ఆరక్షకులును; వెలుపల నుంటిమి. లోన శిరీశకుమారియు పంచాననవసంతులును, అంబికాచరణుఁడు నుండిరి. ఈదృశ్యమును గాంచినమాకందఱకును హృదయములు నీరై శోకకరుణావ్యాప్తములై యుండ నేత్రములు బాష్పపూరితములైనకతన దృష్టిప్రసారము లేకుండెను. అట్లు నిరర్గళముగ చనుదెంచు కన్నీటిని కరవస్త్రమున దుడిచికొనుచుంటిమి. ఈవిషాదనాటకమును సంపూర్ణముగ వ్రాయనేరక నాకలము సైతము స్తంభిత మయ్యెను. లోనుండి మేజస్ట్రీటు కడుశోక మూర్ఛితమై దుర్భరవేదనాభరమున నున్న ప్రేయసిని విడిచి రాజాలని యంబికాచరణుని విధిలేక శృంఖలాబద్ధునిఁ గావించి బలాత్కారమునఁ గొనివచ్చుచుండెను. తత్క్షణమా శిరీష కొంచెము లబ్ధచైతన్యయై లేచి యంబికాచరణుని తనయీవిపద్వ్యాపృతములైన శోకపరీతనేత్రములచే గాంచి వానియందు సైతము కొంచెము ప్రేమకరుణాభావములు సంచరించుచుండ నేమియో చెప్పఁబోయి పెదవులు కదల్చెను గాని యాధ్వని కడునిస్సారమై యస్పష్టమై యుండినందున దాని వినుట కడు దుర్లభమై యుండెను. అంబికుండు నోటిమాట శోకాతిశయబద్ధమైనకతన తనయశ్రుపరిపూర్ణ నయనములతోనే యామె కడపటివీడుకోలు నంది వచ్చుచుండెను. దైన్యవిషాదములే మూర్తీభవించినవా యనురీతినున్న వానిని బంధితునిఁగాంచి నామిత్రుఁడొక యొగురునద్వారము చెంతకరిగి "అంబికాచరణా! మిత్రమా నీవు భయపడకుము. నీవు నిరపరాధివి. నిన్ను నేను తప్పకరక్షించెదను.

నీయందుండిన సత్యధర్మములును, స్వార్థత్యాగమును నాకు తోడై నిన్ను కాపాడుటకు కారణభూతము లగుఁగాక, చింతిల్లకుము" అని వెంటనే నన్నుఁ జేరుకొనియెను.

పిదప జరిగినవిషయములసంగతియంతయు కొలఁది కాలమే. ఒక క్షణమే. అపు డామందిరమంతయు దౌర్భాగ్యవిషాదానలపరిదగ్ధమే గదా! బలసూదనుఁడు ననుఁగాంచి తననయనజలములఁ దుడిచికొనుచు,

బల : శిరీషకుమారి యంబికాచరణునితో వచింపఁబోయిన హీనస్వరకలితమైన మాట యేమని తలంచితివి ?

వశీక : అయ్యమ్మ పెదవిని కదల్చెనేకాని స్వరములు వెలిరావయ్యెను.

బల : అయిన నేను చెప్పెద వినుము. అదేమన్న " చె... ప్ప ... ... ము " అని పలికెను.

వశీ : "చెప్పవము" అన్న దేనిని చెప్పవమని యర్థము ? తెలిసి యెంతప్రయోజనమో! తెలియకయు నంతియే ప్రయోజనముకదా ?

బల : అంత యేల? నేనర్థము చెప్పెదను వినుము. నీ వేరహాస్యమునుబయలుపెట్టఁజాలక బద్ధుండవైతివో ఆరహాస్యమును మేజస్ట్రేటునకు చెప్పి యాత్మరక్షణ మొనర్చుకొనుమని భావము, ఇచ్చటిపని యైనది. పోవుదము రమ్మ.

అంత మేము ప్రయాణసన్నాహ మొనర్చితిమి. అచటిపనులు సంపూర్తిగొందినవి. కావున నచ్చటినుండి వెడలితిమి. నామిత్రుని మాటలకు నాకేమియు బోధ కలుఁగలేదు. కేవల మజ్ఞానినై అప్రతిబోధ తిమిరమున నచేతనుఁడనై యూరకయతనిని ననుసరించుచుంటిని. నా యోచనలు జలబుద్బుదములవలె పుట్టి విలీనము లగుచుండెను. బలసూదనుఁడిచ్చటిపని సమాప్తినొందెనని వచించెను. నేనునట్లే తలంచితిని.

"పని సమాప్తియెట్లయ్యెను! హంతకుఁడు దొరకెనా? అటులైన నాకేల నామిత్రుఁడు వచింపలేదు? ఇదియుఁ గాక, హంతకుఁ డిట్టివాఁడని తెలిసిన పక్షమున నిక్కము వెలివెట్టి యంబికు నేల బంధవిముక్తునిఁ జేయరాదు? అంబికాచరణుఁడే యపరాధి యని కనిపెట్టెనా? అటులైన నతనితో నీవు నిరపరాధివి. నిన్ను రక్షించెదను" అని నామిత్రుఁడు వచింపనేల? నిక్కంపుదోషిని న్యాయస్థానముఁ జేర్చుటకింకను కారణ సామగ్రి దొరకలేదు కాఁబోలు. ఏల నాకింతయాతురత? చెప్పఁదగిన కాల మరుదెంచువఱకును బలసూదనుఁడు నాతో నేవిషయమును దెల్పఁడు." అని యనుకొంటిని.

మేమిరువురము గుఱ్ఱపుబండి దిగి ఫైండరుస్టేషనులోని కేగితిమి.

# ద్వితీయ ఖండము.

## ముప్పదియవ ప్రకరణము

మోటారుబండ్లకును ద్విచక్రయానములకును విరామము లేదు. అట్టి జనసమ్మర్దమునందు సైతము నపాయమును యోచింపక శకటసారథులు వేగముగ బండ్లను బరపుచుండిరి. బొంబాయియందు గ్రాంట్ రోడ్డు నందును నిట్టిసమ్మర్దశకటకోలాహలమే యుండెను.

ప్రాతఃకాలమున బలసూదనబాబు ప్రయాణసన్నద్ధుండై దీర్ఘ ప్రయాణోచిత వసనపరికరములం గైకొని నాచెంత కరుదెంచెను.

బల : మిత్రమా! నాకు సెలవొసంగుము. నేనొకదీర్ఘకాల ప్రయాణ మొనర్పువాడనై నీయనుమతి నొందవచ్చితిని. ప్రయాణ మత్యావశ్యకము. నేనిక 15 దినములవఱకును మరలిరాంజాలను. ఒక వేళ నేను మరలివచ్చుట సంభవింపని సమయము కలిగినను కలుగ వచ్చును, ప్రాణమిత్రుండవైన నీకడపటిసందర్శనభాగ్య మంది యుంతియు ప్రేమాలింగన మందవచ్చితిని. మఱేమియు నభ్యంతరవార్త నెత్తకుము. నేఁబోవునది ఒరిస్సాదేశమునకు.

వళీ : ఒరిస్సా కేలపో మొదవు !

బల : హాంతకుని నాటకమందలి ద్వితీయభాగమును కనుఁగొనుటకై.

వశీ : హాంతకుని రెండవభాగము... ...ఒరిస్సాదేశమున... ఐన నంబికాచరణునివిషయము ?

బల : అందుకే యిప్పు డందరుగుట. నీకంతయు పిదప తెలియగలదు. నాకు సెలవిమ్ము. నీప్రేమయు మైత్రియు మఱవనిభంగి నొనర్పుము.

నామిత్రునిచారిత్రమందు నాకమితాశ్చర్యమును నతనియందు భయభక్తులను కలుగఁజేసెను. హాంతకుని రెండవభాగము ఒరిస్సాయందు గలదా ? అతఁడట్టులే సఫలకార్యుఁడు కాకపోయిన మరల నీదేశమునకు రాఁడా ? ఔరా! బలసూదనుని స్వార్థరాహిత్యము, బళిరే! పరోపకారపారీణత! ఇవి యన్నియు ప్రశంసాపాత్రములు కావా ? కాలము తటిచ్చలనశీలము. నామిత్రుఁ డిప్పటికి వెళ్లి 15 దినము లయ్యెను. మార్చి 18 వ తారీఖున నంబికాచరణుని విచారణకాలమునైత మరు దెంచెను. ఇది యంతయు యుక్తకాలమున ప్రవర్తించెను. కాని నామిత్రుఁడు ఇంకను రాలేదు. అంబికాచరణుని విచారణనుగుఱించి "టైమ్సుఆఫ్ఇండియా" పత్రిక యీప్రకారము ప్రకటించి యుండెను. దానిపై భాగమున నామిత్రునిసచిత్రితచిత్రపట మొక్కటి ముద్రింపఁబడి యుండెను.

"నేఁడే రసాయనశాస్త్రవిమర్శనశాఖాదక్షుఁడగు విఖ్యాతినొంది యున్న అంబికాచరణులుగారి శిరీషకుమారికా హత్యోద్యమాపరాధవిచారణదినము ! మేమిప్పు డాయభియోగమున న్యాయవిమర్శన చేయుజూరీలను నిష్పక్షపాతముగ విమర్శనచేయువలయు నని ప్రార్థించెదము. ఈవిమర్శనమున నొక్కనిరపరాధిప్రాణము పోవనున్నది. కాన వారిన్యాయవిచారణమున నెట్టిలోపము కనుపడిదినను అదియొక్క

నిరపరాధిప్రాణమును పొరిఁగొనును. ఇదివఱకు మాపత్రికకు నెంతయు ప్రశంసాపూజ్యుఁడై అనాధశరణ్యుఁడై యింగ్లాండుధన్యుఁడై పరోపకార పారీణుఁడైన బాబుబలసూదనకుమారులుగారు ఇప్పటియపరాధి యపరాధమును వాఁడ్రోలి నిరపరాధత్వమును స్థాపించుటకై కంకణము కట్టుకొనియుండుటయే గాక అపరాధియిట్టివాఁడని నిరూపింప సిద్ధముగనున్నారు. ఇమ్మహాసీయుఁడు తనన్న జరగుతమందిరమున ప్రవేశ పెట్టుకున్నను తాను తనశేముషీమహిమచే కవాటములు తనంతటనె పీడలోనఁ జొచ్చి, సక్రమముగ మందిరమంతయు పరిశోధించి రాజకీయాపరాధపరిశోధకాధ్యక్షుఁడని పేరొందిన శ్రీయుత ద్విజేంద్రలాలు నంతటివానిచేసైతము మెప్పువడసి యతఁ డెట్టితప్పుమార్గమున చరించు చుండెనో యతనికి తెలియఁపఱచినట్టి శేముషీధనుఁడు. అట్టివాఁడు 15 దినములక్రిందట మాకార్యాలయమున కేతెంచి తానొకకార్యార్థమై యరుగుచున్నాననియు. 15 దినములలో మరల వచ్చెదననియు, నట్లుతాను రానట్టి దైవికకారణము లెవ్వియైన సంభవించినచో న్యాయవిమర్శస్థానమున వహించెడు డెవ్వఁడో తెలుపునట్టి యొకకవరును మాకిచ్చుచున్నాననియును, దానిని తప్పక మహాన్యాయస్థానమున ప్రదర్శించి దాని యుద్ఘాటన మొనర్పవలయు ననియుఁ గోరి వెడలి పోయెను. ఆయన యిదివఱకు రాలేదు. కావున నతఁడిచ్చినకవరును మాపత్రికాధిపతి న్యాయస్థానమునకుఁ దెచ్చుచున్నాఁడు. ఔరా ! బల సూదనుని లోకోపకారదీక్ష !

అందువలన మా బలసూదనబాబుగారు నేఁటియపరాధిని నిరపరాధి యని న్యాయస్థానమున నిరూపింనుచున్నారు. రసాయనవిమర్శ శాఖవారు తమయధ్యక్షునకు కలిగిన యుకారణపరిభవమునకై యట్లొనర్చిన యారక్షకపరిశోధకవర్గమును, దొరతనమువారిని, వారొనర్చిన పొరపాటునకై హెచ్చరించుటకై సభ్యులెల్లరు సమావేశమై తమ

యభిప్రాయము నీరీతి వెల్లడించుచున్నారు మొనిన్న ఢిల్లీకు విదితపఱు చుట యేర్పడఁగా, ఇప్పుడు దొరతనమువారు జయంతమందిరాపరాధమున నెవరినపరాధిగ బంధించియున్నారో అట్టి శ్రీయుత అంబికాచరణమిత్రులు సత్కులసంజాతులు; సచ్చరిత్రులు, సర్వశాస్త్రపారంగతులు ఇట్టివాఁడిట్టిహేయ స్త్రీవధోపాయము నెంచెనా! అని ఆలోచింపవలెను. తుదకు పంచాననబాబుగారి చేసైతము నిరపరాధి యనిఘంటాఘోషముగ వచింపఁబడినయతని నిర్బంధించి యాతనిలోకోత్తరసన్మానధనమునకు కొంతత కల్గించుటయం దేమియభిప్రాయమో తెలియదు. కాన నట్టిపూజ్యచరిత్రుని, విమర్శనసమయమున త్వరపడి యభిప్రాయమునఁగి రసాయన విద్యాసరస్వతికి హాయనియపవాదమున చేకూర్చు కుందురుగాక యని కోరుచున్నాము తుద కీయభియోగవిమర్శనను శిరీషకుమారికి సంపూర్ణారోగ్యము కలుగువరకు నిలిపి యామెసాక్ష్యము నాకర్ణించి నిర్ధారణ సలుపవలయునని ప్రార్థించుచున్నాము.

నేనీప్రకటనను చదివి న్యాయస్థానమునకుఁ బోవ నుద్యుక్తుఁడనై మోటారు నెక్కితిని. నాఁడు జయంతిమందిరాపరాధదిదృక్షాగతు లగు ప్రజావర్గమంతయు న్యాయస్థానమందిరమునను మందిరబహిర్భవనమునను క్రిక్కిరిసి యుండిరి, అప్పుడచ్చటికేవచ్చిన ద్విచక్రములయొక్కయు, మోటారుబండ్లయొక్కయు, సంఖ్యనుచూడ నాప్రదేశము వస్తుప్రదర్శకమైయుండినట్లు దోఁచుచుండెను. ప్రతిప్రేక్షకునికరమునను "టైమ్సు ఆఫ్ ఇండియా" పత్రిక యుండెను. న్యాయస్థానోద్యోగియులును న్యాయవాదులును ఆస్థానమును చేరియుండిరి, న్యాయాధిపతి (జడ్జి) వచ్చియుండలేదు. కావున నందఱును మందిర బహిర్భాగమునందు ప్రస్తుతాభియోగమున, తమతమయభిప్రాయముల నిరాతంకముగ ముచ్చటించుకొనుచుండిరి. కొందఱు ద్విజేంద్రుఁడు పారబడి

నిరపరాధిని సాపరాధిగ నెంచెనని వెల్లడించుచుండిరి. మఱికొందఱు బలసూదనుఁ డేమి చెప్పునో చూతమనిరి. ఇంకొకరు బలసూదనుఁ డంబికాచరణునిపై యభిమానముచే భిన్నాభిప్రాయపడినాఁ డని తలంచిరి. ఇతరులు బలసూదనుఁ డసమాన మేధావంతుఁడనియు, నతనివాక్య కల్పనయందు పరమార్థ మెయ్యదియో యిమిడియున్నదనియు నుడివిరి. ఇంకకొందఱు ద్విజేంద్రుఁ డూరక యంబికాచరణునంతటివానిపై మిథ్యాభియోగమును మోపునా? అతని కేన్నియో సత్కారణము లుండవచ్చునని యభిప్రాయపడసాగిరి. ఇట్లు ప్రజావర్గమున రెండభిప్రాయములు ప్రకాశించుచున్నందున రెండుపక్షము లేర్పడియెను. ద్విజేంద్రుని వైపొకపక్షమును బలసూదనునిపక్ష మొకటియు ఈయిరువాగును తమయభిప్రాయముల రూఢపరుప తీవ్రవాద మొనర్చుచుండిరి. ఇది యొకవాక్కలహముగ పరిణమించి న్యాయస్థానము చెంత కడుకోలాహలముగ నుండెను. అది యారక్షకభటులవలన శాంతి నొందుచుండెను.

ఇంతలో న్యాయాధిపతి వచ్చుడుసూచనలు కాన్పించెను. న్యాయస్థానభటుల పరాకుధ్వానమే సూచనగ నెల్లరు దలఁచి బహిర్భాగమున నున్నజనసందోహమంతయు లోనికేతెంచి చూచుచుండెను. అంత న్యాయవాదులును నాస్థానోద్యోగులును లేచి నిలువఁబడిరి. మహాసంరంభముగ రాజఠీవితో న్యాయాధిపతి సింహాసనమునకువచ్చెను. అతని ప్రక్కను జూరీలును వారికిఁగొలఁదిదూరమున నారక్షకశాఖాసర్వాధికారియు నాసీనులై యుండిరి.సింహాసనముక్రిందిభాగమున విలేఖరి యుపవేశించియుండెను.ఇట్లు న్యాయాధిపతి రాఁగానే ఇదివఱ కధికకోలాహలమున నున్న జనస్థానమంతయు నిశ్శబ్దమయ్యెను. న్యాయపీఠమున కెదురుగ కొంచెము ప్రక్కగ సాక్ష్యమిచ్చు పీఠ మొక్కటియుండెను. న్యాయాధిపతి కెదురుగ నిందితుఁడు నిలువఁదగినస్థానము. ఆస్థానమునకు అంబికా

చెరను నారక్షకభటులు ఆయుధమధ్యమున నిడికొనివచ్చిరి. ఆతనిపై ప్రజానేత్రములు "నేను నేను" అని యొక్కసారియే కురియసాగెను. కొందఱతని దీనస్థితికై కన్నీరు నించుచుండిరి. కొందఱతని సుగుణముల వర్ణించుచుండిరి. ఇంతలో "టైమ్సు ఆఫ్ ఇండియా" పత్రికాధిపతి హాంతకుని నామము కలయొకకవరును చేతఁబట్టుకొని న్యాయస్థానమున ప్రవేశింపఁగనే బలసూదనునిపక్షమువారు బలసూదనకుమారుఁడే తమ యెదుట సాక్షాత్కరించినచందమున "బలసూదనుఁడు బలసూదనుఁడు" అని సంతోషితమగు నుచ్చైస్స్వరమున జయధ్వాన మొనర్చిరి. అది యాకర్ణించిన ప్రేక్షకులెల్ల రిదివఱకు రానట్టిబలసూదనుఁడు తనకు వలయు కారణసామాగ్రిని సాక్ష్యమును సేకరించుకొని వచ్చెనేమోయని పత్రికాధిపతి నొక్కసారియే యవలోకించిరి. కార్యక్రమము ప్రారంభింపఁబడియెను.

# ముప్పదియొకటవ ప్రకరణము

న్యా-పతి—శిరీష హత్యోద్యమాపరాధము నీపై మోపఁబడి యున్నది. ఆయపరాధము నీవొనర్చితివా ?

అంబి : నేనొనర్పలేదు.

పిదప రాజకీయన్యాయవాది లేచి యిట్లు చెప్పఁదొడఁగెను.

"న్యాయాధిపా ! న్యాయ సహాయులారా ! ప్రకృతము నిందితుఁడై మీయెదుటనిలిచియున్న శ్రీయుత అంబికాచరణమహాశయు నిపై హత్యాప్రయత్నాపరాధ మారోపింపఁబడియున్నది. కావున దీనిని మీరు విమర్శించి నిర్ధారణ మొసంగవలయునని కోరుచున్నాను. ఈనిందితుఁడు ఖైండరుగ్రామమునందలి జయంతిమందిరమున పంచానన బాబుగారి పరమాదరణకు పాత్రుండై అందే నివసించుచుండెను. పంచాననుని కుమారియగు శిరీషను ఏప్రిల్ 25వ తేదీ రాత్రి 12 గంటలసమయమున నితఁడు హత్యఁజేయ ప్రయత్నించెను. ఆయపరాధమే యిప్పుడు మీముందునుపఁబడియున్నది. ఈయపరాధము మహానిగూఢమై, రహస్యమై యున్నకతన దొరతనపువారు పరిశోధకాధ్యక్షుఁడగు శ్రీయుత ద్విజేంద్రలాలుగారి నీయపరాధమును పరిశోధించి సహేతుక సాక్ష్యమును సంగ్రహించి న్యాయస్థానమున నభియోగము సిద్ధపఱుప నియోగించిరి. అతఁడే యీయపరాధమును పరిశోధించి యపరాధ యథార్థ్యమును కనుంగొని యుండుటవలన వారు వచించిన కారణసాక్ష్యముల నేను మీయెదుట నుంచుటకన్న వారే యీయభియోగమున సాక్ష్యకారణముల దెలుపుట మేలుకాదె, కావున

ద్విజేంద్రలాలుగారే ఈయభియోగవిమర్శనమున మీకంతయుఁ దెలుపఁ గలవారు" అని కూర్చుండెను.

ద్విజేంద్రుఁడు లేచి "ఈహత్యావ్యవహారము 25 వ తేదిరాత్రి 12గంటలవేళ ప్రవర్తిల్లినది. ఈనిందితుఁ డీహత్యావ్యవహారమున కేల పూనెనని మీరడుగవచ్చును. ఈశిరీషకుమారి నీనిందితుఁడు వరించియుండెను. చిరకాలమునుండి వీరిరువురికిని పరిణయవిషయమై వివాదముజరిగి, యెట్టకేలకు కొంతకాలముక్రిందట శిరీష యీనిందితుని పరిణయమాడ సమ్మతించెను. ఆవార్తయే ఏప్రిల్ 15వ తేది బొంబాయిస్థానికలు పత్రికయందు ప్రకటింపఁబడియెను. అదేలాగోకాని హత్యాదినమునకు రెండుదినములముందు శిరీష యీనిందితుని పరిణయమాడ నిరాకరించెను. ఈనిందితుఁ డామె నెంతయో ప్రార్థించెను. కాని యామె తన యసమ్మతిని దృఢముగాఁ దెలిపెను, అందుచే కలిగినమహాత్తరక్రోధమున నీనిందితుఁడు జయంతిభవనము వీడి బొంబాయికి చనెను. ఆమూఁడు దినములు మరల జయంతమందిరమునకుఁ బోవలేదు. ఆక్రోధముననే 25వ తేది సాయంకాల మచ్చటికిఁ బోయెను. సాయంతనసమయమున పంచాననశిరీషలు వాహ్యాళికై వెడలినసమయమున తానిదివఱకు దాగియుండిన పొదను వీడి యిదియే సమయమని జయంతమందిరము చెంతకువచ్చి యామందిరమునందరినడవయనఁగదినగదియందలి గవాక్ష మొకటి తెఱవఁబడియుండుటను గాంచెను. ఆగవాక్షము నంతకు ముందే వసంతుఁడు హత్యాగృహమును శుభ్రపఱచి, యాధూళిపోవుటకై తెఱచియుంచెను. హంతకుఁడు లోనఁజొచ్చి నడవయందలి యనుపయోగవస్తువుల నుంచుగదియందు దాగెను. అందతని పదచిహ్నములుండుట మేజస్ట్రీటుగారు కాంచియున్నవారు. వసంతుఁడు తనపని ముగిసినంతనే గవాక్షము నెప్పటియట్లు మూసి ద్వారముకవాటములు

సై తము బంధించి వెడలిపోయెను. కావుననాగృహమందప్పుడతి డొక్కఁడే యుండెను. శిరీష యినుపమందసతాళము చెవి గోల్పోయి యుండెను. అది యామెపరిణయ నిరాకరణదినముననే యానిందితునితో సంభాషించుచు కూర్చున్న సమయముననే పోగొట్టుకొనుట, దానినితఁడే హరించెను. ఆ యినుపమందసమున నేముండుటయు నెఱింగినవాఁడగుటచే పంచాననబాబెన్నియోవత్సరములనుండి శ్రమించి సేకరించినరసాయన శాస్త్రపరిశ్రమ ఫలితార్థముల కాగితముల హరించెను ఆకాగితముల నెల నితఁ డెఱింగినవాఁడగుటచే వాని నాసామానుఁగదిలో దాచెను. పిదప నతఁడు శిరీషశయ్యాగారము చేరెను. ఈహత్య నొనర్చుటకు చక్కఁగ నాలోచించినవాఁడగుటచే వసంతుని కాలిబూట్సును, కుళ్లాయి, కరవస్త్రముల నపహరించెను. పిదపనతఁడు మంచము క్రింద దాగి యామెరాకకై వేచియుండెను. వసంతుఁడు దీపము వెలిఁగించుటకై యాగదికిఁ బోయిచుండెను కాని యతఁడు మంచము క్రింద చూడలేదు. శిరీషకుమారి 11గంటలకు తనపడకగది చేరెను. ఆమెయు పర్యంకము క్రింద చూడలేదు. హంతకుఁ డామెకు నిద్రవచ్చువఱకును కాచెను. ఒకగంట యతఁడట్లు వేచి వెలుపల పరిశ్రమచేయుచున్న పంచాననబాబును వసంతుఁడును నిద్రించుటకై వెడలియుందురని యెంచి తనఘోరతరకార్యమున కుపక్రమించెను. హత్యోద్యమకార్యమెట్లు ప్రవర్తిల్లినదియు శిరీషకుమారియే తనవాఙ్మూలమున చెప్పియున్నది. అతనికార్యము ముగిసెను. శిరీషకుమారి మృతిప్రాయమై క్రిందఁబడియెను. ఆమె చచ్చినదనియే హంతకుఁడు భావించెను. ఇంతలో వసంతపంచాననులు తలుపులు బ్రద్దలుగొట్టిరి. పంచాననబాబితని బంధించుట మానహాని యని నమ్మి విడిచిపుచ్చెను. హంతకుఁడును తలుపు తెఱచినంతనే వారి నతిక్రమించి యాగవాక్షముగుండ పాఱిపోయెను. పోవునప్పుడు తాను దాచినకాగితములఁగూడఁ గైకొనిపోయెను.

గవాక్షము వెలుపలభాగమున నతనిపాదచిహ్నము లున్నవి. పిదప వసంతుని పాదరక్షల ధరించి యుండుట యు సరోవరప్రాంతమున నవిదీసి సరోవరమున వేసి వెడలిపోవుటయు మొదలగు సంశయము లందఱు నెఱింగినవే. ఇతఁడే హంతకుఁ డనుటకు మొదట తనబూట్సును వానిచిహ్నమును నితరులకు కానరాకుండ తానిదివఱకు గ్రహించిన పెద్ద బూట్సును ధరించెను. లోన తనబూట్సు నుంచుకొని యే యీపాదరక్షలఁ దొంగిలించినందున వానిని సరోవరప్రాంతమునఁ దీయుటయుండగా పెద్ద బూట్సుగుఱుతుండెను. పిదపతనచిన్న బూట్సున గుఱుతులుండుటయే యాతడే హంతకుఁడనుటకు ముఖ్యసాధనము. హత్యాప్రయత్నములు మూఁడు. ఆమూఁడుసమయములందును నతఁడు జయంతభవనమున నుండలేదు. ఆసమయముల నతఁ డేమొనర్చుచుండెను? అను ప్రశ్న కతఁడు సరియైన ప్రత్యుత్తర మొసఁగలేదు. అదియొక్కటి చాలదా యీనిందితుఁ డపరాధియని నిర్ధరించుటకు! కానీవిషయమున నిందితుఁడెంతవఱకు నొప్పుకొనునో విచారించి పిదప మిగతసాక్షుల విచారించుట మేలని నాయభిప్రాయ"మని వచించి కూర్చుండెను.

న్యా : అంబికాచరణులుగారు ! తాము శిరీషను పరిణయమాడనుంటిరా ?

అంబి : అవును.

న్యా : హత్యాదినమునకు రెండుదినములు పూర్వ మామె మిమ్ము నిరాకరించి యుండెనా ?

అంబి : అవును.

న్యా : కారణ మేమి ?

అంబి : అది నేనవచింపఁజాలను. వచింపను.

న్యా : హత్యాప్రయత్న సమయములందు మీ రెందుంటిరి ? ఏమి చేయుచుంటిరి ?

అంబి : బొంబాయి యందుంటిని. అపుడు నేనేమి యొనర్చుచున్నదియు వచింపఁజాలను.

న్యా : సరియే, ద్విజేంద్రలాలుగారూ! ఇఁక నితరసాక్షుల విచారింపుఁడు.

ద్విజే : శిరీషవిస్మృతయై యున్నకతన నామె వాఙ్మూలము నిందొసంగుచున్నాఁడ — (అని యొకపత్రిక నిచ్చెను.)

పిదప పంచాననుఁడును, కౌముదీ కందళులును, వసంతుఁడును బిలువఁబడి మేజస్ట్రీటుగారియెదుట వచించినరీతి వచించిరి. పిదప దినేశుఁ డరుదెంచి యిట్లనుడివెను.

"తృతీయ హత్యాప్రయత్నదినమున నేను జయంతమందిరమున నుంటిని. మఱునాఁటి ప్రాతఃకాలమున నేను బొంబాయికి వెడలుటకై పంచాననునినుండి సెలవుగైకొని నాపేటికను స్టేషనునకుఁ దెచ్చుట కొకకూలివానిని గోరితిని. అపుడు మదనమోహనుఁడు పంచాననబాబు చెంతకు కార్యార్థమై వచ్చి వేకువజామున నొక్కపనికై స్టేషనుకుపోవ నున్నానని చెప్పెను. నాకోరికపై నాతఁడు నా పేటిక నందుఁ జేర్ప సమ్మతించెను. వేకువజామున నాపేటికకై నానిద్రాభంగ మొనర్ప నిష్టములేక రాత్రియే నాపేటిక తీసికొనిపోయి తనగదియందుంచు కొనునట్లుగ నేర్పాటుజరిగెను. అతఁడు దాదాపు 10 గంటలకు నాగదికి వచ్చెను. అపుడు మేమిరువురము నతనియుద్యోగవిషయమును జంతుజాలము దినము నపహరింపఁబడుచుండుటను గూర్చియు సంభాషించుచుంటిమి. పిదప నతఁడు పేటికఁగైకొని వెడలిపోయెను." ఇంతటితో నతనిసాక్ష్యము ముగిసెను. జనులెల్లరు బలసూదనునిరాకకై యత్యాతురతతో నిరీక్షించియుండిరి. కాని యతని పొలకువయే లేదు. నిందితుని న్యాయవాదిలేచి "ఈయభియోగమునందలి సత్యాసత్యముల నిరూపింప

సుప్రసిద్ధాపరాధపరిశోధకుండగు బాబు బలసూదనకుమారుండొక్కండే సమర్థుండు. అతనియాగమనమునకై మే మీక్షణమును వేచియున్నాము. హత్యోద్యమములు మూఁడు. అందు ప్రథమమున జరిగినది 25 తేదీ రాత్రి. ఆవివరమంతయు ద్విజేంద్రలాలుగారు వచించిరి. కాని యపరాధారోపణపక్షము ( Prosecution side ) వారికిని ద్వితీయ తృతీయ హత్యోద్యమసమయముల హంతకుఁ డెట్లు మాయమయ్యెనో తెలుప వలసియున్నది" యని నుడివెను.

న్యాయాధిపతి యంత ద్విజేంద్రుని నుద్దేశించి "హంతకుఁడు ద్వితీయ, తృతీయ హత్యోద్యమసమయముల నెట్లు మాయమయ్యెను" అని ప్రశ్నించెను.

ద్విజేంద్రుఁ డిట్లు చెప్పఁదొడంగెను "హంతకుని ద్వితీయహత్యోద్యమమునకన్న తృతీయప్రయత్నమే ముఖ్యము. అతఁ డప్పుడు తప్పించుకొనుటయే కడుంగడు కష్టసాధ్యము. కాన దానినే ప్రథమమున విచారింతము. హంతకుఁడు, పంచాననవసంతులు వెంటతరుముచు పరువెత్తి వచ్చుచుండ గోడయంచున పరువెత్తుచుండెను. అతఁడు తొలుత నే యొక మార్గ మేర్పఱచుకొని యుండెను. కాని యామార్గమున కడ్డముగ తుపాకిఁబూని కందళుఁడు నిలిచియుండెను. ఇది నామిత్రవరేణ్యుఁడును, సమానశేముషీధనుఁడును నగు బలసూదనబాబునియమము ననుసరించి జరిగినదని చెప్పుట కేనెంతయు సంతసించుచున్నాను. తోడనే సభయందంతటను "వినుఁడు-వినుఁడు" అనుధ్వనులు, బలసూదనుఁ డేలరాఁడయ్యెనను ధ్వనులు చెలరేఁగి, న్యాయవిమర్శనకార్యమున కంతరాయము గలిగెను. సేవకులు నిశ్శబ్దము-నిశ్శబ్దమను నరపుల కెట్టకేలకు నిశ్శబ్దము కలిగెను. ద్విజేంద్రుఁడు మరల చెప్పఁదొడంగెను. "అతఁడే హంతకుఁడు నిర్గమించుదారి నూహించి కందళు నందు నిలిపెను. బలసూదనబాబు ధీశాలియైనను హంతకుఁ డతనికన్న నెక్కుడు ధీశాలి. తోడనే బల

సూదనపక్షావలంబకులనుండి "కాఁదు-కాఁడు"నియు ద్విజేంద్రునిపక్షమువారినుండి "ఔను-ఔను"నియు కేకలు వినవచ్చెను. ఆశబ్దములంతట శాంతింపక వాక్కలహమునకు మాఱునట్లుండెను. అపుడు న్యాయాధిపతి కోపమున "నిశ్శబ్దము, న్యాయసభయందల్లరిచేయువారు వెలుపలికి త్రోయఁబడుటయే గాక రాజకీయశిక్షకుసైతము పాత్రులయ్యెద" రనిభీషణస్వరమునఁ బలికెను. సభయందు నిశ్శబ్దము కలిగెను. మరల ద్విజేంద్రుఁ డిట్లు వచించెను. "హంతకునిమార్గ మట్లు నిరోధింపఁబడి యుండుటచే, దక్షిణపువైపు పరువెత్తవలసివచ్చెను. అతఁ డట్లుపోయి యందుండి తూర్పునకు వ్యాపించు కుడ్యమువైపు తిరిగెను.

దైవ మతనికనుకూలము కల్పించెను. అందొకశవము పడి యుండెను. అది గాంచి హంతకుఁ డందే యంధకారమున పుష్పగృహ శలాకల నానుకొని యొకమూల నొదిగియుండెను. అతని వెన్నంటి వచ్చిన వసంత పంచాననులు మదనమోహనునిశవమే హంతకునిదని తలంచి దానిచెంత కేఁగి యాతురతతోఁ బరీక్షించుచుండిరి. ఆసమయముననే హంతకుఁడు నిశ్శబ్దముగ వారివెనుకనుండి నిర్గమించి, పుష్పగృహము దాటి మాయమయ్యెను.

"లేదు. లేదు. ఆవిధముగ మాయము కాలేదు" అనునొకగంభీర నినాదము ప్రజావర్గముపవేశించిన స్థానమునుండివచ్చెను. అందఱును విస్మితులైరి. అందఱిచూపులు నాశబ్ద మేతెంచినవైపు ప్రసరించెను. అంతయు నిశ్శబ్దముగ నుండెను.

న్యాయాధిపతి యప్పుడు క్రోధమున "ఎవ్వరువారు! న్యాయసభాగౌరవమును పాటింపక యిచ్చవచ్చినరీతి పలుకువారు? అని ప్రశ్నించెను.

అపుడా జనమహార్ణవమునుండి యొకపురుషుఁడు లేచి " ఆర్యా ! నేను " అనియెను. న్యాయాధిపతి మఱింత క్రోధమున నిట్లనెను.

న్యా : నీవెవ్వరు ?

పురు : నేను బలసూదనుఁడను.

తోడనే సభయంతయు కల్లోల మయ్యెను.

# ముప్పదిరెండవ ప్రకరణము

బలసూదనునియాగమనముచే న్యాయసభ యంతయు సంతబజారువలె నయ్యెను. ప్రేక్షకు లందఱును తమతమయాసనముల వీడి యాతని చూచుటకై యొకరినొకరు త్రోయుచుండిరి. వెనుకనున్నవారిని దూషించువారు తమవెనుకనున్నవారిని చూపుచుండిరి అందందు చిన్న కలహములుసైతము మొలకలెత్తుచుండెను. అయిదునిమేషములవఱకు న్యాయాధిపతియు, సేవకులును నిశ్శబ్దమని యఱచుచున్న కేక లెవ్వరి వీనులను బడలేదు. కొంతవడికి న్యాయసభాగౌరవమే విజయమునొంది జన కోలాహలము నణఁచివైచెను.

బలసూదనుఁ డెట్లో మార్గము కల్పించుకొని సందితునిన్యాయవాదిసమీపము చేరెను. సభయందు నిశ్శబ్దము కలిగినంతనే న్యాయాధిపతి నామిత్రుని చురచురఁజూచుచు "నిన్నేల న్యాయసభాధిక్కారమహాపరాధమునకై న్యాయసభవారు శిక్షింపఁగూడదు?" అని ప్రశ్నించెను.

బలసూదనుఁడు మందస్మితమున "తనఘనతను వేఁడెదను. నావిన్నప మాలకింపుఁడు. నేనిప్పుడే యొరిస్సాదేశమునుండి వచ్చుధూమశకటము దిగితిని. సమయమున న్యాయవిమర్శనకుఁ దోడ్పడునభిలాషయే యాతురతకు కారణము. నేను ప్రయాణపుబడలికనైనఁ దీర్చికొనక ఇట్లువిచ్చేయుట న్యాయసభాగౌరవమును పాటించుటగాక, ధిక్కరించుట యగునా? నేను ధూమశకటమున కిందు రాఁజాలనైతి. కాన నాఅపరాధము ధూమశకటసంఘమువారిదిగాక నాయదికాదు." అనెను.

సభయందంతట నీవాక్యము లాలించి నవ్వుట యారంభించితిరి. న్యాయాధిపతిహస్తచాలనమున దాని నాపి ధూమశకటాలస్యాగమన

మునకును నీవీసభ నీరీతి ప్రవేశించుటకును నేమిసంబంధమనియెను. బలసూదనుఁడు "ఆర్యా! నేను వచ్చుసరికి న్యాయసభ యంతయు క్రిక్కిరిసి యుండెను. నాకొక్కరును దారి యొసంగరైరి. నాకు లోన చొచ్చుటకు వేఱుపాయము లేక, యీవిధముగ నొనర్చినతామె నాకు మార్గమిప్పింతురని యిట్లొనర్చితినని సవినయముగ ప్రత్యుత్తరము నొసంగెను.

న్యాయాధిపతి కోపము పూర్తిగ శాంతింపలేదు. అతఁడేమొనర్చుటకును తోఁచక యోజించుచుండ నిందితునిన్యాయవాది లేచి "న్యాయాధిపా! న్యాయసహాయులారా! ఇతఁడీయభియోగమున ముఖ్యమగుసాక్షి. ఈనిగూఢరహస్యాపరాధదుర్గమును భేదింప నితఁడొక్కఁడే సమర్థుఁడు. ఇతనిసాక్ష్యము లేకున్న నీనిందితునికి న్యాయవిమర్శన కలుగదని ముమ్మాటికి నొక్కి వక్కాణించెద. కాన న్యాయవిమర్శనైకదీక్షాబద్ధులగుతామెల్లరు నితనిక్షమించి, యితనిసాక్ష్యము గైకొన ప్రార్థించుచున్నాఁడ." ననిపలికెను.

న్యాయసహాయులు శిరఃకంపముల తమసమ్మతిని దెలుప విధిలేక న్యాయాధిపతియు నంగీకరించి "అయ్యా! నీపై న్యాయసభాధిక్కారమహాపరాధ మున్నది. అది పిదప విచారింపఁబడును. ప్రకృతము నిన్ను నిందితునిపక్షమున సాక్షిగా నంగీకరించితిమి. ప్రమాణ మొనర్చి చెప్పుము. హంతకుఁడు తృతీయహాత్యోద్యమమున శ్రీయుత ద్విజేంద్రలాలుగారువచించినచందమున కాదాతప్పించుకొనుట?" అనిప్రశ్నించెను.

బల : కాదు.

న్యా : హంతకుఁ డానాఁ డెట్లు మాయమయ్యెనో నిదర్శనపూర్వకముగ నీవు నిరూపింపఁగలవా ?

బల : నిరూపింపఁగలను.

న్యా : అయిన వచింపుము. న్యాయసభవారు విన కుతూహలులై యున్నారు.

బల : ఆర్యా! క్షమింపుఁడు. ఆవిషయ మిపుడు నేవచింపఁజాల. (చేతనున్నగడియారము నవలోకించి) ఇప్పుడు 12-30 గంటలైనది. నాకు 3½ గంటలు వ్యవధినొసంగుఁడు. నాకిందుల కొక ప్రబలకారణ మున్నది. 4గంటలకు నన్నెన్ని ప్రశ్నలైన నడుగుఁడు. అంతవఱకు నొక్కమాటయైనను వచింపఁజాల.

న్యా : (విస్మయమున) అది యేల ?

బల : నాకొక ప్రబలకారణ మున్నది

న్యా : ఆకారణ మెయ్యది ?

బల : అదియు 4-0 గంటలపిదపనే వచింతు.

న్యా : పోనిమ్ము. అంబికుఁడు శిరీషహంతకుఁడా ?

బల : కాడు.

న్యా : కాకున్న హంతకుఁ డెవ్వఁడో నిరూపింపఁగలవా ?

బల : నిరూపింపఁగలను. కాని 4-0 గంటలకు ముందు వచింపఁ జాలను.

న్యా : (కోపమున) ఇదిన్యాయసభగాక నీయిచ్ఛవచ్చిన రీతి నొనర్చుటకు, నీస్నేహితగృహము కాదు. నీకు తెలిసియున్న వచింపుము. లేకున్న నూరకుండుము. నీవు మాకాదేశించువాఁడవా ?

బల : ఆర్యా! విధిలేక యిట్లు పల్కితిఁగాక, ఇది న్యాయసభ యని యెఱుంగక కాదు. న్యాయవిమర్శనమెడ నాకున్నగౌరవమును, భక్తియు, శ్రమకైన నోర్చి నేనింతదూరము వచ్చియుండుటచే తెలియదా? నాకారణము మీరావల నెఱింగెదరు. ఈయుపబాధరహస్య తంత్రముల భేదింప నేనొక్కఁడనే సమర్థుఁడను. నాకంతయుఁ దెలియును.

అయిన నాలుగుగంటలవఱకు నేనేమియు వచింపఁజాల. నేనెట్టివాఁడ నగుటయు, కారణము లేక నేనెట్టి కార్యమును నొనర్పు వాఁడను కాననియు ప్రభుత్వాపరాధపరిశోధకాధ్యక్షులగు శ్రీయుత ద్విజేంద్రలాలు బాబుగారు వచింపఁగలరు.

ద్విజే : (లేచి) ఆర్యా! నామిత్రుఁడు వచించినది సత్యము. ఆతఁడూరక పరిహాసమునకు కాలయాపన మొనర్పువాఁడు కాఁడు. ఏదియో ప్రబలకారణ ముండును. మేమిరువురమును హత్యోద్యమమునకు రెండవదిన మచ్చట చేరితిమి. ఇరువురము నొక్కచో నివసించి, యొక యపరాధమును విమర్శించితిమి. అయిన మామార్గములు కొంత వఱకు నొక్కటేకథ ననుసరించినను, పిదప భిన్నములైనవి. న్యాయ విమర్శనకు రెండవమార్గము నాలకించుటయు నత్యావశ్యకము. కాన నతఁడుకోరినచందమున 4–0 గంటలవఱకు నతనిసాక్ష్యమునకై నిరీక్షించుటయే సమంజస మని నాయభిప్రాయము.”

జనులెల్లరు నతని నిష్పక్షపాతబుద్ధికై యభినందించిరి. న్యాయాధిపతియు సమ్మతించెను.

# ముప్పదిమూఁడవ ప్రకరణము

శిరీషకుమారిహత్యాభియోగ మప్పటి కాఁపఁబడెను. అంతవఱకు మఱి యొకహత్యాభియోగమును విచారింప నిర్ధరించిరి. అయ్యది మదన మోహనుని హత్యాభియోగమే.

మదనమోహనుని యెడ హోటలుయజమాని శూరసింగునకు క్రోధముండుట యందఱకుఁ దెలిసినవిషయమే. మదనమోహనుఁడు దారుణవధకు గుఱియైనదినము ప్రాతఃకాలమున నెప్పటిరీతి నతఁడు హోటలున కేఁగియుండెను. శూరసిం గానాఁడించుకశరీరారోగ్యము లేక క్రింద ద్వారముకడ నుపవేశించి యుండెను. మదనమోహనునిఁ గాంచి నంతనే యతనిక్రోధాగ్ని ప్రజ్వరిల్లెను. ఇరువురికిని వాక్కలహము పెచ్చెఁ గెను. మదనమోహనుఁడుమాత్రము శూరసింగునిందావాక్యముల సరకు సేయక మందహాసమున శాంతమున మాటాడుచుండెను. శూరసింగు క్రోధాగ్నికి మదనమోహనుని శాంతి మాజ్యప్రాయ మయ్యెను. అతని నోటినుండి దుర్భాషలు యథేచ్ఛముగ వెలువడుచుండెను. తూ మదన మోహనుఁడు మాఱుపలుకక యందుండి వెడలిచనియెను. కాని శూరసింగుక్రోధాగ్ని ప్రశాంతత నందదయ్యె. మువ్వురుభైండరునివాసు లందుండ వారిసమక్షమున శూరసింగు మహోగ్రక్రోధమున, "మదనమోహను నీలోకమునుండి తప్పించెద"నని బిగ్గరగ నఱచెను.

దీనినంతయు నాలించియే మదనమోహనుని హత్యాపరాధమును శూరసింగు మలయవతులపై నారోపింపఁబడియె. వారిరువురును ప్రకృతము నిర్బంధమున నుండిరి. అదియే ప్రకృతము విచారణీయాభి యోగము.

అతనిభార్యయగు మలయవతిసైత మీహత్యాపరాధనిందారో పణమున పాలుఁగొనుట కేవల మతనియర్ధాంగియగుటకతనమాత్రము కాదు. హత్యజఱిగినదినమున నామె పాదచిహ్నములు సరోవరప్రాంత మున నగపడియెను. దూరమున రాజబాటపై శూరసింగు పదచిహ్నములు కూడ ముద్రితములై యుండెను. అతఁడు నిర్దోషియేయైన నాలుగు దినములనుండి పర్యంకము వీడకున్నశూరసిం గంతదూరము రానేల ?

ఈరహస్యభేదనమునకుశూరసింగుమలయవతులసాక్ష్య మేమియు సాయమొనర్పలేదు. తాము నిర్దోషులనుటదప్ప వారు మఱేమియు వచింపరైరి. దీనినంతయు నాలకించుచు బలసూదనుఁడు మందహాసమున నుండుటఁగాంచి న్యాయాధిపతి యతనిని "మీరీరహస్యమును భేదింపఁ గలరా!"యని ప్రశ్నించెను.

బలసూదనుఁడు "చిత్తము- న్యాయవిమర్శనకు తోడ్పడుటకే కదా నేనిందు వచ్చుట" యనియెను.

న్యా : శూరసింగుమలయవతు లీయపరాధము నొనర్చిరా ?

బల : లేదు.

న్యా : అయిన మదనమోహానునిహంతకుఁ డెవ్వఁడు ?

బల : శిరీషకుమారిహంతకుఁడే.

అని పాఠకులకుఁ దెలిసిన మదనమోహానుని హత్యాక్రమముఁ దెలిపెను.

న్యా : అయిన మలయవతీపదచిహ్నములు సరోవరప్రాంత మున నుండుటకు కారణమేమి? ఆమెపదచిహ్నములు శిరీషహంతకుని పెద్దబూట్సుచిహ్నముల ననుసరించియుండుటకు కారణమేమి ?

అర్థరాత్రమున నొంటరిగా నర్జనప్రదేశములం దిట్లు స్వేచ్ఛగా నీవు సంచరించుటకు కారణమేమి ?

బల : ఆరహస్యము శ్రీమతి మలయవతికి. ఆమెనప్పుడిట్లు నిలువదా సేవచింపవలయు ?

మలయవతి లజ్జానతవదనయై విధిలేక, యంగీకారమును శిరఃకంపమున సూచించెను. పిదప బలసూదను డిట్లు చెప్పదొడంగెను. "మలయవతీమదనమోహనుల కన్యోన్యానురాగము కలదు. నేను ఖైరండకు గ్రామమును చేరినాటి ప్రాతఃకాలముననే హోటలునకుం బోయితిని. శూరసింగు ముసలి- మిక్కిలి స్ఫురద్రూపియు కాడు. అతని స్వభావ మెట్టిదో నేను వేఱువచింపంజనిలేదు. అట్టివాని పతిగాఁ బడసియు జవ్వనియగునొకసుందరి సంతసమున కాలముఁబుచ్చుచున్నదన నాశ్చర్యజనకము కాదా? ఖైరండకుఁబోలిననిర్జనప్రదేశమున నందు నివసించుకొందఱిప్రవర్తనలును హత్యోద్యమమున కేవిధమునైన సంబాధించి యుండవలయునని నాయాశయము.

నేను హోటలున కేఁగి యీయామెను గాంచితిని. ఈమెముఖమునను ప్రవర్తనమునను సుఖసంతోషజీవన చిహ్నములే నేకనుఁగొంటి, ఇది యాశ్చర్యవిషయమని ముందేవచించితి. ఆయమ సంతోషమునకు రెండేకారణము లుండవలయును. అందు మొదటిది, తనయదృష్టబలమును మీఱఁజాలక యున్నదానికే తృప్తినంది యాభర్తకు సంతసముఁ గూర్చుటయే నిజసంతోషముగ భావించి తృప్తియుత్తమమున కాలము గడపుచుండుట యొకటి. సరిగ్గేకదా? ఇఁక రెండవది. తన్వియే మఱియొకని వరించి యాతని ప్రేమానురాగములకు పాత్రయై, తత్సుఖసాగరమున మునింగినదై యిచ్చి తనసంతోషజీవిత నౌకాప్రయాణమున కాతంకభూతుండగు భర్త కఠిన తరప్రవర్తనమును మఱచుటయే. అందుప్రథమమార్గము ననుసరించుట ధీరచారిత్రలగు నెవ్వరో కొందఱు

కొంతొరకులేకు సాధ్యమగునుగాక, స్త్రీసామాన్యస్వభావమునకు విరుద్ధము. కావుననే నేను పోటులకుఁబోయిన తటి నామెసౌఖ్యమున కేమార్గము ననుసరించుచున్నదో కనుఁగొంటిని. శూరసింగునకు మదనమోహనునియెడ విద్వేషభావ మావిర్భవించుటకు కారణమేమని యాలోచించితి. కౌముదీకందళులు రహస్యముగ పంచాననబాబుగృహోద్యానము నందలి పక్షులఁజంపి శూరసింగునకు వానిని విక్రయించుచుండిరికదా! తనయుద్యోగధర్మము ననుసరించి మదనమోహనుఁడీరహస్య వ్యాపారమున కెన్నఁడో యొకపర్యాయము లంతరాయముల గల్పించుట సహజము కదా! దానికై శూరసింగున కాతనిపై కోప ముదయించుటయు సహజమే! ఇదొక్కటియే కారణముండునా?

నేను భోజనపదార్థముల భుజించుచు నాతో సంభాషించుచున్న శూరసింగు ప్రవర్తనమును పరీక్షించుచుంటిని. ఆతనికి మదనమోహనుని యెడఁ గల క్రోధము సామాన్యము కాదనియు బద్ధద్వేషమనియు, నూహించితి. దానికి నిదర్శనమే పలయునేని వచించెద. నాఁడు “మేమాతనితో సంభాషించుసమయమున మదనమోహనుఁ డందు విచ్చేయుట తటస్థించెను. ఆతనిఁగాంచినంతనే శూరసింగుముఖము వైవర్ణ్యమునందెను. కనులెఱ్ఱఁబాఱెను శరీరము కంపింపఁదొడఁగెను. శిరీష హత్యాపరాధమతనిపై నారోపించుటకుసైతము వెనుదీయుఁడయ్యెను. ఇట్టి విద్వేష క్రోధములు పక్షిమాంసము రహస్యముగ కొనుచున్న రహస్య వ్యాపారమున కంతరాయుఁడగుటకతన మాత్రమునఁగలుగునా? దీనికి వేఱొండు ప్రబలతర కారణ ముండియే తీరవలయును. అయిన నాకారణ మెయ్యది? ఆకారణము నూహించుటకుసైతము శూరసింగుప్రవర్తనమే మార్గదర్శియయ్యెను. మదనమోహనుని ప్రవర్తనము వర్ణించుచునతఁడు స్త్రీలోలుఁడయ్యె నీప్రాంతమందలి స్త్రీలమానధనముపాలిటి చోరుఁడనియు నుడివెను. అదియే నాకు దారినొసంగెను. మదన

మోహనుఁడు విలాసపురుషుఁడని యాతనివస్త్రములును సగాంభీర్యగమనమును సుందరాకారమును, శూరసింగుపలుకుల సత్యము నిరూపించుచుండెను. అయిన నట్టివాఁడీప్రాంతమున పలుమాఱు తిరుగుచుండనేల? శూరసింగు వలదని పలుమాఱు వచించినను, కోపగించుకొన్నను, తుద కవమానించినను నతఁడేల మానకుండెను? శూరసింగు నాసమక్షముననే యింక మీఁద నిచ్చటికి రాకుమనియు, సిగ్గుండినకదా మానుమనియు వచించెను. మదనమోహనుఁ డంతటి యవమతికేని సహించి శాంతముగ నుండుట గాక పలుమఱు నచటికే తెంచుటకు కారణమేమి! తరుణికొఱకే కదా? స్త్రీమోహమే కదా లోకమున కృత్యాకృత్యవివేచనాశక్తిని రూపుమాపి మానవమానముల నేలఁగలిపి యుక్తాయుక్తముల భేదమును నశింపఁజేసి పురుషుల నిచ్చవచ్చినరీతి నాడించుట. అయిన మదనమోహనుని తరుణి యెవ్వరు? మలయవతియే కదా? కాకున్న నాప్రాంతమున వేఱొండుసుందరి యెందున్నది? నాయూహ నిక్కమగుట సందియము లేదు. అది సమంజసమనుట కీతనినియే నాకుసాయమొనర్చెను. మదనమోహనుఁడు సందేహించుచు మేము కూర్చున్నతఱిపొంటలు నకు వచ్చెనుకదా? అపుడే శూరసింగు వెడలిపొమ్మని యతనిని కఠినముగ బలికెను. అతఁడట్లు పలుకుచున్నసమయముననే మదనమోహనుని స్వరము విని కాఁబోలు నీయును మేడసోపానములచెంత కరుదెంచెను. ఆమె యాగమనమును గాంచి శూరసింగు "నీకిచ్చట నేమిపని! లోనికేఁబొమ్మని కఠినముగ నాజ్ఞాపించెను. ఆమాటల కర్థమేమి? మదనమోహనుఁ డిచ్చటికి వచ్చినసమయమున నీకిచ్చట నేమిపని" యనియే కదా? మలయవతి కోపమున వెడలిపోయెను. మదనమోహనుఁడు కొంతదూరమేఁగెను. పిదప శూరసింగులోనికేఁగుటయు మలయవతీశూరసింగులకలహమును నీవిషయమైనేకదా? అప్పుడు మదనమోహనుఁడు శూరసింగుచేత మలయవతి కేదే నాపద సంభవించునేమోయని

మరలివచ్చి యాకలహము ముగియువఱ కందేయుండి వెడలిపోయెను. కావుననే మలయవతిసౌఖ్యమునకు మదనమోహనుని ప్రేమానురాగములే కారణములని నిర్ధరించితిని. అయిన వీరిరువురు నెప్పుడైన కలిసికొనుచుండిరా? కలసికొనుచున్న నెక్కడ? వీరిసంకేతమెయ్యది? ఈసందేహములకు సమాధానము నాకు కొంత వసంతునినుండియు, కొంతివృద్ధాంగనయగు మాలవినుండియు లభించెను.

వసంతుని కష్టుఁడప్పు డొక నీలవస్త్రాచ్ఛాదితయగు నొకయాకృతి నిద్రాభంగ మొనర్చుచుండెను. అతఁ డాయాకృతిఁ బ్రప్రథమమున పైశాచిక లీలగాఁ దలంచెను. దానిని కనుఁగొనుటకుసైత మతఁడెంతయో ప్రయత్నించెను. కాని శిరీషకుమారిని హంతకుఁడు మూఁడవతూఱి చంప ప్రయత్నించు నాఁటిరేయివఱ కతఁడు విజయ మంద లేదు.

నాకు భూతగణములయందు విశ్వాసమున్నను లేకున్నను నవి ప్రతిదినము నొక్కస్థలమునకే యించుమించుగ నొక్కసమయముననే వచ్చుచుండు ననిమాత్రము విశ్వాసము లేదు. ఆయాకృతి యెవ్వరిది? ఇందేటికి వచ్చుచుండెను ? దానికార్య మెయ్యది ?

ఇది మలయవతి యాకృతి యేలకారాదు ? ఆమెయే నీలవస్త్రాచ్ఛాదితయై ప్రతిరేయియు తన ప్రేమాస్పదుఁడగు మదనమోహనునికలిసికొనుటకై యేలరాకూడదు. శూరసింగు దీర్ఘతరక్రోధమును, నాఁటి మలయవతీ మదనమోహనులచర్యలును వారియన్యోన్యప్రేమాంకురము వృద్ధిజెంది పల్లవితమై, పుష్పించి యుండవలయు నను నిశ్చయము నాకొసంగెను. అదియుఁగాక నేను హోటలునకుఁబోయినతఱి మాలవి తనదేవరపిల్లితోనచ్చటికి వచ్చియుండెను. ఆయమ యొకవారమునుండి దూరప్రదేశమున కేఁగియుంటిననియు, కావున తనపిల్లి హత్యాదినము

అఱచియుండుట యసంభవమనియు వచించె. అయిన నాధ్వని యెచ్చటిది? ఎవ్వరోయచ్చటివారు తమస్వకార్యమునకై యాపిల్లిధ్వని ననుకరించుచుండిరి. వారెవరు? ఎందుకు? అని మీరడుగవచ్చును.

ఆ దేవరపిల్లి వికృతధ్వని ననుకరించుచుండుట యామలయవతియే. అదియే మలయవతీమదనమోహనుల సంకేతము. ఇది సత్యమగుటకు శిరీషత్రుతీయహత్యోద్యమము నాఁటిరేయి ప్రవర్తిల్లినవిషయములే తార్కాణములు, నాఁటిరేయి యునీమెజమంతమందిరమున కరుదెంచెను. తనయాగమనమును దెలుపుటకై సంకేతధ్వని యగు దేవరపిల్లి వికృతనినాద మొనర్చెను. మదనమోహనుఁడామెను కలసికొనియెను. పిదప కొంతవడి కామె గృహాభిముఖ యయ్యెను. ఆమెను సమీపమునకున్న ద్వారమువఱకు సాగనంపి మరలివచ్చుచో హంతకుఁడు హంతకుఁడను శబ్దమును మదనమోహనుఁడు వినెను. మలయవతి హంతకనామాకర్ణనమున స్త్రీనైసర్గికమగు భీతిచే స్తంభీభూతయై ద్వారముచెంతనే నిలువఁబడెను.

పిదప హంతకునిచే నతఁడు వధింపఁబడుటయు, తోడనే యందరు నందుచేరుటయు ద్విజేంద్రలాలుగారి ప్రశ్నయు "వధింపఁబడినది హంతకుఁడు కాం"డను వాక్యములను మలయవతి యాలించెను. ఆమెకు నడచుటకు కాళ్లు స్వాధీనముకాకుండెను. యామె మనస్సాక్షి హాావధింపఁబడినవాఁడు తనప్రేమపాత్రుఁడగుమదనమోహనుఁడే యని ఘోషించుచుండెను. ఆసందేహమును తాళఁజాలక నిశ్చేష్టయై యేదియోహానవాతీతమగుశక్తిచే నాకర్షింపఁబడినదానివలె నాయమ కొంతదూరమున మావెనువెంట శవము ననుసరించి శాలకు వచ్చెను. అప్పుడామె దుఃఖభయ సందేహాదులచే ప్రజ్ఞారహితవోలె సంచరించుచున్నను సర్వజీవసంతాన హృదయపీఠములఁ బాయక యొప్పుమను ప్రకాశించుచున్న

జీవితాశాశక్తిమాత్ర మింకను నామెను బాసియుండలేదు. కావుననే యామె స్తంభము మఱుఁగునదాఁగి యంతయుఁగాంచుచుండెను. అశవంతన ప్రియతముని దే యని యాలకించినంతనే యామె పాదముల కామెను భరించుశక్తి నశించెను. తోడనే యామె నిశ్చేష్టయై యందు కూలఁబడియెను. మేమందఱమూ చోటు వీడినంతనే యిఁకనంచుశవమున్న స్థానమున నొంటరిగ రహస్యముగ కారణములేక నిలిచియుండుట పరిహాదకరమని యామె మానసమున స్ఫురించెను. తోడనే యామె శరవేగమున నందుండి పరువెత్తసాగెను. సమీపముననున్న వసంతుడీమెను గాంచెను. తన్నింతకాలము బాధించుచున్న నీలచ్ఛాయాకృతి నాతఁడు బంధింప నిర్ధరించెను. కావున నాతఁడును నామె వెను వెంట పరువెత్తెను. సరోవరప్రాంతమున నిరువురునుకలిసికొనిరి. ఈమెను గుఱుతించినంత వసంతుని యాశ్చర్యమునకు మేరయే లేదు. వసంతమలయవతు లిరువురును నొకగ్రామవాసులు. చిన్నతనమునుండి యామె నతండెత్తి దించినవాఁడు. కాన నామెయుడంతమాతయు వచించినంతనే కోపగింపక యప్పటి యామె దుస్థితికి వగచెను. ఆమెకు సాయమొనర్ప నిర్ధరించి యామెను హోటలుప్రాంతమువఱకు చేర్చి వెడలిగెను. సరోవర ప్రాంతమునందలి పదచిహ్నము లీయిరువురివి" అని చాలించెను.

న్యా :—(మలయవతి నుద్దేశించి) ఇదంతయు నిజమా!

మల :—(తలవంచి) నిశ్చయము—ప్రత్యక్షముగ చూచినవాని వలె నంతయు పూసగ్రుచ్చినట్లైపడి నతఁడు వచించెను.

పిమ్మట వసంతుఁడును బలసూదనుని వాక్యముల కొంతవఱకు నిరూపించెను. న్యాయాధిపతి యంత శూరసింగు మలయవతుల బంధవిముక్తులఁ జేసెను. అప్పటికి న్యాయసభ ఫలాహారమునకై చాలింపఁ బడియెను.

# ముప్పదినాల్గవ ప్రకరణము

న్యాయసభా కార్యక్రమము విరమింపఁబడిన విశ్రాంతిసమయముననే నామిత్రుని కలిసికొనఁగలిగితిని. కుశలప్రశ్నానంతరము "నీకార్య మేమైనది" యని నేను ప్రశ్నించితిని. అతఁడంతయు ననుకూలమే యనియెను. కాని విశేషమేమియు వచింపఁడయ్యె. నేను నందఱివలెనే 4 గంటలవఱకు నిరీక్షింపవలసినదే.

"ఒరిస్సాయందు విశేషము లేమైన నున్నవా" యను నొక ప్రశ్న వినుపించెను. వెనుదిరిగి చూడ ద్విజేంద్రుఁడు మందహాసమున మావైపు చనుదెంచుచుండెను. నామిత్రుఁడును "విశేషము లెంతుగలవు! దేశమంతటను విశేషము లుండునా" యని చిఱునవ్వునఁ బలుకుచు నతని కరగ్రహణ మొనర్చెను. పిదప నామిత్రుఁడు తనప్రయాణపు వింతలను వచించుచు ద్విజేంద్రునిగూడి చనియెను. నేనాతని ననుసరింపక వేఱొక చోటికేఁగితిని. 2-55 గంటలు-అయ్యెను. ఫలాహారస్వీకారానంతరమున న్యాయస్థానము మరల కార్యక్రమమునకు సన్నద్ధమయ్యెను. ఉద్యోగియులును న్యాయవాదులును జనములును జరుగఁగలకార్యక్రమమున కెదురు చూచుచుండిరి. బలసూదనుఁడు సాక్షిస్థానమునకు దాపు మండపమున కాపుతుండయ్యెను. సకలప్రజల మనోనేత్రము లన్నియు నాతనిపై నాధారపడి యుండెను. అంధులు మార్గదర్శకునిపై నాధారపడిన చందమున న్యాయాధిపతియు నతనియందే తనన్యాయవిమర్శనభారమును మోపుదమా! వలదా? యని భావించుచుండెను.

న్యా : మహాశయా! హంతకుఁడెవఁడగుటయు నాలుగుగంటల వఱకు వచింపకున్నను నాఁడె, 25 తేది రాత్రి యాగదినుండి హంతకుఁ

జెట్లు హూయుమయ్యెనో సహేతుకముగ నిర్ధరించుట మీాతలపై నున్నది. ద్విజేంద్రలాలుగారు అంబికాచరణుని నపరాధిగ నొనర్చి యాగదినుండి హాంతకుని మార్గమును సూచించెను. మీారు "అంబికాచరణులు నిరప రాధులని వాదించుచున్నారు. కావున హాంతకుడు మాయమగువిషయమున ద్విజేంద్రలాలుగారి మార్గము మావిషయమున తప్పనియేకదా మీారు చెప్పవలయు? అదిగాకున్నను మీామార్గప్రకార మపరాధి యెట్లు మాయ మయ్యెనో తప్పక యూహింపవలయును.

బల : తప్పక యూహింపజాలెద వినుడు. నేను పత్రికాప్రకటనమును చదివినపిదప హాత్యాదినము రాత్రి హాంతకుడదృశ్యుడగుటనుగూర్చి యోచించితిని. శిరీషశయనమందిరమున రహస్యద్వారములు లేవు. పైకప్పునందు రంధ్రములు లేవు. ఈవిషయమై ఆరక్షకశాఖవారును, జయంతమందిరవాసులును దృఢముగ దెలుపుచున్నారు. కావున హాంతకుడు శిరీషగదినుండి మాయమగుట యసంభవము. మాయమగు టయే యసంభవమైనచో, నాతడాసమయమున నందే యుండవలయును గదా? అందుండిన నందఱకును కనుపింపనేవలయును గదా? అట్లు కనుపింపకున్న నాతడందుండ లేదనియే భావింపవలయునుగదా? ఉండ లేదన్న హాంతకుడు అప్పుడందుగా లేదనియే తప్పక నిర్ధరింపవలయు.

ఈనిర్ధారణమునకు ప్రతిబంధకములు 4 మొదటిది హాంతకుడు వదలిపోయిన కరవస్త్రాదివస్తువులును, పాదచిహ్నములు. రెండవది శిరీష కుమారి యార్తధ్వని. మూడవది పిస్తోలు కాల్చినశబ్దము. నాల్గవది యామె కపాలమున నున్నగాయము. ఇవన్నియు యోచింప హాత్యోద్య మము ప్రవర్తిల్లినదనియే తలంపవలసియున్నది. అట్లయిన హాంతకుడు వచ్చియే యుండవలయును? వచ్చియున్న పంచానన వసంతాదులు కవాటములుభేదించి లోనికేగునపుడు వాడేల కానరాడయ్యెను?

కావుననే యీహత్యాప్రయత్నము రెండుభాగములుగ విభజింపవలయును. మొదటిది పంచాననాదులు వచ్చి కవాటము భేదించు సమయమునకు ముందే, శిరీషకుమారి యొంటరిగనున్న సమయమున ప్రవర్తిల్లినది. రెండవభాగము శిరీష పర్యంకము చేరిన పిదప రాత్రి 11 గంటలనుండి 12 గంటలలోపల జరిగినది. హంతకుడు రాలేదు. హత్యాప్రయత్నమును వచ్చిన చిహ్నములను కాన్పించుచున్నవి. ఈ రెంటిలో నొకటి యబద్ధము కావలయును. హత్యాప్రయత్న చిహ్నములు ప్రత్యక్షముగ కాన్పించుటచే నవి యసత్యములు కావుగదా? ఇక హంతకుడు వచ్చుట యసత్యమందుమా? వాడు రానిదే హత్యాప్రయత్నచిహ్నములకు సంభవ ముండదు. కావున హంతకుడు వచ్చి హత్యాప్రయత్నము సలిపినాడు. అయిన పంచాననాదులు చూచినపుడు రాలేదని నిర్ధారణకలుగవచ్చును? కనుక రాత్రి 11 గంటల నుండి 12 గంటలవఱకు హంతకుడు రాలేదని యెంచవచ్చునుగదా? అట్లైన నంతకుముందే వచ్చియుండవలయును. ముందన్న నెప్పుడు? ఎప్పుడు వచ్చిన తన్నెవరును చూడకయుండురో శిరీషమాత్ర మొంటరిగ నుండునో యపుడు. అట్లుగా నెవ్వరును లేక శిరీష యొంటరిగనున్నది రెండు సమయములందు. అందు మొదటిది పంచాననాదులు విహారార్థమై పోయియుండినపుడు వారు మరల వచ్చుచో పంచాననుడుద్యానవనము చేరువ వనాధిపతియైన మదనమోహనునితో మాటాడుచుండ శిరీష మాత్రము తనయుడుపులు దీయుటకై పడకగది చేరినసమయము. ఇదెపుడు? సాయంకాలము 5 గంటలనుండి 6 గంటలవఱకు. రెండవది శిరీష తానొంటియై రాత్రి 11 గంటలకు తండ్రినివదలి లోనికరిగి శయనించిన సమయము.

ఈ రెంటిలో నెపుడో హంతకుడు వచ్చియుండవచ్చును. 11 గంటలకాలమున హంతకుడు రాలేదనుటను నిదివరలో నేనిర్ధరించి

నారము కదా? ఇఁక 5 గంటలనుండి 6 గంటలవఱకు నుండు కాలమే హంతకాగమనమునకు ననుకూలమైన సమయము. ఇదియే హత్యాప్రయత్నమున ప్రథమభాగము. అయిన హంతకుఁడు శిరీష విహారమున కేఁగి మరలవచ్చిన సమయముననా? లేక విహారమునకై పోయినసమయముననా? యని యోచింప, విహారమునకై పోయినసమయముననే హంతకుఁడు వచ్చుట కనుకూలము, శిరీష మరల నింటికి వచ్చినసమయమునందు ప్రవేశపుగది యందలి గవాక్షము మూయఁబడి వసంతునిచే బంధింపఁబడినందున నపుడు వధకుఁడు ఇంటఁ బ్రవేశింప సాధ్యముండదుగదా ? ఆగవాక్షమొక్కటియేకదా ప్రవేశించుటకు మార్గము! కావున శిరీష విహారమునకై పోయినసమయమున వసంతుఁడు ప్రవేశపుగది చెత్తదుడిచి గవాక్షమును బంధింపని సమయమున హంతకుఁడు నిరాతంకముగ ప్రవేశింపవచ్చును. శిరీషాపంచాననులింట లేరు. వాహ్యాళికై పోయియున్నారు. వసంతుఁడు గృహకృత్యములకై తనపనిమీఁద పోయియుండెను. ఆసమయముననే చెంతనున్న పొదలోనుండి సమయనిరీక్షణ మొనర్చుచున్న హంతకుండు తొలుత ప్రవేశపుగది గవాక్షముగుండ లోపలఁ జొచ్చెను. పరిశ్రమాలయమందలి యినుప [illegible] తన చెంతనున్న- తాళముచెవితో తెఱచెను. తాళముచె[illegible]కి లభించెనన్న అపరాధియే యెట్లో శిరీషాపంచాననులు [illegible]ములచే మైమఱచియున్నతఱి దాని నపహరించెను. ఈవిషయ[illegible] 22 వ తేది వార్తాప్రకటనపత్రికవలన నిరూఢమగుచున్నది. ఆవిషయమును మేజస్ట్రేటుగారియెదుట నేను సకారణముగ నిరూఢపఱచియున్నాను. దానిని వారు అపరాధవిచారణ పత్రములయందు రికార్డు చేసియున్నారు. ఇట్లు తెఱచిన పెట్టెయందలి రసాయన పరిశ్రమపత్రికల పార్సిలును గ్రహించి, దానిని నిరుపయోగ వస్తువులుంచు గదియం దుంచినాఁడు. దీనికి నిదర్శనము చౌకాకృతిగల మొగగుఱుతు నాగదియందు మేజస్ట్రేటుగారికి చూపియున్నాను.

వారు చూచి రికార్డు చేసియున్నారు. తనహింసాకృత్యమును నిగ్రహింప నెంచి శిరీషగది చేరి పర్యంకముక్రిందదాఁగి యామె రాగమనమునకై ప్రతీక్షించుచుండెను. అపుడు భూమిపై పడినయుఁగు చిహ్నములనే గ్రహించి యధికారులకు ప్రదర్శించియున్నాను.

ఇంతలో శిరీషకు మూరిమాత్ర మిల్లువచ్చెను. పంచాననుఁడు రాలేదు. అతఁడు తనయుద్యానపాలనాధిపతి యగుమదనమోహనునితో మాటలాడుచు నుద్యానవనముచెంత నుండెను. శిరీష తనయుడుపులఁ దీయుటకై తనశయనమందిరముఁ జేరెను. అంతకుముందే హంతకుఁడు మనుజుల మాటలు బ్రేలను వంటుంచినందున భయపడి విస్మయచిత్తముననున్న యామె నాక్రమించి తనయాగ్రోధమును దీర్చుకొనుటకై గొంతును గట్టిగనలిమి యామెను హింసింప ప్రారంభించెను. వానికామెను వధించుట కిష్టములేదు. హింసించి యామెను భయపెట్టి తనమార్గమునకు త్రిప్పుకొనుటయే యుద్దేశము. ఆమె యఱచెను. కాని దగ్గర నెవ్వరును లేనందున నెవ్వరికిని వినుపింపలేదు. విధిలేక యాత్మరక్షణకై యామె పిస్తోలును కాల్చెను. అది గుఱితప్పి హంతకునిహస్తమునకు తగిలెను. ఆదెబ్బవలనహస్తమునకు గాయముతగిలెను. హంతకుఁడు దానిచే నస్తసత్త్వుఁడై హింసాప్రయత్నమును మాని క్రిందపడఁబోయి తనహస్తమున గోడ కానుకొనియెను. ఆహస్తచిహ్నమునందఱును జూచియే యున్నారు.

ఇంతలో పంచాననుఁడు మాటలాడినధ్వని వినవచ్చెను. హంతకుఁడింక నిందుండరాదని యెంచి వడివడిగ గదివెలుపలకు చనియెను. పోవునప్పుడు తనమేధాబలమున పరిశోధకులకు స్వప్రయత్నము తెలియువిధము నొనర్చుటకును, వారింకొకరిపై నపరాధారోపణ మొనర్చునట్లును చేయుటకై యొక చేతిరుమాలును నుష్ణీషమును వదలి చనియెను. అవి వసంతునివి. హంతకుఁడే వానినెట్లో యపహరించెను. వీనిని బుద్ధిపూర్వ

కముగ వదలిచనియెను. గొజ్జుకొమ్మ నొక్కదానిని ప్రమాదమున వద లెను. అట్లు చనినవాడు మురల నాసిరుపయోగపుగదికి పోయి తానం దుంచిన దొంగతనపుపార్శిలు తీసికొని యాగదికిటికీగుండ బయలువెడ లెను. సరోవరప్రాంతమున తాను వసంతుని పెద్దబూట్సు నపహరించి యున్నందున వానినందు వదలి లోన నంబికాచరణులుగారి బూట్సును బోలినబూట్సును తాను తొడిగికొనియున్నందున వానితో బైసికిలెక్కి చనియెను. శిరీషయు తనబాధ నట్లోయణచుకొని రొయిడలు సవరించు కొని యాగవాక్షమును మూసి తనగదియందు హంతకుని పాద చిహ్నము లేమియు లేకుండ దుడిచి పరిశ్రమాలయమున కూర్చుండెను. పిదప తండ్రితో భుజించెను. ససివిషయమును విమర్శించుటకే మేజస్ట్రీటు గారితో "ఆమె ప్రక్కపాపట తీసి జడవేసికొని యున్నదా! నడుమ పాపటదీసి జడ వేసికొనియుండెనా" అని ప్రశ్నించితిని. వారు నడుమపాపట దీసియే జడయల్లుకొని యుండెనని చెప్పిరి. ఆమెకు గాయమేమియు తగులలేదనియు కణత కట్టుగాయముండిన దాని నితరులు గుఱుతింప కుండుటకై ప్రక్కపాపటదీసి జడ వేసుకొనుచుండె ననియు నేనూహించి తిని. మొదటిభాగమునందే హత్యాప్రయత్నమనునూహ కప్పుడంత సాధనము లభింపలేదు.

శిరీష తండ్రితో భుజించి యుపవేశించి తనమనోవిషాదమును వెలిపడకుండుటకై బాధను సహించి యుండెను. ఆబాధ దుస్సహముగ నుండుటచేతనే తనస్వాభావికనిద్రాకాలమైన 11గంటలసమయ మెప్పుడు వచ్చునా? యని గడియారమును చూచుచుండెను. పిదప పోయి శయనించెను.

న్యా : అటులైన వసంతుడు శిరీషగదిలో దీపము వెలిగింప నేగియుండెగదా? అప్పుడా రక్తహస్తచిహ్నమును తలబుట్టలను జేసి

రుమాలు మొదలగువానిని చూచియే యుండవలయుంగదా ! ఆసంగతి లేదనుచున్నాండే ?

బల : నేను దీనిని తొలుతనే శిరీషగదిని పరిశోధనచేయునప్పుడే తెరబల్లపై నాదీపముంచుకొంటిని కావున నట్లే యొనర్చి చూచితిని. క్రిందిభాగమున నున్నవస్తువు లేమియు నంతస్ఫుటముగ కనుపించుచుండ లేదు. నేపరీక్షించి యున్నాను. అందును దీపము వెలిగింపవచ్చునే ముదుసలికి వస్తువులనన్నిటి నంతసూక్ష్మముగ చూడవలసినయక్కఱ యేమి ? మావంటి పరిశోధకులదృష్టికే యెన్నియో వస్తువులు కనుతప్పి పోవుచున్నవి.

న్యా : మీరు వచించినదంతయు నప్రయోజనము. రాత్రి 11 గంటలప్పుడు శిరీషకణతపై గాయమున్నది. రాతిబల్లకొనకు రక్తము గుఱుతున్నది. శిరీష "హత్య, హత్య" యని యఱచెను. పిస్తోలు ప్రేలెను. ఇవన్నియు నసత్యములనుచున్నారా ? మీపనికిమాలిన కల్పనము వ్యర్థకాలయాపనకు కారణము.

బల : కొంచెము నిదానింపుండు హత్యాప్రయత్నపు రెండవ భాగమును నేను వివరించుచున్నాను. అంబికాచరణుండు నిరపరాధి యనిన వారు హత్యాద్వితీయభాగమును నిరూపింపవలయును. సాపరాధియున్న ద్విజేంద్రలాలుగారి పరిశోధనమార్గప్రకారము పంచాననుండు హంతకుని తెలిసి చూచి తనకాప్తుడని పోనిచ్చెను. ఇదిసాధ్యమా ? హంతకుండైన అంబికుండు తనచెంత పరిచర్యచేయుచుండ శిరీషప్రణయ సానురాగవచనముల నాతనిక్షేమము కోరియుండునా? మొన్న నంబికాచరణుని నిర్బంధనదినమును నామె తనరహస్యమును వెలిపెట్టినదైన నీనిందను బాపికొనుమని విషాదమున పల్కలేదా ? ఇదియుంగాక రెండవ మాఱుతన్నుహింసింపం నే తెంచినను మూండవసారి తన్ను వధింప

ప్రయత్నించినను హంతకునిపై శిరీషయు పంచాననుండును, దయాదర భావమున నుండురా? కోర్టునందు సైతము పంచాననుడు నంతటివాఁడు నిరపరాధి యని వచించునా? ఇది యటుండ మొదటి తే 25 రాత్రి మాయమగుటకును మరల రెండవమారు మేముందఱ మతనిని పట్టఁబోవ మాయమగుటకును మూఁడవపర్యాయము మాయమగుటకును కారణము వలదా? 5 గంటల యీ హత్యాప్రయత్నము అంబికాచరణునికంటె వేఱైనవాఁడొనర్చెను. నేను 4 గంటలకు ప్రవేశించుచూపి నిర్దేశింతునుకదా?

ఇక 11 గంటలయందు జరిగిన హత్యాప్రయత్నము అసత్యము. అది ఇతరులచే జరుగలేదు. ఇతరులచే జరిగియున్న ఇతరుఁ డెవ్వఁడు లేఁడు. హత్యాచిహ్నము లున్నవి.

ఇవన్నియుఁ గూడ హంతకుఁడు లేనిదే హత్యాచిహ్నము లుండు స్థితిని మన మాలోచింప వలసియున్నది. మనకు స్వభావముగ నిద్ర వచ్చును. శిరీషకును నిద్ర వచ్చినది. మనము దేనినేని మిక్కిలిహింసను కష్టమును భూత చోర హంతకాదుల పరిబాధనమును నొందిన సమయమున మననిద్ర యెటులుండును? గాఢనిద్రరాక కలవరింపులు మేలుకొనప్పుడు జరిగినవిధముననే లేచుట, తిట్టుట, కొట్టుటకై దేనినైన తీసికొనుట, లేచి హెచ్చరిక లేకుండ పరువెత్తి పోవుట, మొదలగునవి కలుగుచుండును. ఆ విధముగనే శిరీషయు కలిగియుండవలయు నని మన మూహింపవచ్చును. హంతకుని గాంచినది. అతిభయము నందినది. వాఁడు హింసింప మరణబాధ నొందినది. మనోబాధ యెక్కుడైనది. మేనున హెచ్చరిక లేనిట్టివిధముననే చరించినది. స్వప్నించినది. నిద్రయందింతకు ముందే ప్రవర్తిల్లిన విషయములన్నియు వచ్చినవి. హంతకునియాకారమును వాఁడు తనకంఠము నాక్రమించి నులుము చుండుటయుఁ గాంచినది. స్వప్నముననే యిదియంతయు జరిగినది. దానియందే దూయము

తనచెంతనే బల్లపైనున్న పిస్తోలుపైన చెయిపోయి దానిని గట్టిగ పట్టుకొన్నది. దానివలన నది ప్రేలినది. గుండు పైకేగినది. శాను వాని నెదురింప జరిగినందున శయ్యపైనుండి క్రింద పడుట సంభవించెను. అట్లు పడుటలో చెంత పిస్తోలుంచినబల్లపై తన శిరమునందలి కపాలము పడి దానికొనకు తగిలెను. నిశితమైన యా మొనవలన నధికవ్రణ మయ్యెను. కపాల మపాయస్థలమైనందున నందలి గాయమువలన నామె మూర్ఛిత యయ్యెను, అట్లు హంతకరూపదర్శనమైన పిదప వాడు తన్నాక్రమించినట్లు కనపిమ్మట "హాత్యా, హాత్యా" "రక్షింపుము, రక్షింపు" మను ధ్వనియు నామె నోటినుండి వచ్చుచుండెను. వానితో పెనగులాడినధ్వనియు నామె నోట న్రపయత్నముగ వెడలి వచ్చెను. ఆ యమ బల్లపైని పడుటచేతనే బల్ల తలక్రిందుగ క్రిందఁబడియెను. దాని నానుకొనిన సామగ్రియంతయు క్రింది కొరిగెను. ఇదియే రెండవ హాత్యా ప్రయత్నభాగము.

ఇది యంతయు స్వభావముపై నాధారపడియున్నది. దీనికి నిదర్శనములు బల్లకొనపై నున్న రక్తంపుగుఱుతును, ఆ రక్తమునందె రొయిక వెంట్రుకయు తగిలియున్నది. ఇవి చాలవా నిదర్శనములు! శిరీష మొదట హంతకుని దౌష్ట్యము ననుభవించియున్నందున వాడు మరల రాత్రి కూడ వచ్చునేమో యను భయమున వసంతునిపిస్తోలును అతనికి తెలియకుండ తెచ్చి యుంచుకొనెను. ఇది స్వప్నహాత్యాప్రయత్నము. అటు కాకున్న హంతకుఁడే హాత్యాప్రయత్న మొనర్చి గొడ్డకొమ్ముతో కణతపై పొడిచినయెడల రాతిబల్ల కొనకు రక్తమును వెంట్రుకయు నుండుటకు కారణ మేమి? ఇదియుఁగాక గొడ్డకొమ్మునందలి రక్తపు చిన్నెలు చాలకాలమునందలి రక్తపుచిన్నెలని తెలియువలయును, నేను రసాయన పరిశ్రమచే కనుఁగొని యున్నాను. రెండుమారులు పిస్తోలు కాల్చిన ధ్వని యెట్లు వినబడినదని మీరు ప్రశ్నింపవచ్చును. రెండవ తూరి వినిన శబ్దము పిస్తోలు కాల్చుటచే కలిగినది కాదు. రాతిచే చేయబడినబల్ల క్రింద రాతినేలపైఁ బడిన శబ్దము. ఇంతలో 4 గంటలు కొట్టెను.

# ముప్పదియైదవ ప్రకరణము

గడియారము 4-0 గంటలు సూచించుచుండెను. న్యాయసభా భవన మంతయు దిదృక్షాయుత్తజనసముదాయముచే క్రిక్కిరిసి యుండెను. అంతటి జనసముదాయము మహార్ణవముస్థితివలె నిశ్శబ్దముగ నుండెను. అందఱి చూపులును ద్వారము మీఁదనే యుండెను. అప్పటియుత్సాహము వర్ణించుటకన్న పాఠకు లూహించుటయే సముంజసము.

గడియారము నాలుగు గంటలు కొట్టుధ్వని యింకను సంపూర్ణముగ ముగియకమునుపే నా మిత్రుఁడు మందగమనమున నచటి కరుదెంచెను. జనులందఱు సంతోషపూర్వ కాహ్వానమొసంగ నతఁడు సాక్షులకై నిర్మింపఁబడిన స్థానము చేరెను. పిదప నంతయు నిశ్శబ్దము. న్యాయాధిపతి యతని నిట్లు ప్రశ్నించెను. "నీ విపుడు శిరీషకుమారి హత్యా సంబంధముల వచించుటకు సిద్ధముగ నున్నాఁడవా ?"

బల : సిద్ధముగ నున్నాఁడను.

న్యా : హంతకుఁడు తన తృతీయహత్యాప్రయత్నమునతప్పించు కొన్నవిధము ద్విజేంద్రమహాశయుఁడు వచించినది నిశ్చయమా ?

బల : హంతకుఁ డా మూల చేరునటుకు నతఁడు వచించినది సత్యము. హంతకుఁడే మదనమోహనుని వధించెను.

న్యా : అయిన హంతకుఁ డప్పు డెట్లు వెడలిపోఁ గలిగెను ?

బల : అతఁ డందుండి వెడలిపోవనే లేదు.

న్యా : వెడలిపోవనే లేదా ? వెడలిపోవకున్న హంతకుఁ డందే యుండెనా ?

బల : అంతె యుండఱిసమక్షమున నే యుండెను.

న్యా : —(కోపమున) ఇది పరిహాసమునకు స్థానము కాదు. ఇది న్యాయసభ - నీపై నింకను న్యాయసభాగౌరవధిక్కార నేరారోపణ మున్నదని మఱపకుము.

బల : నేను పరిహాసమున కిట్లు చెప్పలేదు. సత్యమునే వచించు చున్నాను.

న్యా : అయిన నీ మాటల కర్థమేమి ? హంతకుఁడు మీ సమక్షమునే యుండెనా ?

బల : మా సమక్షమునే యుండెను.

న్యా : ఏమీ ! సమక్షమున నున్నను మీ రతనిని పరిశీంప లేదా ?

బల : మేమందఱము నతనిని చూచుచునే యుంటిమి.

న్యా : మీ రేల యతనిని బంధింపలేదు ?

బల : అతఁడు హంతకుఁడనుట నా కొక్కనికిఁ దక్క నితరుల కేరికిని తెలియునికగాన—

న్యా : —అయిన నీ వేల యతనిని బంధింపవైతివి ?

బల : నా కప్పటి కింకను హంతకుని ద్వితీయభాగము లభించి యుండలేదు.

న్యా : చాలు నింక నీ పరిహాసము. ఇప్పటికే వీనినుండి చాలకాలము వ్యర్థమైనది.

బల : న్యాయాధిపా ! నేను సత్యమును వచించుచున్నను మీరు కోపగించిన నేనేమొనర్తును. నాఁడు ఆ మూలయందు- శిరీషకుమారి యొక్క- హంతకుఁడు- మా కన్నులయెదుటనే యుండెను.

న్యా : ఏమీ ! నీ పరిహాసము మానవా ? ఉండుచున్నవా రెవ్వరు ? నీవు- వశీకరుఁడు వసంత, పంచానన కందళదినేశాదులే కదా ! వారిలో నొక్కఁడు హంతకుఁడా !

బల : మందహాసమున- అవును.

న్యా : వారిలో నొకఁడు హంతకుఁడా ? కానిమ్ము. అందులో ప్రథమమున నీవుకూడ నుంటివికదా ? నీవు హంతకుఁడవా ?

బల : కాను.

న్యా : వశీకరుఁడా ?

బల : కాదు.

న్యా : వసంతుఁడా ?

బల : కాదు.

న్యా : పంచాననబాబా ?

బల : కాదు.

న్యా : కందళుఁడా ?

బల : కాదు.

న్యా : దినేశబాబా ?

బల : కాదు.

న్యా : (కోపమున) అందఱుగాకున్న నింకెవరు ? మదన మోహనుని శవమా ?

బల : అదియును కాదు.

న్యా : అయిన నింక నందెవ్వరున్నారు ? అందఱును కారన్న భూతమా ? లేక పిశాచమా ?

బల : అవియును కావు. అందెవ్వరును లేకున్నను- నచ్చటనే మేడపై గవాక్షము చెంత నిలిచి యీ వృత్తాంతము నంతను నొకఁడు పరికించు చుండెను.

న్యా : అందెవ్వ రుండిరి ?

బల : అందెవ్వ రుండిరా ? శిరీషకుమారిని వధింప మూఁడు పర్యాయములు ప్రయత్నించి మా కన్నుల మన్నుచల్లిన హాంతకుఁడు

న్యా : ఎవరు ! ఎవరు ! హాంతకుఁ డెవరు ?

బల : హా-ం-త-కుఁ-డు, ద్వి-జేం-ద్ర-లా-లు-

# ముప్పదియాఱవ ప్రకరణము

హాంతకుని నామోచ్చారణముచే జనించిన యాశ్చర్య సంశయవివాదములు జనసముదాయమును బాయుట కైదునిమిషము లయ్యెను. అది యణఁగి సభయందు మరల నిశ్శబ్దత కలిగినంతనే న్యాయాధిపతి యిట్లు పలికెను. "నీవు స్వస్థచిత్తముతో మాటాడుచున్నాఁడవా ? నీవు నిందించువాఁడు సామాన్యుఁడని తలఁచితివా ? నీ నిందారోపణకు కారణములున్నవా !

బల : న్యాయాధిపా ! నిదర్శనములు లేక నే నెట్టికార్యము నొనర్చువాఁడను కాను. నే నొరిస్సాదేశమంతయుఁ ద్రిమ్మరిపచ్చుట నిదర్శనములకుఁ గాకున్న దేశదర్శనాభిలాషకతననా ?

న్యా : అయిన నీ నిదర్శనము లెయ్యవి ?

బల : నిదర్శనములా- కావలయునన్ని యున్నవి. అందు ప్రథమమున ద్విజేంద్రుని బిలువనంపుఁడు చూతము.

న్యాయాధిపతి యాజ్ఞచే సేవకుఁడు వెడలి కొంతవడికి మరల చనుదెంచెను. ద్విజేంద్రుఁడు న్యాయసభాపరిసరమున నెందును కానరాఁడయ్యెనని యతఁడు విన్నవించెను.

న్యా : ఏమి ! ద్విజేంద్రమహాశయుఁడు కాన్పింపలేదా !

బల : లేదు. ఇఁక నతఁడు మీకు కనుపింపఁజాలఁడు-అతఁడప్పుడే బొంబాయిని విడిచి యొకగంటకన్న నెక్కుడు కాలమయ్యె. అతని కీవ్యధి కల్పించుటకై నేను 4-6 గంటలవఱకు నే యుదంతమును వచింపనైతిని. 1-45 గంటలకు న్యాయసభా కార్యము పరిష్కరింపఁబడును.

15 నిమిషము లతఁడు గృహమునే చేరుటకును, 30 నిమిషములం వలయు పరికరముల సేకరించుటకును, 15 నిమిషములు ధూమశకట కార్యాలయము చేరుటకును కలసి యొకగంటకాల మేఁగును. 1_15 నిమిసము లతఁడు బొంబాయివీడి యితరులు తన్ననుసరింపకుండుటకై; తన వేషభాషల మార్చుకొని సురక్షితస్థానము చేరుటకు నగునని యోచించియే 4 వఱకు హంతకునినామము వెలిబెట్టనైతిని.

అందఱును నాశ్చర్యనిమగ్నులైరి. న్యాయాధిపతి యంత "ద్విజేంద్రుఁడు హంతకుఁడని తెలిసియు నీ వాతనిపలాయనమున కేల సాయమొనర్చితివి ?" అని ప్రశ్నించెను. బలసూదనుఁడును మందహాస మున, "న్యాయాధిపా ! నేను రాజకీయాపరాధపరిశోధకుండను కాను. ద్విజేంద్రుఁ డప్పటి కింకను నిందితుఁడునైతము కానఁదున నే నతనితో "నీవే హంతకుఁడవేల కారాదు" అంటిని. అతఁడు_ "ఏల" యని నన్ను ప్రశ్నించెను. నేను రెండుకారణముల వచించితిని. అతఁడప్పుడు ననుగాంచి, నే నిపుడేమొనర్తు" ననియెను. నేను బొంబాయినుండి పెక్కు ధూమశకటములు బోవుచున్నవని మారు పలికితిని. అతఁడు సరియే యని నుడివెను. కాన హంతకుని పలాయనమునకు నే నెట్లుత్తర నాదిని" అనియెను. అందఱును నవ్విరి.

న్యాయాధిపతి "నీవు హంతకుని నెప్వ డనుమానించితివి ?" అని యడిగెను. బలసూదనుఁ డిట్లుచెప్పదొడఁగెను. "నాకు ప్రథమముగ నతనిపై ననుమానముకలుగుట, 1 వ తేదీ రాత్రి హంతకుఁడు మేడపై హాలులో, మా యందఱి కట్టెదుట మాయమైనప్పుడే. ఆ దిన మట్లు హంతకుఁడు మాయమైనపిదప నాకు కలిగిన చింతాయోచనల నందు వివరించి, ఘనతచెందిన యీ న్యాయసభవారి యమూల్యకాలమును వ్యర్థపఱుపఁ జాలను. హంతకుఁ డెట్లు మాయమయ్యెను ! తిరస్కరణీ

విద్యాబలమువనా? అది యసంభవము కదా? అయిన నతఁడు మాయమగుటకు కనుమఱుగగుటకుఁ దప్పుటకు నందు రహస్యద్వారము లేదు. గుప్తస్థానము లేదు. అయిన హంతకుఁ డేమయ్యెను?

హంతకుఁడు మాయమగుట యసంభవము, అయ్యది యసంభవమైన నీక సంభవమెయ్యది? హంతకుఁ డందే మాయెదుటనే యుండవలయును, కాని మేమతనిని గుఱితింపలేదు. అచ్చట మేమైదుగురుండవలసియుండెను. నేను వసంతుఁడు, పంచాననుఁడు, ద్విజేంద్రుఁడు, హంతకుఁడు, అయిన మేమిందెంతమంది యుంటిమి? నలుగురు కావున హంతకుఁడు మానలువురిలో నొక్కనియందు విలీనమై యుండవలయు. ఆనలువురిలో నొక్కఁడు రెండుపాత్రల నభినయించి యుండవలయు. కాకున్న నతఁడు మాయమగుటకు వేఱు కారణమే లేదు. అందున్న నలువురిలో నొకఁడు హంతకుఁడై యుండవలయును. అతఁడెవ్వరు? నేను హంతకుని వెంట ననుసరించుచో నలువురిలో నితరులను నేను ప్రత్యేకముగ నెవ్వరిని చూచితిని? నేను గవాక్షముగుండ శిరీషశయనాగారముఁ జొచ్చి హంతకు ననుసరించితిని కదా? నేను సంకేతమొనర్చి హంతకుని వెన్నంటి పెద్దహాలు ప్రవేశించుసరికి హంతకుని వెనుక పంచాననబాబు పరువెత్తుచుండెను. పశ్చిమభాగమునుండి వసంతుఁడు పరువెత్తి హంతకుని సమీపించుచుండెను. కావున వీరిరువురును హంతకు లగుట యసంభవము. నేను ద్విజేంద్రుని హంతకుని నేకకాలమున చూచితినా? ద్విజేంద్రుఁడు సంకేతస్థానమును చేరుటకు నర్ధనిమేష మాలస్యమయ్యెను. కావున నతఁడు వచ్చుసరికి హంతకుఁ డందుండలేదు. హంతకుఁడు విలీనమగుటకు ద్విజేంద్రునికన్న వేఱొకరు కలుగరు. నా యోచనా ప్రవాహ మింతవఱకు ప్రవహించెను. కాని ద్విజేంద్రుఁడే హంతకుఁడని నా బుద్ధి వచించుచున్నను నాకు విశ్వాసము జనింపలేదు.

అయిన ద్విజేంద్రుఁడే హంతకుఁడనుటకు మూఁడాటంకము లుండెను. అందు ప్రథమమున చిన్నహాలునందలి గవాక్షము తెఱవఁబడి యుండుటకును నందు నిచ్చెన యుండుటకును కారణమేమియనుట- ద్విజేంద్రునిగది నాగది ప్రక్కనే మేడపై నున్నదికదా? అట్టిచో గవాక్షము తెఱచియుండనేల? దీనికి కారణము సులభమే. హంతకుని యాగమనము వెలుపలినుండియని పరిశోధకుల భ్రమింపఁ జేయుటకును, సమయము వచ్చెనేని యందుండి పలాయితుఁ డగుటకును నీగవాక్షము తెఱవఁబడి యుండెను. నిచ్చెన యుంచుఁబడియుండెను.

ఇఁక రెండవయాటంక మేమన్నది? నేను వసంతసహితుఁడనై శిరీషశయనాగారమున హంతకుని మొదట చూచితిని. అందుండి నేను దిరిగి మేడపైకిఁ బోయి ద్విజేంద్రుని గది జేరి యాతని పిలిచితిని. అపుడాతఁడందుండెను, దీని నెట్లు సమర్థింపవలయు. అతఁడు నేనుపోయినపుడేదియో వ్రాయుచుండెకదా? నేనాతనిఁ జూచి నిచ్చెన దిగునప్పటికతని వ్రాఁత పూర్తియై యుండవచ్చును. కావున మరల శయనాగారముఁ జేరి యుండవచ్చును. నేనాతనిగది తట్టినంతనే నిద్రనుండి లేచిన వానివలె నటించుచు నాకు కనిపించెను. అట్టి హంతకునకు నిట్టినటన కష్టమా? అదియుఁగాక నేను హంతకుని శిరీషశయనాగారమునఁ గాంచి యుండుట వచించినంతనే యతఁడు రిచ్చవడనేల!

అయిన నన్నిటికంటెను ప్రబలమైనసందేహ మొకటిగలదు. ద్విజేంద్రుఁడే హంతకుఁడైన నేనతని నొకస్థానమున నుంచి మరల హంతకుని గది చేరితినిగదా? అపుడు హంతకుఁడందుండెనుకదా? నేను హంతకుని నిర్బంధింపనేగుటయు వసంత పంచాననులు హాలులో నతనికై వేచి యుండిరని తెలిసియు మరల నతఁడు వారికనుఁ బ్రామి శిరీషశయనాగారము నేలచొచ్చెను? ఎట్లు చొచ్చెను? మేము గురుతించునంతటి

సాహసమునకై యతఁడేలయియ్యకొనెను? ద్విజేంద్రుఁడే హంతకుఁడగు నెడ నతఁడు మేడ గదిఁ జొచ్చి యెంతటిసాహసమునకైనఁ బూనుటకు నతని కేదియో ప్రబలతరకారణ ముండవలయును. అది యేది? తాను వ్రాత పని ముగించి యుండెఁగదా? అతఁడేదియైన ముఖ్యమగువస్తు వొకటి యందు మఱచి యుండవలయు? అదిమాచేతఁ బడెనేని యాతని గురు తించుటకు సాధనముగ నుండవలయు. కావున మేము హంతకుని యాగమన మెఱింగి యతనిని బట్టుటకు పోవనుండుట తెలిసి తానందు పొరబాటున మఱచినవస్తువు మాహస్తములఁ బడుననియు నది తన యుదంతము మాకు వచించి తానే హంతకుఁడనుటకు మాకు నిదర్శన మగుననియు భీతిల్లియే యంతటి సాహసమునకు దొరకొనెను.

నాయూహ సమంజసమనుటకు నేను రెండవపర్యాయము హంతకుఁడున్న శిరీషశయనాగారమున హంతకుఁ డేమొనర్చుచుండెనో చూచితిని? దీపము నేలపై నుండెను. అతఁడు క్రిందనేలపై గూర్చుండి యుండెను. నేను మొదటితూరి యతనిఁ గాంచినపుడు కుర్చీపై నుపవేశించి యుండెఁగదా — ఇపుడు నేలపైఁ గూర్చుండియుండనేల? నేలపై తాను పార వేసికొనిన దేదియో వస్తువును వెదకికొనుటకై కాదా?

ఆవస్తువెయ్యది. అది యాతనికి లభించెనా? నేనతని గాంచునప్పటి కతఁడింకను నేలపై వెదకుచున్నందున నావస్తు వతనికి దొరికియుండదు. అయిన నావస్తు వందే యుండవలయుకదా? దానిని వెదకుటకును నితర కార్యములకును విశ్వాసపాత్రుఁ డగు సేవకుఁ డొకఁడు కావలసి యుండెను. నేనే శిరీషశయనాగారమును జొచ్చి దానికై వెదకుట యసంభవము. మీదుమిక్కిలి నాప్రక్కగదియందే నివసించుచున్న హంతకునికనుమానాస్పద మగును. కావుననే కౌముదీకంబళులబంధవిము క్తికి నేకారణుఁడ నైతిని. ఇఁక మేమందఱము నందుండ ద్విజేంద్రుఁడు తన వేసము నెట్లు మార్చుకొని మరల మిమ్ముల చేరగల్గెనని మీరు ప్రశ్నింప

వచ్చును. అది యతనికంతటి కష్టసాధ్యకార్యము కాదు. నేను పంచాననవసంతుల సంకేతస్థానముల నిలుపుభారము నాఁటిరేయి ద్విజేంద్రునిపై నే వైచియుంటిని. కావున వారిని నియమితస్థానములఁ జేర్చుమిషచే పెద్దహాలునందేయుండి వారు తమతమ స్థానములకు బోవుచు నతని కానకున్నప్పు డతఁడు తటాలున తెఱచియున్న శిరీషకుమారి శయనాగారము ప్రవేశించెను. హంతకుఁడు మాయమై ద్విజేంద్రుఁడుమాత్రము సంకేతస్థానమును చేరుటయు మిక్కిలి సులభకార్యము. హంతకుని వెంబడించుచు మేము పెద్దహాలులో పరువెత్తునప్పుడు హంతకుఁడు చిన్నహాలువైపు పరువెత్తెను. ఆహాలు చివరభాగమున నేనతనినే హంతకమార్గనిరోధమునకు నిలిపియుంటిని. అతఁడట్లు పరువెత్తుచు ముఖమునకున్నగడ్డమును మీసమును నొకచేత నూడఁబెఱికి కవచాంతరమున నందుంచెను. ఉత్తరక్షణముననే ద్విజేంద్రుఁడయ్యెను. వెనుదిరిగి సంకేతస్థానమునకు పరువెత్తివచ్చెను. అతఁడెంతశీఘ్రముగ నేతెంచినను మాయందఱికన్న నొకయర్ధనిమేష కాలస్యమయ్యెను. మాయందఱివలె తానును హంతకుని చూచితి నని బొంకెను. నేను హంతకుని రెండుమాఱులును వసంతపంచాననులొక్కపర్యాయమును గాంచితిమి. కాని యతని యాకార మిట్టిదనిమాత్ర మెఱుంగఁజాలమైతిమి. అందఱికి నతనినొక పెద్దగడ్డముండుటయు మీసములుండుటయుఁ దప్ప వేఱుకాన్పింపలేదు. కావుననే యతఁడు మమ్మందఱ వంచింపఁగలిగెను.

అయిన నతఁ డన్వేషించుచున్నవస్తు వెయ్యది? అది యింకను నందే యుండవలయును కదా? దానికై కౌముదిని నియోగించితిని. అగదులను శుభ్రపఱచుమిషపై నామె నేఁడు యాగదియంతయు పరిశోధించెను. మరునాఁటి ప్రాతఃకాలమున నాగదియందలి బల్లపై బంగారు సులోచన మొకటి యుంచఁబడియుండెను. దానిని గాంచినంతనే నా యనుమానము స్థిరపడియెను. కావున నేనపరాధపరిశోధకాధ్యక్షుఁడగు

ద్విజేంద్రుఁడు నోడించునని సంతసమున పలికితిని. కౌముదియు నరుదెంచి యీసులోచనము భూమిలో రంధ్రమున దొరికెనని వచించెను. అదియే యీసులోచనము అని న్యాయాధిపతి కొసంగి అపరాధపరిశోధక శాఖవారి భవనమున విచారించితిని. ద్విజేంద్రుఁడు చదువుచున్నప్పుడు ప్రాయుసప్రుడు కంటియద్ద ముపయోగించుచుండెనని తెలిసెను. అతఁడు ధరించునది నాచెంత నున్నదానివోలె నున్నదని సైతము వారు వచించిరి.

3 వ తేదీ రాత్రి మరల హంతకుఁడు శిరీషకుమారిని చంపుటకై తృతీయప్రయత్న మొనర్చెను. అతఁడు ప్రథమమున కార్యము నాతో ద్యమమావశకు వచ్చునని యెఱింగియుండలేదు. అయినను దానికిని సంసిద్ధుఁడై యుండెను. శిరీషకుమారి హంతకుఁడానాఁడు వచ్చుటెఱుంగును. ద్వితీయప్రయత్నమునాఁటిరేయి బల్లమీఁదనుండి మాయమైన కమ్మయే యాతిన్నీ నాదినమురాత్రి హంతకుని కలసికొనునట్లాజ్ఞాపించి యుండెను. ఏభీతికై యామె హంతకాగమనరహస్యమును తండ్రికి సైతము వెలిబెట్టవెఱచెనో, యాభీతియే నాఁడు హంతకునిసమాయోగమున కొడంబడఁజేసెను.

నాఁడు హంతకుఁడు వచ్చునని యెఱింగియే యతనిని బంధించుటకు ప్రయత్నము లన్నియు చేసియుంటిని. నేనే హంతకుండ నగునెడ, నాపత్సముద్రమున తప్పించుకొనుటకై యేమార్గముల నన్వేషించిసిద్ధముగ నుంచుకొందునో యన్నియు నూహించి నిరోధించి యుంచితిని. సోపానములును, గవాక్షములును కాచియుంచుటకై నామిత్రునివశీకర దత్తును నియోగించితిని మిగతమార్గములను కాచి నేనును, ఉద్యాన ద్వారప్రాంతముల. కౌముదీకందళులును, నుండునట్లేర్పాటు చేసితిని.

ద్విజేంద్రుఁడే హంతకుఁడని నేగుఱుతించినట్లు హంతకునికి తెలియునని నేతలంచితిని. కాని పొరపడితిని. అతఁ డసాధారణ

యగుటచే నట్లు తలంచితిని. గాని నన్నతఁడు సమానప్రతిభాశాలి యని విశ్వసింపనందున కాఁబోలు లక్ష్యము సేయఁడయ్యెను. కావున నేనతన్ను మోసగింప నొకనీచతరుణోపాయమును బన్నెను. శిరీష విజయనకునికి మత్తుమందొసంగియుండెఁగదా! మేమందఱమును భుజించుచో, తానును నా మందారగించిన వానివలె నటించెను. నేనది కృత్రిమమని తెలిసినను, నతనికి దోపనీయక యతని పర్యంకమున పరుండఁబెట్టుచో నతని హస్తతలమును బరికించితి.

ప్రథమ హత్యోద్యమదినమున నాత్మరక్షణకై శిరీష కాల్చిన పిస్తోలు హంతకుని హస్తతలమున గాయమొనర్చుట గోడపై నున్న రక్తచిహ్నము దెలుపుచుండెఁగదా? ఆ గాయము కొంతవఱకు మాని యుండినను గుర్తు యింకను నతనిహస్తతలమున నుండెను. దానినతఁడు పరాకున నుండుతఱి నెవ్వరైనఁ గనుఁగొందురేమో యను భీతిచేతనే యతఁడెప్పుడును హస్తమున నొకబట్టను నుంచుకొనియుండుట, భోజన సమయమునఁ దప్ప నతఁడు దానిని బాయుచుండ లేదు. ఇదియొక్కటియే ద్విజేంద్రుఁడు హంతకుఁడని నాకు బోధించియుండవలయు. కాని నా శేముషిపై నే నాధారపడక, బహిర్వస్తుజాలముఁ దిలకించి భ్రమించిన నా యవివేకమునకు తగిన ప్రతిఫలమందితిని. నేను ప్రక్కగదియం దుండుననియు, నతిజాగరూకుఁడనై యుండు నన్ను కనుఁబ్రామి తాను శిరీషశయనాగారము చేరి తనకార్యమును నిర్వర్తించుట యసంభవమనియు నెంచియు, ద్విజేంద్రుఁడు నాకు మత్తుమందు నొసంగెను. నే నతని ననుమానింపకుండుటకు తానే యా మందు నారగించినవానివలె నటించి కృతకృత్యుఁడయ్యెను.

నా మిత్రుఁడు నాకు ప్రతిజ్ఞ కలిగించుటకై ప్రయత్నించు సమయముననే హంతకుఁడగు ద్విజేంద్రుఁడు శిరీషశయనమందిరమున కేఁగెను. ఆమెయు నతనికై వేచియున్నదగుటచే, హంతకునికి నిరభ్యంతరముగ లోనికి దారి లభించెను. వారి సంభాషణా పర్యవసాన మతనికిఁ

దృష్టిగోలుపనందున ఘోరకార్యమున కుద్యమించెను. ఆమె యార్త ధ్వనిచే మే మందఱము వచ్చుచుంట నాలకించి, యిఁకనందు తడసిన ప్రమాదకరమని యెంచి, తాను ప్రారంభించిన ఘోరతర హత్యోద్యమ కార్యమును పరిసమాప్తి నందింపకయే యందుండి పరువెత్తెను. అటు పరువెత్తిన పిదప, మదనమోహనుఁడు వధింపఁబడిన మూలచేరువఱకు నుదంతమును ద్విజేంద్రుఁడే వచించి యున్నాఁడు. అతఁడు మదనమోహనుని వధించి, యా మూలనున్న పాచకునిగది చేరెను. ఆ గదిమిద్దెయే మేడ కుందలి చిన్నహాలుచివరభాగము నంటి దానికి 4 అడుగుల క్రింద నున్నది. ద్విజేంద్రుఁ డాగదిగోడ నెక్కి యా పైకప్పు చేరుటకు సాధనముల తొలుతనే యూహించి, యెప్పుడైనను పనికివచ్చునని సమకూర్చుకొని యుండెను. ఇవి యన్నియు నతఁడు పరిశోధకాధ్యక్షుఁడై హత్యాపరాధమును పరిశోధించుటకై యా భవనమందే నివాస మేర్పఱచుకొనినపు డొనరించెను. ఆ గదిగోడకు రెండినుపమేకులు 8 అడుగుల దూరమున నున్నవి. ద్వారబంధముఁ బట్టుకొని, యొకకాలు మొదటి మేకుపైని, రెండవకాలు రెండవదానిపైని నుంచిన, మిద్దెయంచు రెండవచేతితోఁ బట్టుకొనవచ్చును. అందుండి గోడ యందొకరాయి వీడిపోయియున్నరంధ్రమున నొక కాలునుంచిన రెండవది మరల పై యంచు చేరఁగలదు. అందుండి మిద్దెపైకప్పునకును, నందుండి, గవాక్షముగుండ చిన్నహాలులోనికిని బోయి కనుఁనులుముకొనుచు నిలుచుట ద్విజేంద్రునంతటి దృఢకాయునకు, సాముగరడీల నారితేరిన బలశాలి కొకనిమిషముకన్న నెక్కుడుకాలము కాని, కష్టముగాని పట్టదు. మిద్దెయంచుభాగము చేరినంతనే మదనమోహనునిశవముఁ గాంచి భ్రమించిన పంచాననాదులు మిద్దెవెపు పరికించి యుండరు. కావుననే యతఁడు మమ్ముల నందుండి పలుకరింపఁగలిగెను.

"హంతకుఁ డాగవాక్షము చెంత నిలిచియే "హంతకుఁడు బంధింపఁబడెనా?" యని నన్ను ప్రశ్నించెను నే నంతవఱకు హంతకుఁడు

వధింపఁబడియె నని దృఢముగ నమ్మియున్నందునను, నతఁడే హంతకుఁడని తెలిసియున్నందునను నాకతఁడు నిశ్చేష్టితుఁడనైతిని. అందునకై యాశవమును పరీక్షింపకయే వధింపఁబడినది హంతకుఁడు కాఁడని వచించితిని."

అంబికాచరణమహాశయా! మిమువంటి స్వార్థపరిత్యాగులీజగమున నుండుటరిది. తమకీ విషయ మంతయుఁ దెలిసియున్నను, పరార్థమునకై వచింపరైతిరి. హంతకుఁడెవ్వరో తామెఱుంగుదురు. అయినను హత్యాపరాధ నిందారోపణకేని శంకింపకరహస్యమును దాచితిరి. మీ ధీరచరిత్ర మెంతయు ప్రశంసాపాత్రము. అయిన నాఁడు హత్యాపరాధమునకై మేజస్ట్రీటుగారు మిమ్ము బంధించుచో శిరీషకుమారి యేదియో వచింపనెంచి పెదవులఁ గదల్చుట యెఱుంగుదురా! ఆయమ యేమి వచించెనో చెప్పుము.

"స్త్రీ ప్రాణరక్షణమునకై యీరహస్యమునంతయు చెప్పవలె"
అనికదా! ఎన్నియంత రాయములు సంభవించినను తుదకు ధర్మమే జయించెను.

పిదప న్యాయాధిపతి బలసూదనుని పరిశోధనావేశమును పొగడి "ఆర్యా! మీవలన మఱికను కొన్నిసందేహములు వాపికొనవలసి యున్నది. అందు ప్రథమమున నీనిందితునికి హంతకుని పేరు తెలియునని వచించితిరి. అయిన నతఁడేల దాని వచింపక యిట్టిసాహసమునకు దొరకొనెను? మీరు ద్విజేంద్రుఁడే శిరీషకుమారి హంతకుఁడని నిదర్శన పూర్వకముగ వచించుచున్నను నతనికేల యింకను నమ్మకము కలుగకున్నది." అని యడిగెను.

బల : న్యాయాధిపా! తమ ప్రథమప్రశ్నకు నేను ప్రశ్నరూపకముగనే ప్రత్యుత్తరమొసంగు నాసాహసమును క్షమింపుఁడు.

శిరీషకుమారికి హత్యాతత్వము దెలిసియే యుండవలయుఁగదా ? దాని నేల యెఱింగింపదయ్యె! ప్రాణాపాయము సాహసమున కేని నేలసమ్మతించె. న్యాయవిమర్శకులచెంత వచింపకున్న మానెఁగాక, తన తండ్రికైన నేల చెప్పదయ్యె ? చెప్పుట యటుండ హంతకుని హత్యోద్యమమునకు నెదురేఁగి సాయమొనర్ప నేల ! ఇవియన్నియు నాలోచింప నాయమ కేదియో ప్రబలతరకారణ ముండవలయుఁగదా! ఇందేదియో మహత్తర రహస్య మొకటి యుండవలయు. దానిని సంరక్షించుటకై యారహస్య ప్రకటనమును నిరోధించుటకై యిట్టిసాహసమున కాయమ సమ్మతించె నన్న నదిసకారణమగు కాదా ? ఈ యంబికాచరణుఁ డామెను వరించి యుండువాఁ డగుటకతన నామెనిర్మలప్రేమకు పాత్రుఁడగుటచే నా రహస్యము నెఱింగియుండవచ్చును. ప్రాణముపై నాసనైతమమాని యా రహస్యగోపనమునకు నామె ప్రయత్నించుచుండ నంబికాచరణ మహాశయుఁడు మాత్రము దానిని ప్రకటించునా ? హత్యాపరాధమున శిక్షింపఁబడుటకైన సమ్మతించును గాని—

న్యా : అయిన నా రహస్యమెయ్యది ?

బల : (మందహాసమున) నేనిపుడు హత్యాపరాధమున నిందితుఁడుగా నిందు విచారింపఁబడుచున్న శ్రీయుత అంబికాచరణమహాశయుని పరముగ సాక్ష్యమొసంగ వచ్చియుండుట లేదు. మఱచితిరి కాఁబోలు అతఁ డపరాధి కాదనుటకు నేను వలయునన్ని నిదర్శనము లొసంగి యున్నాఁడను. న్యాయవిమర్శనకై నే నీవిషయము పరిశోధన నింతవఱకు నొనరించితినిగాని, అన్యులరహస్యములు నాకేల ? నానిని నే తెలిసికొనఁగలనా ? ఇందఱు ప్రభుత్వోద్యోగులు, నపరాధపరిశోధకులును తుదకు కన్నతండ్రియునైనను నెఱుంగఁజాలనిరహస్యము నేనుమాత్ర మెట్లు భేదింపఁగలను ? ఒకవేళ భేదింపగల్గినను నితరుల రహస్యమును నేను భేదింపవచ్చునా ? ఒకవేళ నా రహస్య మెఱింగినను నేను

చెప్పవచ్చునా ? దానిరక్షణమునకై శిరీషాంబికాచరణులు ప్రాణహాని కేని సాహసించుచుండ నేను దానిని ప్రకటించి, హంతకుం డింత బాధించియు నొనరింపఁజాలని శిరీషాంబికాచరణుల మరణమునకు నే కారకుఁడ నగుదునా ? నిందితుని నిరపరాధిత్వమున కెట్టియంతరా యమును రహస్యగోపనముచే కలుగదు. కావున లోకమంతటికిని రహస్య ముగ నుండువిషయము న్యాయసభవారికైనను తమకు రహస్యముగ నే యుండుట సమంజసముకాదే ? ఇఁక తమ రెండవప్రశ్నకు ప్రత్యుత్తర మొసంగెద.

ఈ నిందితునికి హంతకుం డెవ్వరో తెలిసినను, తానెఱింగిన హంతకుఁడే ద్విజేంద్రుఁడని తెలియదు. హంతకునికి రెండుభాగములు కలవు. మీరు రిచ్చవడకుఁడు.– నేననునది హంతకుఁడు రెండురూపముల ధరించి యుండఁటిని మోసగించుచుండె నని. అందొక్కొక్కరూపమునను తనకార్యములకై యతఁడు వేసముల మార్చి, పెక్కురూపముల ధరించు చుండుటచే, భ్రమకలుగునను కారణమున నేను హంతకునికి రెండు భాగములు కలవని వచించితిని. అందొకభాగ మతనిపూర్వచరిత్రాత్మ కము, రెండవది ప్రస్తుత చరిత్రాత్మకము. అందు హంతకుని పూర్వ చరిత్రాత్మకమగు ప్రథమభాగమును మాత్రము శిరీషాంబికాచరణు లెఱుంగుదురు. మీ రెల్లరు నతని రెండవభాగ మెఱుంగుదురు. నేనొక్కఁ డనే యాతని కీ రెండుభాగములు కలవని యెఱుంగుదును. ఆ రెండును ననుసంధానించి హంతకుని నొక్కనిగా చేయుటయును నే నెఱుంగుదు. తామెల్లరును, బొంబాయియందు సుప్రసిద్ధహంతక చోరుఁడై, ధనిక కులీనసంతతికి ప్రక్కలోనిబల్లెమై, తానునొక కులీనుఁనివోలె సంచరిం చుచు నేఁడుచున్న పసిపాపలనుసైతము నెవ్వని నామోచ్చారణచే,

తల్లులు భయముపెట్టుచుందురో- రాజకీయ ధనాగారమున చౌర్యాపరాధమున తుద కెవ్వఁడు పట్టునబడి తప్పించుకొనెనో ?

అం : న్యా : ఔను. ఆ మానవరూపధారియగు రక్కసుని నెఱుంగనివా రెవ్వరు ? అయిన నతఁడు చచ్చి 4 సంవత్సరము లైనదే; ఆతని మరణము పత్రికాముఖమున ప్రకటింపఁబడి యుండుట నందఱము చూచితిమి.

బల : " ఆ రమేశచంద్రుఁడే- ద్విజేంద్రుఁడు- "

# ముప్పదియేడవ ప్రకరణము

వెుటలయందప్పుడు కలిగిన భయసంభ్రమాశ్చర్యముల నేను వ్రాయ వలయునా? పాఠకు లూహింపఁజాలరా? నాలుగు సంవత్సరముల క్రింద నతని పేరువిన్న బొంబాయియందు భీతిఁజెందనివా రుండరు. ఆతఁడు వేషముల మార్చుటయందు కడుంగడు నేర్పరి. అసమానధీశాలి అసాధారణసాహసికుఁడు- అతఁ డెందుండునో? ఎట్లుండునో? యొక్కరి కిని తెలియదు. అతఁడు చొచ్చి చొరని ధనికులగృహ ముండదు. అతఁ డపహరింపని యినుపపెట్టెలందలి ధనముండదు. అతఁ డొనర్పని ఘోరకార్యముల నామములు నిఘంటువుల యందుండవు.

ప్రభుత్వమువా రతనిని బంధింప నెంతయో దృఢప్రయత్న మొనరించి తుదకు బంధించిరి. కాని యా మరునాఁడే యతఁడు మాయమై యుండెను. అతఁడు నాలుగు సంవత్సరములక్రితము, కలకత్తా యందలి కారాగారమున బలవన్మరణమునకు గుఱియయ్యెనని పత్రికలలో ప్రకటించి యుండిరి. ద్విజేంద్రుఁడే రమేశచంద్రుఁడని వచించినంతనే న్యాయసభయందు కలిగిన యాశ్చర్యమును పాఠకు లూహింపఁగలరు.

"రమేశుఁడు మరణింపలేదు. అతనికి మాఱువేషధారి యొకఁడు మరణించెను. రమేశుఁడు తనయనుచరుల నాశనమునకుఁ దొడఁగి, గుఱుతింప కుండుటకై, ముఖమును వికృతముగ నొనర్చి సేవకసమూహమున నందుండి పరువెత్తి పోయెను. రమేశుని పలాయనమునకు నెఱిఁగిరో, లేక గుఱుతింపనేరకయో యావృత్తాంతము వెలికి రాదయ్యె. రమేశుఁడు మరణించె ననిమాత్రము వార్తాపత్రికలయందు ప్రచురింపఁబడియె.

రమేశుఁడు తన వెంటనున్న సేవకుఁడు తనరహస్యమును వెలిబెట్టునేమో యని సెంచి, యతని వధించెను. అప్పటినుండి యతఁ డెచ్చటనుండు నదియు నిప్పట ప్రస్తుతమునవసరము. రమేశుఁ డంతట గతించి తత్స్థాన మున ద్విజేంద్రుఁడు జనించెను. రెండుసంవత్సరములక్రింద నీ యూర నపరాధపరిశోధక శాఖలో చేరెను. తన శేముషీమహిమచే నచిరకాలము ననే కీర్తిచంద్రికల నార్జించెను. క్రమక్రమముగ నధ్యక్షపదవి నందెను. అతఁడు విమర్శించిన కొన్నియపరాధముల మీ రెరుంగుదురు. ఆ యభి యోగములందలి శిక్షితులందఱును నిరపరాధులు. వానియన్నిటియందు నపరాధి యతఁడే-

న్యా : అంతయు సమంజసమే. కాని, హంతకుఁ డీయపరాధము నంబికాచరణునిపై మోపనేల ?

బల : అంబికాచరణునిపై నతనికి క్రోధము కలిగెను- ఆక్రోధము నకు కారణము అంబికాచరణుఁడు శిరీషప్రేమకు పాత్రుఁడగుటయే. వారిరువురివివాహ మతనికి గిట్టదు. కావుననే హత్యాపరాధ నిందారో పణకు నంబికాచరణుఁడే పాత్రుఁడయ్యెను. దానిచే వివాహమాగి పోవును. అదియుఁగాక! యెవ్వరైన నొకఁ డపరాధి కావలయుకదా? అంబికాచరణునిపై నారోపించుటచే రెండును సాధించినట్లగును. ఈ హత్య కతఁడు కొంతకాలమునుండి యన్నియు సమకూర్చు కొనుచుండెను. అంబికాచరణుఁ డెప్పుడును పాదరక్షల 'బూట్సు' కొనుచుండెడి దుకాణమున కేఁగి యట్టివే యదే కొలతఁగల బూట్సు లను కొనెను. అప్పుడప్పు డతనివలె వేషధారణ మొనర్చుచుండెను. తపాలాఫీసునకు వెడలినదినమును చేతికఱ్ఱ కొనినదినమును నాతఁడితని వేసముననే ధరించెను. హత్యోద్యమము నాఁటిరేయి హత్యానంతరము బొంబాయికి మరలివచ్చి యా వేసముననే చేతికఱ్ఱకొనియెను. బైండరు నందలి ధూమశకటాలయోద్యోగిని వశపఱచుకొని హత్యోద్యమ

సమయములం నంబికాచరణుని వేసముననే యా స్టేషనుకువచ్చి పోవు మ
నతని భ్రమింపఁజేసెను. అతనిచే అంబికాచరణునికి వ్యతిరేకముగ
సాక్ష్యమిప్పించెను. హత్యోద్యమసమయములందే అంబికాచరణునిపేర
నతనికి పరిచితముగు "రమేశచంద్ర నామమున శిరీష హాత్యారహస్య
విషయము మాటాడుటకై బొంబాయికి రావలయు ననియు రాకున్న
దానిని ప్రకటింతుననియు బెదరించుచు నుత్తరముల వ్రాయుచుండెను.
అంబికాచరణుఁడును నెట్లైన నతనిని రహస్యము ప్రకటింపఁజేయకుండు
రీతి నొనర్పవలయుఁ గాన బొంబాయికిఁ బోవుచుండెను. ఆ రహస్యము
తన చెంతనుండువఱకు నతనిని వెలిబెట్టఁజాల రని తెలిసియే హంతకుఁడు
వీరిరువురి నిట్లు బాధించుచుండెను.

అంతటితో బలసూదనుని సాక్ష్యము ముగిసెను. అంబికాచరణ
మహాశయుఁడు నిర్దోషి యని న్యాయసహాయకులందఱు నేకకంఠమున
నుడివిరి. న్యాయాధిపతి—న్యాయసభా నిర్ధారణమున నతఁడు నిర్దోషి
యని యొసంగెను. అంబికాచరణునికి బంధవిముక్తి యయ్యెను.

విమర్శన పత్రికాపహరణమునకు కారణము వానిచే శిరీషను
బెదరించి యామె తన్ను వరింపఁజేయుటకు సాధనము లగుననియే. అవి
యమూల్యములగుటచే వానినొసంగెదనన్న శిరీష సమ్మతించునని
యతని యాశయము. కాని శిరీష సమ్మతింపదయ్యె. కావున హంతకుని
కా పత్రికలు నిరుపయోగము లయ్యెను. అవి తన చెంతనుండుట
ప్రమాదకరములు. కావుననే హంతకుఁడు తృతీయ హత్యోద్యమమున
వానిని మరల శిరీషశయనాగారమున నుంచెను.

# ముప్పదియొనిమిదవ ప్రకరణము

ఒకవారము దినములు గడచెను. న్యాయసభయందు శిరీషకుమారి రహస్యము వెలివడలేదు. ఈకార్యము ప్రవర్తిల్లి చాలకాలమైనందున నిపుడు నేనారహస్యమును ప్రకటించుటచే నెట్టి హాత్యాహితముల నొనరించిన వాఁడనుకాను. అదియుంగాక నాకు మాపాఠకులయందు విశ్వాసము కలదు. కావున నామిత్రుఁడు నాకు వచించిన రహస్యమును పాఠకులకు మాత్రము దెలుపుచున్నాఁడను.

కొన్నిసంవత్సరములక్రిందట పంచాననబాబు ఖండాంతరముల కరుగుచు తనతనయను కొంతకాల మెడఁబాయవలసివచ్చెను. అతని సోదరియొకతె యొరిస్సాదేశమందు చలానాపూరులో నివసించుచుండెను. కావున శిరీష నామెచెంతకుఁ బంపెను. ఆయమపేరు విమల. ఆమెకు పంచాననుఁడుతప్ప సమీపబంధువులెవ్వరును లేరు - ఆమెకుజీవనమునకు వలయుధనము పంచాననుఁడే పంపుచుండెను.

శిరీష చలానాపూరు నందున్నప్పుడే రమేశచంద్రుని చూచుట తటస్థించెను. ఆమె యప్పటికింకను 14వత్సరములబాలిక. అమాయకురాలు ధనికుని యేకపుత్రిక. లోకోత్తర సౌందర్యవతి. కావుననే రమేశుఁడీ కుమారి నెట్లెని నుద్వాహమాడ నిశ్చయించెను. అపుడతఁడందు నామాంతరమున నుండెను. కులీనునివలె సంచరించుచుండెను. అతఁడు విద్యాసంపన్నుఁడు. సుందరాకారుఁడు. ఆమెప్రేమను సంపాదించుటకై యామెను పలుమారు గాంచుచుండెను. ఆమెకరుణార్ద్రహృదయ యగుట నెఱింగి బీదసాదులయెడ తనకుఁగల కృత్రిమప్రేమను కార్యరూపమున నామెయెదుట ప్రకటింపసాగెను. ఆయూర · నందఱు

నతని భూతదయా శాంత శమదమాది గుణముల పొగడువారే!— అందఱు నతనివిద్యాపాండిత్యపు ధైర్యసాహసములను కీర్తించువారే!

విమలకు ప్రపంచజ్ఞాన మంతలేదు. రమేశుఁడు శిరీషకై దినమునకు రెండుమూఁడుసార్లైన నామెగృహమునకు వచ్చుచుండెను. అతఁడు ప్రథమమున విమల సద్గుణములఁబొగడుచు నామెనుగాంచుటకై యప్పుడప్పుడు వచ్చుటకు ననుజ్ఞవేడెను. విమలయు నదియంతయు సత్యమే యని భావించి యాతనిరాకకు సంతోషపూర్వకముగ సమ్మతించెను. ప్రథమమున సంభాషణ యంతయు విమల నుద్దేశించియే యుండెను. కాని యతనిచూడ్కులు మాత్రము శిరీషముఖకమలమునందే ప్రసరించుచుండెను. విమల దీనినంతయు గ్రహింపఁజాలదయ్యె. పిదప నతఁడు శిరీషతో సంభాషించుట కారంభించెను. విమలయు నప్పుడప్పుడు వారి నొంటిగ విడిచి గృహకృత్యములకై లోపికేఁగుటయు సంభవించుచుండెను.

శిరీష లోకమంతయు నమాయకమని భావించు నమాయకురాలు. ఇంకను నేమియు నెఱుంగని పసిబాల. పసితనమునుండి కడు గారాబమున పెరిగినందునను కష్టముల ననుభవింపక యున్నందునను ప్రపంచమందలి కృత్రిమము నెఱుంగదు. కావుననే రమేశుఁడు వచించు బీదలకష్టముల నాలకించి కన్నీరుగార్చును. అప్పుడు రమేశుఁడు తాను వారికష్టము నివారించుట కొనర్చిన ప్రయత్నముల నుడువ నాలించి మనమున మెచ్చుకొనును. అతని హాస్యోక్తులకు కడుపుబ్బ నవ్వును. స్నేహాంకురము క్రమమున రెండుమాసములకు ప్రేమాంకురముగ మారెనని యామె భావించెను. ఊరివారందఱు పొగడుచున్న రమేశునట్టి వాఁడు పసిబాలికయగు తనతో సంభాషింప పలుమారు వచ్చుచుండుటకు సంతసించెను. కాని దానియాథార్థ్యము నెఱుంగదు.

కొన్నిదినములు లిట్లేగడచెను. పిదప నొకనాఁడు, రమేశుఁడు దీనవదనమున నామెచెంత కేతెంచెను. తనకేదో యాపద సంభవించిన దనియు, తానాగ్రామమును బాయువలసివచ్చినదనియు, విఁక నెప్పుడామెను గాంచుట తటస్థించునో యని వగచుచున్నాననియు, నతఁడువచించెను. రెండుమాసములనుండి సంతోషముగ కాలముపుచ్చుచున్నవారి సమాగమమున కభ్యంతరము గలిగెను. శిరీష దానికై చాల చింతిల్లెను. ఆమెకపుడు రమేశుఁడు లేనిలోకము శూన్యముగ చూపట్టసాగెను. ఆమెమనోభావము లన్నియు ముఖదర్పణమున ప్రతిఫలించుచుండుటఁ గాంచి రమేశుఁడు తనమోహమును దెలిపి యామెను సమ్మతింపఁ జేసెను.

శిరీష యతని నుద్వాహమాడ సమ్మతించెను. రమేశుఁ డంతయు సిద్ధమొనర్చెను. వారు బ్రహ్మసమాజికు లగుటచే, తత్ప్రార్థనా మందిరమున వివాహము జరుగుట నిర్ధరింపఁబడియెను, ఇదంతయు రహస్యముగ నుంచుటకునైతము నిర్ధరింపఁబడియెను. ఈరహస్యవిధానమున శిరీషారమేశులకు వివాహము జరుగుచుండెను. అయ్యది యుద్యానమధ్యభాగమున నున్నప్రార్థనామందిరమున జరుగుచుండెను. వివాహ మింకను ముగియకమునుపే రక్షకభటులు లోనఁబ్రవేశించి రమేశుని బంధించిరి. సద్గుణసంపన్నుఁ డని కీర్తింగాంచినవాఁడు సుప్రసిద్ధహంతక చోరుఁడగు రమేశుఁడే యని తెలిసినంతనే శిరీషకు కలిగిన శోకపశ్చాత్తాప భయములు వర్ణింపనలవికాదు.

ఇదియే శిరీషరహస్యము. ఆమె రమేశుని ధర్మపత్ని గాకున్నను నీరహస్యమునకు వెఱచి యతని వెలిబెట్టఁజాలదయ్యె. నాఁడు మిత్రేంద్రుని యింట శిరీష చదువుచున్నది, రమేశుఁడు శిరీషప్రాసినయుత్తరమే తమ వివాహమును సూచించుటకైయే, ప్రార్థనామందిర మింకను

సహజ రమశీతుకము వీడలేదు. ఉద్యానవన మింకను సౌందర్యమును బాయలేదని వ్రాసెను.

అంబికాచరణుని కీరహాస్యము కొంతవఱకుఁ దెలియును. ద్విజేంద్రుఁడు శిరీషగదిఁ జొచ్చుట యామెకు పరిచితమగురూపముననే. తమ వివాహసమయమున నతఁడు మోదుగకుసుమములహారముఁ గూర్చి దానిని సువాసనద్రవ్యములచే సుగంధయుతముగ నొనర్చి, శిరీషకు నలంకరించియుండెను. దానికై యేహాత్మ్యామందిరమందు భయము కల్పించుటకై యుంచిన మనుజులతలపుర్రెలలో నీకుసుమముల నుంచియుండెను. అవి యామెకు తనపరిచయము కలిగించును.

రమేశుఁ డింకను నామెను వరించియుండెను. కావుననే నన్ను పరిణయమాడ నిచ్ఛయింపవేని నీవీజగతి మనఁజాలవని భీతికలిగించుటకై తలబుఱ్ఱల నందుంచెను.

నేనిదంతయు యోచించుచుండునప్పటికి నామిత్రుఁ డందు విచ్చేసెను. అతనిమోమున వికాసము లేదు. దానిఁ గాంచి నేను "మిత్రమా! ఏమిట్లున్నాఁడవు. శిరీషకుమారి సేమముగనున్నదా!" యని ప్రశ్నించితిని.

బల : ఆరోగ్యమ్ముఖయై యున్నది.

వశీ : అంబికాచరణుఁడు—!

బల : అతఁడును సేమముగ నున్నవాఁడు. శిరీషాంబికాచరణుల వివాహ మిఁకనొకమాసమునకు ప్రవర్తిల్లునని సైతము పత్రికలయందు ప్రచురింపఁబడినది.

వశీ : అయిన నీమోమున విన్నందనమునకు కారణమేమి?

బల : నేను వచించుండలేదా! ధవళవస్త్రాచ్ఛాదిత యగునొక తరుణిమూర్తియు, నాయమ సుగంధవాసనయు, నన్ను చిన్నతనము

నుండి బాధించుచున్నవి. ఆపరిమళమే యీ హత్యాపరాధవిమర్శన కాలమున రెండుమాటలు నాకు జ్ఞాపకమొనర్చెను.

వళీ : అవి యేవి ?

బల : నాఁడు మిత్రేంద్రునింట, శిరీషకుమారియు, పంచాననుఁ డును, లోని కరుదెంచినపు డీసుగంధమే నన్నాకర్షించెను. ఆపరిమళమే నన్ను అంబికాచరణశిరీషలవెనువెంట నుద్యానమునకు నాకర్షించి, వారి సంభాషణమున పాలుగొనఁజేసినది. లేకున్న యువతీయువకులు రహస్యముగ సంభాషింపఁగోరి, యేకాంతము నభిలషించుచుండ, వారిని వెంబడించునంతటి యకార్య మొనర్తునా ?

వళీ : మిత్రమా! ఆధవళవస్త్రాచ్ఛాదిత యగుతరుణి యెవ్వరు? ఆపరిమళమున కర్థమేమి ? నీ వెన్నిమాటలు లీపలుకులనే నుడువు చుంటివి గాని, దానికర్థము తెలియ లేదు. అంతయు ముగిసినది. కాని దాని యర్థముమాత్రము తెలుపవైతివి.

బల : కాదు- ప్రకృతము కాదు- ముందెప్పుడైన- చూతము అప్పుడు.

ఈసమాప్తము.

